(కాళహస్తి అనువాదిత)

# సంస్కృత వసుచరిత్ర

# సమీక్ష

శ్రీభాష్యం విజయసారథి

ప్రచురణ :

కృతి స్వర్ణోత్సవ సంచికా సమితి

# సంస్కృత వసు చరిత్ర సమీక్ష

ప్రథమ ముద్రణ : జనవరి 1994

ప్రతులు: 500



ప్రతులకు:-
యస్. బి. వరప్రసాద శర్మ
ఇంటి నెం. 16-4-144/1,
శివనగర్, వరంగల్-506 002.

వెల: రూ. 30-00

ముద్రణ:
భద్రకాళి ప్రింటర్స్,
16-4-192/1, శివనగర్,
వరంగల్. - ☎ 27632

# శ్రీ గురూపహారః

సంప్రీ జ్ఞాత సమాహితాత్మ నిరతం జ్యోత్స్నావదాత స్ఫురత్
కీర్తిం దర్శన సార్వభౌమ మతులం శ్రీసుబ్బరామాభిధమ్
మీమాంసా విషయోపపాదనపటు వ్యాఖ్యాన వాచస్పతిం
మల్లావఝ్ఝల వంశభూషణ మహం ప్రాచార్య మీడే సదా॥

అద్వైతం శ్రుతి సమ్మతం మత, మిదం తత్త్వం, తథా నిర్గుణం
బ్రహ్మైవా వితథం, నచాత్మ విభిదా, మిథ్యా జగత్ స్వప్నవత్,
తత్త్వజ్ఞానవశాద్ బుధోఽథ భవతి బ్రహ్మేతి యో బోధయ
త్యాచార్యం తమహం భజే బుధమణిం శ్రీ సుబ్బరామాభిధమ్.

విక్షేపాది విరుద్ధ వృత్తి వికృతి వ్యాఘూర్ణివలీ తర్జితం
దుస్తాథా గత భూత వాత నిహతం ద్వైతాసి పత్రార్దితమ్
మాయారణ్య పరిభ్రమ శ్రమజుషం శ్రేయో నయంతం జనం
వందే వేంకట సుబ్బరామవిబుధేంద్రం శాస్త్ర రత్నాకరమ్

ఆమ్నాతీ నిగమేషు, సాధు పఠతీ శాస్త్రే, ష్వధీతీ కలా,
స్విష్టీ సత్స్వపి సప్తతంతుషు, మహాదానేషు పూర్తీ సుధీః
శ్రేయో నైవ భజే దితీవ వదతి ప్రజ్ఞావతాం యో మణిః
ప్రాచార్యం తమహం భజే బుధనుతం శ్రీ సుబ్బరామాభిధమ్

పారాశర్య మహర్షి సూక్తి సుషమా సౌవస్తికం, తత్త్వవి
త్సంవిత్స్వాగతికం, సనాతన మత ప్రాభూతికం సర్వదా
వేదాభ్యున్నతికం త్రయీ ప్రతిభట ప్రాణాయ్య మాశబ్దికం
వందే వేంకట సుబ్బరామ విబుధం శ్రుత్యంత దౌవారికమ్.

ధన్యా వయం భవదుదార పదారవింద సంసేవ నాపగత బుద్ధిమలా భవామః
చేతో జరత్తమ తమోహర,మాత్మనీనం జ్యోతిః ప్రసాదయ పరం కృపయా గురో! నః

న్యాయ వేదాంత మీమాంసా సాంఖ్య యోగ విదాంమణే!
సదాచార్య కులోత్తంస! సుబ్బరామ మహోదయ!

సంస్కృతే నూదితస్యైషా చరిత్రస్య వసోః కృతిః
సమీక్ష భవతే భక్త్యా పారిభృతీక్రియతే మయా॥

ఆంధ్ర శాబర భాష్యాది గ్రంథ వ్యాఖ్యా విరించన।
సమీక్ష కృతి రాచార్య! గృహ్యతాం ప్రాభృతం త్వయా.

ఇతి—విధేయః
శ్రీభాష్యం విజయసారథిః

# మున్నుడి

అంతర్నిలీయ విదుషాం సజుషాముదార
గంభీర భావ రసరీతి మనోజ్ఞ వాచమ్
యా వ్యం జయత్య విరతం ప్రతిభా మయీం తామ్
ఏతాం సతాం హృది రతా మమృతాం స్మరామి

కాళహస్తి కవీంద్రేణ సంస్కృతానూదితం వసోః
సమీక్షతే చరిత్రం శ్రీ భావ్యం విజయ సారథిః

తెలుగు సాహిత్యమునకు వసు చరిత్ర మొక అమూల్య మణి హారము. రామ రాజ భూషణుని సర్వశక్తులందు ప్రతి ఫలించినవి. వసు చరిత్ర కేవల ధ్వని కావ్యమే కాదు, వక్రోక్తి సర్వస్వము కూడ. ఏ ప్రబంధ మందు గోచరింపని ఉక్తి వక్రితాది వ్యాపారములు అందు మన కగుపడును, ప్రతి పద్యమున ప్రతిభా వ్యుత్పత్త్య భ్యాసములు అహమహ మికతో పరుగులు పెట్టినట్లు కానబడును. అట్టి ఉత్తమోత్తమ కావ్యమును కాళహస్తి కవి సంస్కృతము నందనువదించెను ఏదైనను సంస్కృతము నుండి తెలుగు నందు అనువాద రూపమున అవతరించ వలసినదే కాని, తెలుగు నుండి సంస్కృతము నందు ఏ గ్రంధ మనూదితము కాలేదు. ఒక రామరాజ భూష ణుని వసు చరిత్ర సంస్కృతమున అనువదింప బడినదన్న ఆ మహా కావ్యము యొక్క గొప్పతనము ప్రత్యేకించి చెప్పవలసిన పని లేదు, కాళహస్తి కవి పుణ్యముతో తెలుగు కవుల కల్పనా నైపుణ్యము, తెలుగు కవితా కామనీయ మును మన భారత దేశము గ్రహించు అవకాశము ఏర్పడినది.

సాధారణముగా అనువాద మాసి ధారమైనట్టిది, మూల గ్రంధమందు ఉక్తి వైచిత్రులు భావముల సొగసు రీతుల రామణీయకము మున్నగు అంశ ములు అనువాదమున ప్రతిబింబించుట దుష్కరము, మరియు ఒక్కొక్క భాషలో ఒక్కొక్క నుడి కారము ఉండును, ఆ నుడి కారము వలననే భాష జీవించును. ఈ నుడి కారము వాక్య నిర్మాణము పై ఆధారపడి యుండును, వాక్య నిర్మాణము జాతులను బట్టి యేర్పడునట్టిది, జాతులను బట్టియే జాతీ యము లావిర్భవించినవి. జాతీయములు బహు ముఖముగన్నవి, సామెతలు మున్నగునవి జాతీయ భేదములు సామాన్యముగా భాషను జాతి యందుము. అట్టి జాతి రూప భాషకు జాతిత్వమును, పరినిష్ఠితిని కలిగించునవి. ముద్రాదులు, ఆలంకారికులు వీనిని శబ్దాలంకార జాతులని నుడివిరి.

జాతి ర్గతీ రీతి వృత్తి చ్ఛాయా ముద్రోక్తి యుక్తయః
భణితి ర్గుంఫనా శయ్యా పఠితి ర్భమ హానిచ
శ్లేషాను ప్రాస చిత్రాణి వాకో వాక్యం ప్రహేళికా
గూఢ ప్రశ్నోత్తరా ధ్యేయ శ్రవ్య ప్రేక్ష్యాభి నీతయః

అనునవి 24 శబ్దాలంకార జాతులు. వీని మూలముననే భాష ప్రత్యేక లక్షణమును సంతరించు కొనును. వీని నాధార పరచుకొనియే జాతీయము లేర్పడినవి. ఇట్టి జాతీయముల ప్రభావమున భాష సజీవమౌతుంది. ఒక భాష లోని జాతీయమును వేరొక భాషలోకి అనువదించలేము అనువదించినను తదర్థ స్ఫూర్తి సరిగా గోచరింపదు. వసు చరిత్రలో బహూక్తి వైచిత్ర్యములే గాక ఎన్నో జాతీయము లోత ప్రోతముగా పలుకుబడిని సంపాదించినవి. ఈ జాతీయముల యొక్క అర్థ స్ఫూర్తి దెబ్బ తినకుండ అనువదించుట ఎంతటి ప్రతిభావంతునికైనను సాధ్యపడదు. ఎంతటి వ్యుత్పన్నుడైన ఈ విషయ మున పట్టుబడిక తప్పదు.

సామాన్యముగా అనువాదకునకు ఉభయ భాషలలో కూలంకష పాండిత్యముండుట ఆవశ్యకము. ఉభయ భాషలయందలి నుడి కారము పట్టు బడినపుడే అతడేది వ్రాసినను కామనీయకము సంతరించు కొనును. ప్రతిభా వ్యుత్పత్త్య భ్యాసములు అన్యూనాతి రిక్తముగా నున్నపుడే ఆ నుడి కారము పరిపుష్ట మౌతుంది. వీనిలో ఏ ఒకటి లోపించినను నుడికారము దెబ్బతింటుంది. దాని ద్వారా అనువాద మప్రతిష్ఠ పాలగును. రామరాజ భూషణుడు వక్రోక్తుల కాటపట్టు. జాతీయముల పుట్ట. ప్రతిభా వ్యుత్పత్త్య భ్యాసముల కధిష్ఠాన దేవత వంటి వాడు, అట్టి అతని మహా కావ్యము ననువదించు వానికి అంతటి శక్తి సంపన్నత అవసరమగును. కాళహస్తి కవి మహా సాహసికుడు. ఇతడు కామాక్షీ భక్తుడు. ఇతనికి అప్పయ్య దీక్షితులు విద్యా గురువు, మంత్ర గురువు. అప్పయ్య దీక్షితుల శిష్యుడైన కాళహస్తి కవియు మహా పండితుడే కావలసి యుండును వసు చరిత్ర ననువదించిన కాళహస్తి కవి కాళహస్తి విలాసమును వ్రాసిన కాళహస్తి దీక్షితుడు ఒకరా ఇద్దరా అను సందేహము కల్గును కాళహస్తి దీక్షితుడు పరమ శైవుడు. ఇతడు తన కాళహస్తి విలాసమున అప్పయ్య దీక్షి తుల గూర్చి ముచ్చటించలేదు. అప్పయ్య దీక్షితుడు అద్వైతి కాళహస్తి దీక్షి తుడు శైవ విశిష్టాద్వైతి. కాళహస్తికవి అప్పయ్య దీక్షితుల నుండి మంత్రోప దేశమును, పొందినవాడు మరియు కాళహస్తి విలాస శైలికి ఎంతయో అంత

రము కలదు. ఈ బాహ్యాంతర ప్రమాణముల వలన వారిరువురు ఒకరు కాదని ఊహించుటకు అవకాశము కలదు ఈ ద్వైతాద్వైతా వాదములు పరిశోధన వలన తేలునట్టివి. కాళహస్తి కవి గాని, కాళహస్తి దీక్షితుడు కాని తమ గోత్రాదులను గురించి ఒక్క మాటైన చెప్పలేదు కాళహస్తి కవి అప్పయ్య దీక్షితుని శిష్యుడనని చెప్పుట వలన ఇతడు 17వ శతాబ్దమునకు చెందిన వాడని మాత్రమే ఊహించుటకు వీలు పడుచున్నది. ఈ కొంతైన కాళహస్తి దీక్షితుడు పేర్కొన లేదు. కావున కాళహస్తి దీక్షితుడు ఇతనికి పూర్వుడా, తరువాతి వాడా, సమసామయికుడా ఒకడా? అనునది సందేహాస్పదముగా నున్నది, ఈ విషయము పరిశోధించిన గాని వెల్లడి కాదు.

ఆ శ్వాసములతో నిబంధింపబడిన సంస్కృత వసు చరిత్రలో కాళహస్తి కవి తన శక్తిని ప్రదీపించుటకు ఎంతయో ప్రయత్నించినాడు. పాటించి కొన్ని చోట్ల మూల సౌందర్యమును పోషింప బహు ప్రయత్నము చేసినాడు. అనువదింప సాధ్యపడని శ్లేషలను గూడ కడు సమర్థతతో పలుచోట్ల సాధించినాడు. కాని ప్రధానముగా తెలుగు వాక్యముల ప్రభావము వసు చరిత్ర యందు కొన్నిచోట్ల మనకు అగుపడుచుండును. గద్య, పద్యములలో సంస్కృత వాక్య పద్ధతి కన్న తెలుగు వాక్య పద్ధతియే స్ఫుటముగా ప్రతి బింబించినది. కొన్ని చోట్ల అనేక వ్యాకరణ దోషములున్నవి, పలుచోట్ల అశక్తత కనపడుచున్నది, కొన్ని పద్యములలో నిర్మాణ పాటవమే కొరవడినది. మరికొన్ని తావులలో చాలా చాకచక్యము ప్రతి స్ఫురించునది ప్రతిభా వ్యుత్పత్త్య భ్యాసములు పరుగులు తీసినట్లు కొన్ని తావులలో కనుపట్టును. కొన్ని శ్లోకములు సిద్ధ హస్తుని కవిత వలె అగుపడును. యతి ప్రాసాను ప్రాసలని యమముపై పట్టింపు చూపకున్నచో ఇతని అనువాదమెంతో మూలమునకే మెరుగు పెట్టునట్లుండెడిది. అసిధారానియమమును పాటించుచు కాళహస్తి కవి విమర్శకులే ఆశ్చర్యపడునట్లు శ్లిష్ట స్థలములను పరి పుష్టం కావించుచు మూల భావమునకు ఉత్కర్ష చేకూర్చినాడు. కాని కాళహస్తి కవి వసు చరిత్రమును స్వీయ కృతియని చెప్పుకొనెను. రామరాజ భూషణుని కనీసము పేర్కొనలేదు ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయము. రామరాజ భూషణు డొనరించిన దేవతా స్తుతులను, సంస్కృతాంధ్ర కవి స్తుతులను ఇత డొనరించెను సంపూర్ణముగా ఇది తెలుగు వసు చరిత్ర కనువాదము. ఇందులో ఏ మాత్రము సందేహము లేదు, భట్టు మూర్తి గ్రంధమును అనువదించినట్లు చెప్పు కొనిన తన ప్రతిష్ఠకు భంగమేర్పడునను ఉద్దేశమున రామరాజ భూష

ఋని కాని, అతని వసు చరిత్రకిది అనువాద మని కానీ పేర్కొన కుండుటకు కారణమగునని ఊహించుటలో అంత బలమగుపడదు. తాను చెప్పుకొననంత మాత్రమున తరువాతి వారనువాదముగా గ్రహింపని సూక్ష్మ సమీక్షికా శూన్యు లగుదురా? ఏది యో ఒక ప్రబల కారణముండును. ఇది యే కాక మూలకర్త ప్రయోగించిన హరిహరి, ఆర్యా కల్ప ఇత్యాదులను 'శివ శివ', శ్రీ కల్ప యని మార్చెను. దీని వలన ఇతడు పరమ శివ భాగవతుడని తేలుచున్నది. ఏ మత మునకు జెందినను ఏ జాతికి సంబంధించినను కాళహస్తి కవి వసు చరిత్రను సంస్కృతమున అనువదించి తెలుగు వారి గొప్ప తనమును సంస్కృత లోక మునందు సాటెనని చెప్పుటలో అత్యుక్తి గాని అనృతోక్తిగాని కాజాలదు. ఇట్టి సంస్కృత వసు చరిత్రను బహు ప్రయాసలతో ఎన్నో విషయములను వెల్లడించే చక్కని పీఠికతో ప్రకాశించిన సంపాదకులు ఆచార్య బిరుదరాజు శ్రీ రామరాజు గారు అభినందనీయులు, శిలమ్మైన తావులలో సంపాదకులే జాగరూకతతో పూరించినారు.

నా బుద్ధి కొలది అనుచితముగా తోచినవి. కొన్ని తావులలో మార్పులు చేసితిని యుక్తాయుక్తతలు. సహృదయులగు ప్రతిభా చక్షువులే గమనింతురని భావింతును. సంస్కృత వసు చరిత్ర రెండాశ్వాసములపై మాత్రమే సమీక్షా నిబంధమును 196 లో వ్రాసియుంటిని. నా కృతి స్వర్ణోత్సవ సంచికను ఉదార వ్యక్తుల సహకారముతో వెల్లడించ బూనిన స్వర్ణోత్సవ సంచికా సమితి ప్రధాన సభ్యులు శ్రీ వి. మోహన్ రెడ్డి ట్రస్టీ బోర్డు చైర్మన్, శ్రీ రాజరాజేశ్వర దేవస్థానము వేములవాడ. స్వర్ణోత్సవ సంచిక కన్వీనర్ శ్రీ వి. జనార్ధన్ రెడ్డి, కరీంనగర్ గారు 25 సంవత్సరముల క్రితం వ్రాసిన ఈ సమీక్షా కృతిని సహృదయ పాఠక లోకమునకు అందించుటకై ప్రకాశించటం ముదాహం. మేలు ప్రతిని సిద్ధము చేసిన చి॥ డి. సత్యనారాయణకు (అర్చకుడు సరస్వతీ దేవాలయం యజ్ఞవరాహ క్షేత్రం) సర్వాంగ సుందరంగా స్వల్ప కాలంలో ముద్రించిన శ్రీ భద్రకాళి ప్రింటర్స్ యజమాని శ్రీ యస్. భిక్షపతి శివనగర్, వరంగల్ గారికి ప్రకాశించిన శ్రీ వి. మోహన్ రెడ్డిగారికి, శ్రీ వి. జనార్ధన్ రెడ్డి గారికి శుభాశంసనలు, ఈ సమీక్షాకృతి సహృదయ పాఠక సమాలోచకుల ప్రశంసకు నోచుకొనెనేని నిబంధ కర్తకు కావలసినదేముంటుంది

- విజయసారథి

# సంస్కృత వసుచరిత్ర

## — సమీక్ష

1. శా॥ దంతాఘట్టిత రాజతాచల చలద్గౌరీ స్వయం గ్రాహముం
గంతుద్వేషికి గూర్చి శైలజకు దద్గంగా ఝురాచాంతి న
త్యం తామోదము మున్నుగా నిడి కుమారాగ్రేసరుండై పితృ
స్వాంతంబుల్ వెలయింపఁ జాలు నిభరాడ్వక్త్రుం బ్రశంసించెదన్

శ్లో॥ శ్రీదంత ఘట్టిత శివా శ్రయ శైలలోల
గౌరీ స్వయం గ్రహ సుఖం కలయన్ స్మరారేః
గంగా ఝర గ్రసనతో జననీ ముదం ప్రాక్
కుర్వన్ కరోతు కుతుకాని కుమార వర్యః 2

తా॥ విఘ్నేశ్వరుడు తన దంతముచేత వెండి కొండను గ్రుమ్మి కోరాడుట
వలన పార్వతి భయపడి తానై శివుని కౌగలించుకొనుటచే నతనికట్టి
యాలింగన సౌఖ్యము నొసంగెను; అంతకు ముందే తన సవతి తల్లి
యగు గంగాదేవి ప్రవాహమునెల్ల తొండమున బీల్చివైచుటచే దల్లికిని
మిక్కిలి సంతోషముగావించెను. ఇట్లు తల్లిదండ్రుల నిరువుర సుల్లసిల్ల
జేసినవాడును గుమారస్వామి కన్నయు మేటి కుమారుఁడునగు గజ
ముఖుని విఘ్నేశ్వరుని మిక్కిలి స్తోత్రము జేసెదను.

అనువాదము బాగుగానున్నది. "కుర్వన్ కరోతు" అనునవి పాండిత్య దారిద్ర్యమును వెల్లడించునట్లున్నవని అనుకొనరాదు అవి అనుప్రాసకు వచ్చినవని భావించవలెను. "ప్రాక్తన్వన్ కరోతుకుతుకాని" అని మార్చినచో అనుప్రాస సొగసు తగ్గుతుంది.

2. శా॥ ఆమందాకిని మౌళి బూని నను నర్ధాంగీకృతం జేసితా
నౌ మేల్మేలని యార్వ యల్గ బ్రణతుండై తత్పతాంభోజయో
గామర్షంబున గంగయున్ మొఱయ జూడాభోగ సమ్యక్క్రియా
సామర్ధ్యంబున వేడు శంభుడు గృతి స్వామిం గృపం బ్రోవుతన్

శ్లో॥ సర్వజ్ఞేశ్వర సాధుసాధు శిరసా మందాకినీం తాం వహన్
అర్ధాంగీకృతి మాతనోర్మయి బచేత్యాగ్యా మమర్షాకులామ్
సాష్టాంగం ప్రణమన్ తదంఘ్రి యుగలీ సంపర్క కోపారవాం
సర్వేశోమసరన్ సపాతు మకుటీ సమ్యక్క్రియాకైతవాత్

తా॥ శివునకుఁ బార్వతియు గంగయు నిరువురును భార్యలుగదా. అందు గంగ శివుని తలయందుండును; పార్వతి యర్ధ దేహముగా నుండును. ఈ సందర్భములఁగొని కవి యొక కథ కల్పించినాడు. అది యేదన పార్వతి శివునితో 'ఆ మందాకినిని' అరువది యేండ్ల ముదుసలి దానిని (ఆకాశ గంగను) తలపైనెక్కించుకొని ఆర్యా పదియాఱేండ్ల (పార్వతిని) దానినగు నన్నునర్ధాంగీకారము జేసితివి సగమంగీకరించితివని యర్థము. సగము దేహముగా జేసికొంటివని భావము) అని కోపింపగా శివుడు పార్వతి కోపమును బోగొట్టుటకై యామె పాదములకు దలసోక మ్రొక్కెను. అప్పడతని తలయందలి గంగ తన సవతి యడుగులు తనకు దగిలినందులకు సైపక మొఱబెట్టెను, అట్లు కలగబాఱి మొఱయి డగా, దానిచే బెదరి తన జటాజూటమును సవరించుకొను నెపమున బార్వతి కెఱుకపడకుండునట్లు గంగను శివుడోదార్చె నని యాశయము. శివుడు శిరసు వంపగా గంగా ప్రవాహము క్రిందికి జారుట చే ఘోషించె నని భావము. "తుల్యోఽ నేకత్ర దక్షిణః" అన్నట్టులిచట నాయిక లిరువుర యందున సమానుడగుటచే శివుడు దక్షిణనాయకుడు. ఇరువుర నాయికల నిట్టులోదార్చు సమర్థుండు కృతిపతి రక్షణమందు సమర్థుండగునని ఆశయము.

అనువాదము చక్కగానున్నది సాష్టాంగమనునది మూలమున లేదు. అందు వల్ల సాష్టాంగం ప్రణమన్ అనుచోట "నత్వాతత్పద పద్మయోగ జనిత

కోఽ్రిదోద్ధతాంతామపి(శ్రీ కంఠోనునయన్ సపాతుమకుటీ సమ్యక్ క్రియా కైతవాత్
అని మార్చవచ్చు. కాని అనువాదకుని కామాక్షీభక్తి భావనాబంహిమ శివునిచే
సాష్టాంగ ప్రణామము చేయించినదని భావించవలయును.

1. శ్రీ భూపుత్రి వివాహవేళ నిజ మంజీరాగ్రరత్నస్వ లీ
లాభి వ్యక్తి వరాంఘ్రి రేణుభవ కన్యాలీల యంచున్ మదిం
దాభావింప శుభక్రమాకలనచే దద్రత్నముం గప్పు సీ
తా భామాపతి ప్రోవుతం దిరుమలేంద్ర శ్రీ మహారాయనిన్

శ్లో॥ మంజీర రత్న నిజ మంజు తనుం వివాహే
కన్యాం వరాంఘ్రి రజసా కలితాం విచింత్య
అశ్మాంఘ్రి యో జన మిషాత్ అవనీ సుతాయాః
తద్గోపనో రఘుపతి స్తనుతాం జయం నః 6

తా॥ సీత వివాహ వేది యందు వరునితోఁ గూర్చుండి యున్నపుడు తాను సిగ్గు
చేతఁ దలవంచుకుని తన పాదము వంకఁ జూచుచుండెను అపుడా
పాదము నందలి యందె ముందటి ప్రక్కఁగల మేటి రత్న
మందామె రూపము ప్రతిఫలించెను. దానిని జూచి సీత పాషాణమును
స్త్రీనిఁగాఁ జేసినట్టి రాముని పాదరేణువు సోకుట వలన నందె రత్న
మును పాషాణమే కనుక స్త్రీ యైనదోయని భ్రమించెను. రాముడది
యెఱిగి సన్నె కంటిని దొక్కించు నెపమున నారత్నమును మూసి
యాబిడ భ్రాంతిని బోగొట్టెను.

అనువాదము మూలానుగుణముగా నున్నది. ఇందు పత్రావళీ రూపమున కావ్యార్థము సూచింపబడినది. సీతా వివాహ వర్ణనమువలన గిరికా వివాహము, మంజీర రత్నమునందు ప్రతిమా రూప కన్యకా స్ఫురణవలన కోలాహలుని వలన గిరికా ప్రాదుర్భావము, రామచరణ క్రమణ వలన వసు రాజ పాదక్షిప్త కోలాహల కథాంశము అనునవి సూచింపబడినవి. ఇది మూలమందు నాందీ పద్యముగా మొట్టమొదట కూర్చబడినది.

సీ. సకల లోకాభినంద్య కలా కలాపంబు
దొరయు నెమ్మోము చందురునితోడ
బహుదివ్యఫల పరి పాక సౌభాగ్యంబు
నెరపు కెమ్మోవి మానికము తోడ
నవవయ శ్శ్రీనిదానంబు లైతగునురో
భవ సుధా పూర్ణ కుంభములతోడ
నమ్లాన సుమమాలికాభిరూప్యము దాల్చు
లలిత భుజా కల్ప లతల తోడ

తే॥ నడరి జనకాబ్ధి సీమ రామాభి ధాన
హరి కహీనగుణ ప్రోత హర శరాస
గిరి మథన యత్నమున దోచు సిరి యశేష
రాజ్యము లొసంగు దిరుమల రాయమణికి

శ్లో॥ సర్వాశ్చర్య కలా కలాపవిలసద్వక్త్రేందు సంలక్షితా
నానాదివ్య ఫలాలి సౌష్ఠవ కిరన్న హోష్ఠ రత్నాన్వితా
ఆమ్లాన ప్రసవ ప్రసగంచిత భుజా కల్పాంగ వల్లీయుతా
గుంభ ద్యౌవన కారణస్తన సుధా కుంభ ద్వయోదంచితా
అహీన గుణనద్ధేశ శరాస గిరి మంధనాత్
జనకాగ్ర స్థితా దద్యా జ్ఞయం రామా హరిప్రియా .

అనువాద ముచితముగా నున్నది. సీతాలక్ష్ముల కభేదము ఒనరింపబడినది. క్రమేణ లక్ష్మీపరముగా ముఖ చంద్రుడు అధర చింతామణి భుజాకల్పవల్లి కుచ సుధా కుంభములు నిర్దేశింపబడినవి. కాని అంగమునకు ప్రసక్తి లేదు కావున 'కల్పాంగవల్లి' చోట 'కల్పాగవల్లీ' అని 'జనకాగ్రస్థితా' చోట 'జన కాబ్ధి సుతా' యని మార్చుట యుక్తము. అట్లులే 'గుంభ ద్యౌవన కారణ' అను చోట 'శ్రీ తారుణ్య కలానిధి' యని మార్చిన బాగుండునని తోచుచున్నది.

3. మ॥ సకలా మోదక తాళవృత్త గతులన్ సంగీత సాహిత్య నా
మక విద్యాయుగళంబు పల్కు జెలికిం బాలిండ్ల జోడై సిరుల్
ప్రకటింపన్ నఖ రేఖలందు నలఘు ప్రస్తారముల్ సేయు స
ర్వ కలా కాంతుడు ప్రోచు దిర్మల మహారాయ క్షమా వల్లభున్

శ్లో॥ సంగీత సాహిత్య సమాఖ్య వాణీ
వక్షోజ యుగ్మే వరతాళ వృత్తే
ప్రస్తార పాలీ మలఘుం నఖాంకాన్
విస్తారయన్ విశ్వ కలేశ్వరో వ్యాత్

తా॥ వరతాళ వృత్తము :- ధృవాది తాళములు సంగీత పక్షమున, చంపక మాలాది వృత్తములు సాహిత్య పక్షమున, తాళ ఫలములవలె వృత్తములైనవి వక్షోజ యుగ్మ పక్షమున వచ్చునట్లు శ్లేష మూలానుసారముగా అనువదింపబడినది. 'అలఘుం ప్రస్తార పాలీం నఖాంకాన్ అనుచోట అర్థము సమన్వయించుట కష్టము. నఖాంకములకు ఇది వేశేషణము కావలసి యుండెను. నఖరేఖలందు నలఘు ప్రస్తారముల్ సేయ= నఖరేఖలను బాల చంద్రాకారముగా అనగా నెలవంకలు గలవానిగా నఖక్షతములను పాలిండ్లయం దొనరించుచని, గురు ప్రస్తారములు గలవానిగా నఖరేఖలు గల్పించునని విద్యా పక్షము, రలయోః రభేదః అన్నట్లు రేఖలన లేఖలని, నఖపదమునకు స్వాశ్రయములగు అంగుళులని గ్రహించినచో అగుళి లేఖలనగా వేలి చేత వ్రాయు వ్రాతలను అర్థము వచ్చును. అలఘువైన ప్రస్తార పాళిని నఖాంకములను వాని యందు విస్తరింపచేయుచు, అనే అనువాద వాక్యమున సంగీత పక్షమున అలఘు ప్రస్తారములను, సాహిత్య పక్షమున నఖాంకములని గ్రహింప వీలులేదు. నఖరేఖలన్నప్పుడున్న అర్థస్ఫూర్తి నఖాంకములన్నప్పుడు సంగీత, సాహిత్య పక్షమున కలుగదు, ప్రస్తార పాళిని సంగీతమందు అనగా రాగ ప్రస్తారములను అలఘు ప్రస్తార పాళిని అనగా గురువృత్త ప్రస్తారములను సాహిత్యమందు, నఖాంకములను వక్షోజయుగ్మమందు విస్తరించుచున్నాడని అర్థమును గ్రహించి నతి

పెట్టుకొనవలసి యున్నది. ఇది క్లిష్ట కల్పన. 'రేఖా గురు ప్రస్తరణాంచితా నక్షైః సంపాదయన్' అని మార్చిన మూల భావస్ఫూర్తి కలుగుతుంది.

4. తా॥ రమణీయాక్ష సరాకృతిం బోలుచు వర్ణ శ్రేణి వీణానులా
పము చేతం గరగించి యందు నిజబింబం బొప్పనచ్ఛామృత
త్వము నాత్మ ప్రతిపాదకత్వమును దద్వర్ణాళియం దెల్లఁ బూ
ర్ణము గావించిన వాణి తిర్మల మహా రాయోక్తిఁ బొల్చుంగృపన్

శ్లో॥ స్వచ్ఛాక్షదామ మిష సంశ్రయ వర్ణబృందే
వీణా రవ ద్రవ మయే విమాలాత్మ బింబాత్
ఆవేదయత్యమృతితాం నిజవాచకత్వే
వాగీశ్వరీ దిశతు వాంఛిత మస్మదీయమ్

తా॥ సుందరమైన యక్షరమాలికా రూపాపమగు నక్షర పంక్తిని వీణానాదముచే నీరుగా గరగించి యా నీటియందు దన నీడ యగుపడగా నా అక్షర పంక్తి నచ్ఛామృతమును (శుద్ధ బ్రహ్మమును-అచ్ఛంపు నీటిని) ఆత్మ ప్రతిపాదకమును (బ్రహ్మ ప్రతిపాదికమును బింబ ప్రతిపాదకమును) పూర్ణముగా గావించినట్టి సరస్వతి తిరుమల రాయని వాక్కునందు దయతో నెలకొని యుండుగాత. వర్ణములం దెల్ల నచ్ఛామృత్వము నాత్మ ప్రతిపాదకత్వమును బూర్ణము గావించిన దిట్టి. గాన తిరుమల రాయోక్తి యందును నచ్ఛామృతత్వమును — అనగా నచ్ఛంపు నమృతంబు నగుటయు, ఆత్మ ప్రతిపాదకత్వమును — అనగా దన సారస్వత విభవమును వెలయించుటయు, జేయుఁగాత — అనగా దిరుమల రాయని పలుకులు మీఁదు మిక్కిలి యచ్ఛంపు నమృతమువలె రుచులు గలుకుచు మఱిమఱి చాకచక్యవిభవము గలిగియుండునట్లు చేయుగాత యని యభిప్రాయము.

మూల భావము చక్కగా ప్రతిబింబించినది. 'తద్వర్ణాళి యందెల్ల' అను మాటకు నిజవాచకత్వే, యని అనువాదము సరసముగా నున్నది. 'మిష సంశ్రియ' అనుచోట 'సంశ్రిత' అనుట యుక్తము.

6\. సీ॥ ఘనఘనా ఘనలక్ష్మి నెనయు కొప్పిరుగడ
నిరుగడఁ దరుణాబ్జ కృత వతంస
మురు చిత్రకాగ్ని శిఖోన్మేష మిరువంక
నిరువంకఁగుండలి స్ఫురితకర్ణ
ముడివోని మిన్కు లీనెడు పేరు లిరుదెస
నిరుదెస గమల బంధుర కరంబు
నెఱి మించు చిఱుత వన్నియ చేల మిరుమేన
నిరుమేన రతి మనోహర విభూతి

తే॥ యమర సన్యోన్యవేష బేదాసహిష్ణు
భావ విభవంబు దెలుపుచు బరమమైత్రి
మగనిసామేన నిలిచిన యగతనూజ
ప్రథన జయ మిచ్చు దిరుమల రాయమణికి.

శ్లో॥ ఘనాఘనశ్రీ ఘనకైశ్య మబ్జ
వతంసితం కుండలి వర్ణ్య కర్ణమ్
ద్వైపాంబరం చిత్ర సమంచితాగ్ని
శిఖం ప్రకాశాగమ హేతుధామ
రతీష్ట భూతిం కమలాభిరాజ
త్పాణించ యా పార్శ్వ యుగేన దత్తే
సాన్యోన్యవేషా స్త్రభిదాఽతిహార్దాత్
ఊరీకృతేశార్ధతనూ రుమాఽవ్యాత్

తా॥ సాంబమూర్తియందు, పార్వతీదేవి తన ప్రక్కను శివుని ప్రక్కను ఘనాఘన లక్ష్మి నెనయుకొప్పు, తరుణాబ్జకృత వతంసము. మొదల గునవన్నియు సమానములుగా నమరుచుండగా దానఁజేసి దనకును శివునకును వేషము లందు భేదమెంత మాత్రము లేకుండవలయునని మిక్కుటమయిన యభిప్రాయమును గలిగియుండుటను దెలిపినదయ్యె.

అట్లు పెనిమిటి యర్ధదేహమున గాఢంపు నెయ్యమున నెలకొనియున్న పార్వతి తిరుమల దేవరాయలకు యుద్ధములందు జయమొసంగుగాత.

అతి సమర్ధతతో శ్లేష నిర్వహింపబడినది. కాని 'ధామ' స్థానమునదామ, యనుట భావ్యము. ప్రకాశ స్వరూపములైన వేదముల ఆవిర్భావమునకు కారణమైన బ్రహ్మ యొక్క కపాల మాలయని, కాంతుల యొక్క ఊటను కలిగించు పూలదండయని (కాంతులూరుచున్న పూల దండ యని) శివ పార్వతుల పరమైన అర్థము. ధామ పదమునకు మాలికార్థమున ప్రసిద్ధి లేదు. మరియు మూలమున 'మగని సామేన నిలిచిన యగతనూజ'= (మగని అర్ధ శరీరమున నిల్చిన పార్వతీదేవి)యని కలదు. అనువాదమున కామాక్షీ భక్తుడగు కాళహస్తి కవి కామాక్షీ భక్తినే గాక తత్పారమ్య వాదమును వెల్లడించినాడు. "సర్వజ్ఞేశ్వర సాధుసాధు" అను శ్లోకమున - సాష్టాంగం ప్రణమన్ అని మూలమున లేని సాష్టాంగ నమస్కారము శివునకు కల్పించుట ఆతని శక్తి పారమ్యమునకు ఉపోద్బలక మగుచున్నది. "ఊరీకృతే శార్ధతనుః- అనునపుడు ఈశ్వరునకు అర్ధ శరీరముగా నుండుటకు నంగీకరించినదని గ్రహించవలసి యుండును. అనగా ఈశ్వరునకే అర్ధశరీర ప్రదాన మంగీకరించినదని తాత్పర్యము

(మూలమున దేవతాస్తుతులు కృతి పత్యాశీర్వచన పరములుగా నున్నవి. అనువాదమున కృతి పతి తప్ప మిగిలినవి యధామూలముగా నున్నవి.)

8. సీ॥ తరుణాశ్మ-కటకోద్ధతి జూపె నెవ్వాడు
రుచులచే ఫలమోహ రుచుల చేత
సకలంక రామ ముద్రిక బూనె నెవ్వాడు
శయముచే హృత్కు-శేశయముచేత
మున్నీరు పల్వలంబుగ దాటె నెవ్వాడు
జవముచే గుణగణార్ణవము చేత
నక్షశిక్ష ప్రౌఢి నలరారె నెవ్వాడు
రణముచే నియమ ధారణముచేత

తే॥ ధరణి నెవ్వాడు దానవ ద్విరద దళన
విహృతి దనకేసరి కిశోర వృత్తి దెలిపె
నతని మత్కావ్య భవ్య వాగమృత ఘటన
మంజుల స్వాంతు హనుమంతు మది దలంతు

శ్లో॥ అథ నిరతిశయ శైశవ ఏవ యో మహనీయో రుచిభిః
ఫల మోహ రుచిభిశ్చ తరుణ తరణి కబలన సముద్ధతిం
దర్శయామాస, యోవాశయే హృత్కుశేశయేచ,
రమ్య రామ ముద్రికా ముువాహ, యోవా జవేనగుణ
గణార్ణవేనచ పల్వల మివ పయోధిం తతార.
యోవా రణేన నియమ ధారణేనచ మహాక్ష శిక్షా విచక్షణ
తయా రరాజ, యోవా దానవ ద్విరద దలన విహరణేన నిజ
కేసరి కిశోర వృత్తిం ప్రకటయామాస. తాదృశ మహిత మహిమ
వంత మన్తరంగే సంతతం చింతయామి ధీమన్తం మృదుస్వాంతం
యశోవంతం హనూమంతమ్

తా॥ ఎవడు పండని భ్రమించి దానియందలి రుచులచేత (చవులచేత) బాల సూర్యుని బట్టి నుంకించుటయే గాక, దేహ రుచులచేత (కాంతులచేత) బాల సూర్యుని దిరస్కరించెనో, ఎవడు రాముని యంగుళీయకమును సీత కానవాలుగా జేత దాల్చి కొంపోవుటయేగాక రాముని స్వరూపమును హృదయార విందమునందు ముద్రించినట్లు భక్తిని దాల్చి యుండెనో, ఎవడు సముద్రమును వేగముచేత నేకాక చక్కని పరాక్రమాది గుణముల చేతను నంతరాయములను దొలగించుకొని చాటి పడియవలె నవలీల దాటెనో; ఎవడు యుద్ధము చేసి అక్షుడను రావణుని పుత్రుని జంప నేరుపు నెఱపుటయేగాక బ్రహ్మచర్యాది నియమముచే అక్షములను (ఇంద్రియములను) గూడ జయించు నేర్పు నెఱపెనో, ఎవడు రాక్షసు లనెడి యేనుగులను సింహపు బిల్లవలె జీల్చెనో, కేసరి యను వానరుని కొడుకగునట్టి హనుమంతునిని మనః ప్రసాదముతో నాకావ్యమున నమ్మృత

ప్రాయములయిన మంచి వాక్కులను బొందించు గాక, యని కోరి మనసున ధ్యానించుచున్నాను.

అనువాదమున, మత్కావ్య భవ్య వాగమృత ఘటన అనునది విడువ విడువబడినది. హనుమంతుడు రాజరామభూషణుని ఇష్ట దైవము కాని, కాళహస్తికి కాదు. అందువలన కేవల మృదుస్వాంతుడు హనుమంతుడైనాడు. మహిత మహిమ వంతం ధీమంతం యశోవంతం అను విశేషణములు మూలాధికములు.

9. సీ॥ భువి గవితా కన్య బుట్టించె నెవ్వాడు
బడి నాగమము లెల్ల నడిపె నెవ్వ
డేను నీ వనుమాట లెనయించె నెవ్వాడు
కోమల పదలీల గూర్చె నెవ్వఁ
డనఘతులాకోటి నలరించె నెవ్వాడు
నిఖిల గుణంబుల నేర్చె నెవ్వఁ
డినకర సంప్రాప్తి నెసగించె నెవ్వాడు
రహినించె నర్థ గౌరవము నెవ్వఁ

తే॥ డట్టివాణీ గురుత్వ మహత్త్వ ఖనుల
ఘనుల బ్రాచేతసవ్యాస కాళిదాస
దండి భవ భూతి మాఘ సత్కవి మయూర
భారవుల భారవుల నాత్మ బ్రస్తుతింతు

శ్లో॥ యః కన్యాం కవితాం క్షితా. వజనయత్ యోవా తతానాగమాన్
యోవాహం త్వమితీరణాం వ్యరచయ ద్యోదాత్ పదాలిం మృదుమ్
య స్స్వానంద మజీ ఘటత్ ఘనతులా కోటిం గుణాన్యోదిశత్
యేనాపీన కరాప్తి రర్థగురుతాం యోపూపురత్ విశ్రుతామ్.

అనువాదము సమంజసముగా నున్నది. యేనాపీన అనుచోట యచ్ఛబ్ది మునకు పర్క్రమ భంగమేర్పడినది. ఎవనిచే ఇనకర గ్రహము,

పొందబడెనో అని దీని అర్థము. ఇది అంత సరసముగా లేదు. యోగాచ్చేన కరాప్తి షర్థగురుతామ్ అనుటస్ యుక్తమని తోచును. యచ్ఛబ్దములచే వరుసగా కవితా జనకుడు వాల్మీకి ఆగమ కర్త వ్యాసుడు త్వమేవాహమన్న కాళిదాసు పద లాలిత్యం గల దండి, భవభూతి, మాఘుడు సూర్యశతక కర్త మయూరుడు అర్థ గౌరవము నెరపిన భారవి అనువారు నిర్దేశింపబడినారు. తరువాతి శ్లోకములో ఇదే నామ క్రమం చెప్పబడినది.

శ్లో॥ వాల్మీకి పారాశరి కాళిదాస
దండి ప్రహృష్యద్భవభూతిమాఘాన్
వల్గన్మయూరం వర భారవించ
మహా కవీంద్రాన్ మనసాభజేతాన్

ఇది సీసగీతపద్యమున కనువాదము. అనువాదము చక్కగానున్నది.

శా॥ భావం బెక్కడ లేక వృత్త నియమాపాయంబు జింతింపకెం
దే వర్తించి పరార్థ వంచనలచే దీపించి మూర్ఖాలి సం
భావింపం గుకవి ప్రణీత కృతి సామాన్యాకృతిం బూనిపై
పై వన్నెల్ పచరింప దాని దిలకింపం బోరు ధీరోత్తముల్.

శ్లో॥ సంత్యక్త వృత్త నియమాం సకలాస్త భావామ్
అన్యార్థ వంచన పరా మతి మూర్ఖ నంద్యామ్
ఉత్సేకినీం కుకవితా ముపరిష్టవార్థాం
దీరోత్తమా న గణయంతి ధృతానుభావాః

తా॥ ఏ పట్టునందును వ్యంగ్యార్థము లేక, శార్దూలాది వృత్తముల ప్రాసాది నియమములను విమర్శింపక, యెక్కడనో పామరుల యొద్దc జదువం బడినదై, ఇతర కవుల శబ్దార్థములను దొంగలించుటచే వన్నె గాంచుచు పామర సమూహము మెచ్చుకొనగా కుత్సిత కవి రచించిన గ్రంథము పయిపయి తళుకులుచూపునే కాని లోన సారస్యము లేకుండును. గావున,

దానిని పండితోత్తములు విమర్శించి చూడనైనను జూడరని అర్థము. ఎవరి యందును మనసు లేక నడవడి నియతి తప్పుటయు, సరకు సేయక, యెల్ల ఎడల వ్యభిచరించి, యితరుల ద్రవ్యమును మోస పుచ్చి, వాసికెక్కి, మూర్ఖురాలయిన చెలికత్తె యందులకు మెచ్చుకొనగా పయిపయి తళుకులు భోగముది పచరించును గాన మనస్సు చిక్కం బట్టిన ధైర్యశాలురు దానిని గన్నెత్తియు జూడరని యర్థాంతరము.

ఇందు వేశ్యకు కుకవితకు ఔపమ్యము స్ఫురింప జేయబడినది. ఎచ్చట కూడ ఎట్టి ఉద్దేశము కాని, తాత్పర్యము కాని, లేక వృత్తముల యొక్క యతి ప్రాస నియమములను పాటింపక, ఎక్కడనో కొద్దిగా చదివి, పర కవుల శబ్దార్థాదులను దొంగిలించి (లేక పరుల పద్యములను దొంగిలించి) పామరుల కడ ప్రాగల్భ్యమును పలుకుచు వారి మన్ననల నందుచు మిడిసి పడెడి అధమ కవుల కృతులు సార రహితము లగుట వలన ఉత్తములు వానిని తిల కింపరని అధమ కవుల నింద; ఇందు మధ్యమ కవుల గర్హణ కూడా స్ఫురించు చున్నది, రసభావాది వ్యంగ్య రూపమగు రమణీయ భావము లేకుండ, ఏ వృత్త మే భావమునభివ్యక్త పరచునో ఏ భావ మే వృత్తమునకు పసాకారకమో అను విషయము నెరుగక స్వేచ్ఛగా వృత్తముల వాడుచు, కావ్యైక దేశమున అనగా కథను పోషించుటలోనో, పద్యము నల్లుటలోనో ఏదో ఒక విషయమున పరిస్థితి గాంచి అంత మాత్రమున మహాకవుల మనుకొనుచు ఈ పదమున మహావ్యంజకత యున్నది. ఈ కల్పన ఎవరు చేయలేదని మృషార్థముల ద్వారా పరప్రత్యయసేయ బుద్ధులను మోసపుచ్చుచు. పక్షపాత వైఖరిగల మధ్య మాధికారుల సమ్మతుల గాంచి మిడిసిపడు మధ్యమ కవుల కృతులు సామా న్యాకారమున భాసిల్లుచు శబ్దార్థాలంకార రూపమగు తళుకు బెళుకులను చూపినను ఉత్తములు వానిని సమాలోకింపరని మధ్యమ కవి నింద అభివ్యక్తమగుచున్నది. ఎందే వర్తించి ఇత్యాదులు ఈ అభ్యూహకు పోషకములు, ఎవరియందు మనస్సు నిలుపక, నియమము నుల్లంఘించి మోసముతో పరుల ధనమును కబ ళించి, చేటికలు మెచ్చుచుండ పైపై వన్నెలు పచరించుచు, మిడిసిపడెడి వేశ్య లను నియమ పరాయణులైన ఉత్తములు కన్నెత్తైన చూడరని వేశ్యాపరమగు అర్థము. అనువాదమున సామాన్యాకృతి యనునది లేదు. వేశ్యాపదమభిహితము

కాకున్నను, తదర్థము అభివ్యక్తమగును. అనగా విశేషణ సామ్యము వలన వేశ్యా పదము లేకున్నను అప్రస్తుతమగు తదర్థము స్ఫురించును. మూలమున శ్లిష్టోపమ, అనువాదమున సమాసోక్తి యని గ్రహింప వచ్చును సకలాస్తభావామ్= అన్ని పదములందు కలావేత్తలచే నిరసింపబడిన భావము కలదని, అందరి యందు అస్తమించిన భావము కలదనియు గ్రహింపవచ్చును.

10. మ॥ మహిమున్ వాగను శాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
నృమహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించునీ
బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమున దత్ప్రాగల్భ్య మూహించెదన్.

శ్లో॥ వాక్శాసన ప్రథిత కుండలి వల్లభశ్రీ
నాథేషు సద్ధజనన స్థితి పాల నేషు
సోమేచ శోభయతి భాస్కర నామ్ని చాంధ్ర
కావ్య ప్రపంచ మహిమా నహి మాననీయః

తా॥ భూమి యందు మొదట నన్నయభట్టు కవితను పుట్టింపగా, తిక్కన సోమయాజి దాని యునికికి నాధారభూతుడై నిలువగా, శ్రీనాధుడను కవి పోషింపగా, సోముడును భాస్కరుడు నను కవులు మిక్కిలి తేజము దీపింప దానిని ప్రకాశింప జేయగా, పెంపారుచు నధికముగా విలసిల్లు చున్న యీ యాంధ్ర ప్రబంధ విస్తరమును బట్టి యాకవుల ప్రౌఢి యిట్టిదిగదా యవి భావించుచున్నాను అని వాక్యార్థము. మొదట బ్రహ్మ సృజింపగా, నాదిశేషు డాధారమై నిలువగా విష్ణువు ప్రోవగా చంద్ర సూర్యులు మిక్కిలి ప్రకాశముతో వెలిగింపగా పెంపు నొందియున్న యీ ప్రపంచమును బట్టి యా బ్రహ్మాదుల పౌఢి యిట్టిది గాదాయని యెన్నుచున్నానని వ్యంగ్యము.

ఈ బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమునకు, నన్నయ బ్రహ్మగా సృష్టి గావించినాడు. తిక్కన ఆదిశేషుడుగా స్థితి కల్పించినాడు. శ్రీనాధుడు

శ్రీపతిగా పాలన నొనరించినాడు. సోమ భాస్కరులు చంద్ర సూర్యులుగా వెలుగు ప్రసాదించినారు. వారి ప్రాగల్భ్యము సంభావింతునని పద్య భావము. ఇందు నన్నయ, తిక్కన శ్రీనాధ, సోమ భాస్కరుల ప్రశస్తి గలదు. కాని ఎఱ్ఱన ప్రసక్తి లేదు. ఇందేకాదు నరసభూపాలీయ హరిశ్చంద్ర నలోపాఖ్యానము లందును అతని స్తుతించినట్లు లేదు. అతని పేర్కొనక పోవుట తన కిష్టము లేకనా, లేక అతనిలో ప్రశంసింపబడు లక్షణము లేకనా, యను శంక మనకు కలుగక పోదు, వాస్తవముగా ఈ రెండు వికల్పములు రామరాజ భూషణునకు లేవు. ఎఱ్ఱనను పేర్కొన వలసినదే కాని అతనిని నన్నయ, తిక్కనాదుల వలె పేర్కొనుటకు సాధ్యపడదు. ఎఱ్ఱనను ప్రబంధ పరమేశ్వరుడుగా పేర్కొన వీలులేదన్న మాట, కారణము తానే ప్రబంధ పరమేశ్వరుడగుట తానీ ఉక్తిమయ ప్రపంచమునకు ఉపసంహారకుడ నగుదునను భావము నిక్షేపింప బడినది. అందు కొరకే కావ్యపదములను సామాన్యముగా నుపయోగింపక బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమని ఉక్తి పదమును విశిష్టముగా జేర్చినాడు. అన్ని రకముల ఉక్తులను ఎవరికి మిగుల్చక తానే పొందుపరచినాడని దీని భావము. ఇక తన తర్వాత ఈ ఉక్తి మయ ప్రపంచ మగుపడదు. ఎక్కడనో ఒక చోట కొన్ని ఉక్తులు అగుపడినను అవి తన ఉక్తికి అనుసరణ రూపము గానో, అనుకరణ రూపముగానో, భాసిల్లును. కావున తాను ఈ బహుళాంధ్రోక్తి మయ ప్రపంచము నుపసంహరించు చున్నానని తనయందే ప్రబంధ పరమేశ్వరత్వము చెల్లునని, మరియొకరికి ఈ ప్రబంధ పరమేశ్వరత చెప్పవలను పడదని నిర్దేశించినట్లు స్ఫురించుచున్నది. ఈ ఉద్దేశము వలననే ఎఱ్ఱనను పేర్కొనలేదు. అతని యందు భక్తి లేమి కాని ప్రశంసనీయత లేమి కాని కారణము కాదు.

ఇందే పీఠికావచనము ఈభావనాభ్యున్న యమునకు వినిగమక మగుచున్నది. "ఒక్క మహా కావ్యంబు రసోచిత చమత్క్రియా కల్పనా కల్పభవ్యంబుగా నొనరింపం బూని" ప్రథమాశ్వాస పీఠిక.

రసోచిత చమత్క్రియా కల్పనా కల్ప భవ్యమనగా రసోచితములగు కల్పనలకు అకల్పము భవ్యమని సామాన్యార్థము రసోచిత చమత్క్రియా కల్పనకు (కల్పనా మయ జగత్తునకు) కల్పమైనను భవ్యమైనదని అర్థాంతరము.

ఈ నా మహా కావ్యము రసోచిత చమత్క్రియా కల్పనా మయ కావ్య ప్రపంచమునకు కల్ప ప్రాయ (ఉపసంహారక) మైనను పరమేశ్వరుని ఉపసంహారము వలె భవ్యేతరము కాదు, భవ్యమైన దేయని అర్థాంతరమును నిక్షేపించినాడని అభ్యున్నయించుటలో అనాఁజస్య మగుపడదు.

వసు ప్రభు ర్వాస వదౌత్యరీత్యా కోలాహలాద్రీశ కుమారి కాయాః
గీతోజ్జ్వలాయా గిరికాభిధాయాః కల్యాణ శాలీతి కథాస్తు పుణ్యా
కథామిమాం కోమల గద్య పద్యైః యథా మనీషం రచయామి రమ్యామ్
బుధావలీ కర్ణ పుటేషు పేయం సుధాభవే దద్రి సుతా మహిమ్నా.

నైమి శారణ్యమున తపశ్శ్రీ సంపన్నులగు శౌనకాదులు సూతుని జూచి మహానుభావా! పూర్వకాలమున ఏ రాజు దివ్య చిహ్నధరుడై భూమండలమును పరిపాలించెనో. ఆ రాజును మాకు తెల్పుమని అడుగగా సూతుడు వారికి శక్రోపాదిత దివ్య చిహ్నధరుడు చంచద్విమానాధి రాజ క్రీడాపరుడు అమానుష సత్త్వాఢ్యుడునై వసురాజేంద్రుడు భూమండలమును పాలించెను. అతని చరిత్రను వాక్ప్రౌఢి మీర విన్నవింతు నని మూలమున కలదు. అనువాదమున వాసవ దూత్యము వలన వసురాజు కోలాహలాద్రీశ కుమారిక యగు గిరికను వివాహమాడిన కథ పుణ్యావహమైనది. అట్టి రమణీయ కథను కోమల గద్య పద్య రూపమున నా బుద్ధికొలది కూర్చుచున్నాను. కామాక్షీ ప్రభావమున ఆ కథ పండిత కర్ణపుటములకు అమృతమగు గాక యని పేర్కొనబడినది. దూత్యమనుట యుక్తము.

93. సీ॥ వర సుమనోభవ్య తరుల కావాల మత్యలఘు కలాపాలి కలరుభరణి
సరిలేని తెలిముత్తె సరుల కొటారు క, ల్యాణ పరంపరల తొలుదీవి
సురుచిరమణుల కా కరసీమ శ్రుతిహిత, భాషిత ద్విజకోటి పట్టుగొమ్మ
సరసుల కారామ సరణి శ్రీరంగగే, హ క్రోడ వాసిని కాటపట్టు

తే॥ వెలయు నావరణాంబుసం పీతహాట, కాండ మోహాద పరిఖావృతాంఘ్రివజ్ర
దంతుర ప్రాంత గంగా నిరంతరాగ్ర, భూరివరణం బధిష్ఠాన పురవరంబు

శ్లో॥ అస్తి ప్రశస్తా హరిరాజ ధాన్యైః పుణ్యైరధిష్ఠాన పురీ సమృద్ధా
బ్రహ్మాండ ధీకృత్ప్ర దక్షేయ మధ్య హీరాగ్ర గంగా వృత హేమ శాలా

తా॥ అధిష్ఠాన మను పట్టణము మంచి వృక్షములను, మహనీయ హృదయములను, సకల కళావంతులను; గొప్ప యాభరణములను, తెల్లని ముత్తెములను, తెల్ల ముత్తెపుసరి వడ్లను, బంగారమును శుభ పరంపరలను, మేలైన రత్నములను, సుందరాకారలయిన స్త్రీలను, వేదాధ్యయన సంపన్నులయిన బ్రాహ్మణులను, నింపయిన రవళిసేయు శుక పికాది పక్షులను, రసజ్ఞ జనులను, కొలంకులను, లక్ష్మియు, నర్తకులను గలదయి వెలుంగుచుండును. దాని బంగారు కోట, క్రింద నగడ్త జలమును ప్రక్కల తెల్లని నీరువలె నున్న వజ్ర కాంతులను పయిని గంగా జలమును నావరించి యుండుట చేత మహాజలముచేత నావరింపబడి యున్న సువర్ణ మయమైన బ్రహ్మాండము వలె విలసిల్లుచుండును.

ఇది గీత పద్యానువాదము. పరిఖా జలముతో, పార్శ్వ భాగమందలి వజ్ర కాంతులతో, అగ్ర భాగమందు ఏ మాత్రమెడము లేక గంగా ప్రవాహము దాకి ఆవరించిన అధిష్ఠాన పురమందలి బంగారు కోట ఆవరణ జలముతో కూడిన సువర్ణమయమగు బ్రహ్మాండమువలె కన్పట్టుచున్నదని మూలము. అనువాదమున ఆ సొగసు రాకపోవుటయే గాక అర్థము సైతము సరిగా స్ఫురించుట లేదు = స్వర్ణాండ ధీకృత్పరి ఖాంఘ్రిహీర ప్రాంతాగ్ర గంగావృత హేమసాలా. యని మార్చిన కొంత అర్థక్లేశ ముండదు. కాని అప్పటికి 'ఆవరణాంబు సంవీత' అను విశేషణము లేనందున మూల భావమునకు విస్ఫూర్తి కలుగదు

గ॥ అపిచసా సుమనోవరాగమానా మతిశయాల వాలం,
భవ్యకలా పాలినాం భరణ్యాస్పదం, లాలనీయ ధాన్యముక్తా
సరాణాం లలితాధార భూమిః, కళ్యాణ పరంపరాణాం కనదంతరీపం,
మహారుచి రమణీనాం మహితాకరసీమా, శ్రుతిమంజు వచనద్విజానాం
శోభన శంఖా సలబనం, వరసింద్రాణాం సన్నుతారామ సరణిః,
శ్రీరంగ మందిర క్రీడ వాసిన్యాః శ్రీ విశాలా లాస్యశాలా.

ఇది సీసమున కనువాదము. శ్లేష చక్కగా కూర్చబడినది. వరసుమనో భవ్యతరులకు అనునది భవ్యతరు భవ్యతర పదముల బహు వచన రూపము. దీని ననువదించుట కష్టము. ఐనను కాళహస్తి కవి సుమనోవరాగమానామ్ అను పదాంతరమును గొని అర్థద్వయము పొందుపరచినాడు. ఆగమ అగమ పదములకు సంది కల్పించి చాకచక్యమును ప్రదర్శించెను. సహృదయులై చక్కని శాస్త్ర జ్ఞానము కలవారని, పూలుగల వృక్షములని సుమనోవరాగమ పదమున కర్థద్వయము. భవ్యకలా పాలీనా మని ఉండవలయును. భవ్యకలా+ పాలీనామ్ భవ్యకలాప + అలీనామ్, అని అర్థ ద్వయమున విభాగము. భరణీ అన్న చాలు అస్పదమనవసరము. మూలమున కలాపాలిక లలరు భరణి యనియే ఉన్నది. సరిలేని తెలిముత్తెసరుల కొటారు= సాటిలేని ముత్తెపు సరులనే ముత్తెసరిపడ్ల యొక్క ధాన్యపు కొట్లని అర్థద్వయము ధాన్య ముక్తాసరాణామ్. లాలింప దగిన వడ్లనే ముక్తా హారములకని రూపణ చేయబడినది. లాలనీయ ముక్తాశాలి మాలానామ్ అన్నచో శ్లేషకు భంగముండదు ముత్తెములచే ఒప్పుచున్న మాలలు ముత్తెసరి వడ్ల యొక్క రాసులని అర్థద్వయము వచ్చును. 'పట్టుకొమ్మ'కు 'శాఖావలంబనమ్' అనుటకన్న అవలంబ శాఖా అనుట యుక్తము. సరసుల కారామ సరణి అనుచోట సరస సరసీపదముల బహువచనము సరసులని యగును దీనికి సరసీంద్రాణా మనునది సరసమగు అనువాదము కాదు. సరసులనే సరస్సులకు అను అర్థము రాదు. కావున సరసోత్తమానామ్ అని అన్నచో సరస్సులు సరసు లను అర్థద్వయము వచ్చును. సరసా= స్వాదిష్ఠ జలముగల సరస్సు అని అర్థము. సరసా పదమునకు సరస్సని అర్థము కూడా కలదు. (చూడుడు శబ్దార్థ కౌస్తుభము.)

94. చ॥ అలఘు తరగ్రహాంశు గుణితాగణితాభి నుతాగ్ర రత్నకం
డళరుచి బొల్చు పీటి వరణంబు గతావరణం బొనర్ప ని
చ్చలు నలకోట కొమ్మ బలు సందుల పొందుల నేగఁ గాఁ జామీ
యల వటి చెం బతంగుఁడు సహాయ రథాంగముగా శతాంగమున్

శ్లో॥ గుంభద్గ్రహాంశు గుణితా గణితాగ్ర రత్న శ్రీ శోభియద్వరణ శీర్షతలాంతరాలే
గతుం సదా గగనసీమని నిర్నిరోధం చక్రే రథంను చతురో రవి రేక చక్రమ్

నవగ్రహ కాంతులుగల నవరత్న కాంతులను విరజిమ్ము కోట కొమ్మలు సూర్య మండలము నతిక్రమించుటచే తన మార్గమునకు విరోధ మేర్పడుట వలన, వాని సందుల నుండి రథము పోవునట్లు ఒకే చక్రమును ఆ రథమునకు సూర్యుడు కూర్చుకొనెనని దీని భావము. కోట కొమ్మలందు పక్షులు తిరుగునట్లు సూర్యుడు తిరుగునని పతంగ పదము వలన అర్థాంతర స్ఫూర్తి కలిగించి నాడు రామరాజ భూషణుడు. ఈ స్ఫూర్తి అనువాదమున లేదు. 'చక్రే పతంగ ఇవతం రథమేక చక్రమ్' అని మార్చిన ఆ స్ఫూర్తి కలుగును.

చ॥ పురి పరిఖా మహాంబునిధి భూరిగభీర తరాంబు పూరమున్
సరభసవృత్తిఁ జొచ్చి బలి సద్మతలం బతలం బొనర్పగా
జరణకృత ప్రచారములు సాగవు వీరికి నంచు నబ్జజుం
డురగులఁ జేసెఁ బన్నగకులోద్భవులన్ వడిఁ దెలియాడగన్

శ్లో॥ ఉత్తరియ త్తేయ జలైరుదగ్రే పాతాలలోకే పటుపాదచారః
అశక్య ఏవేత్య తనో దహీన్ కిం వేధో నుబోధా దురగాన్ సుమేధాః

ఆ పట్టణమందలి జలధి గంభీరమగు పరిఖా జలము పాతాళమునుజొచ్చి దాని నతలము జేయగా, ఆ లోకమున నివసించు వారికి పాద సంచారములిక సాగవని ఆలోచించి బ్రహ్మ ఆపన్నులగు ఆపన్నగులను ఉరముతో ప్రాకు వారిగా అనగా ఉరగులుగా నొనరించెనని భావము. 'వేధోనుబోధాత్' అనుచోట సకారాన్తమగు వేధ శ్శబ్దము ప్రథమైక వచనమున వేధాః అని యుండును. వేదాః అను బోధాత్ చోట విసర్గ మాత్రము లోపించు కాని 'వేధోనుబోధాత్', అని ఉండదు. వేధాను బోధాత్, అని అనువాదకుని వాక్యమై యుండును. 'ను' అనునది ఉత్ప్రేక్షా వాచకము— ఉత్తరీయ త్తేయజలైః ఉదగ్రే పాతాళలోకే అను వాక్యమున అర్థము సరిగా బోధపడుటలేదు. ఖేయాంబుభి ర్నిప్తలితే గభీరైః పాతాల లోకే పటు పాదచారః అశక్య ఏవేత్యతనో దహీన్ కిం వేధాస్సు మేధాఉరగా న్విచింత్య అని మార్చిన అర్థక్లేశ ముండదు.

97. మ॥ చతురాస్యుల్ పురుషోత్తముల్ బుధగురుల్ సర్వజ్ఞమూర్తుల్ మహా
శతమన్యుల్ శుచిధర్మ పుణ్యజనతా శ్లాఘ్యుల్ ప్రచేతుల్ సదా
గతు లక్షీణనవార్థకర్తలు కలాకాంతుల్ జగద్బంధు లా
క్షితి దేవుల్ పురి దేవతా మహిమలం జెన్నొందుటల్ చిత్రమే

శ్లో॥ చతురాస్యాః పూరుషేంద్రా స్సర్వజ్ఞా శ్శతమన్యవః
శుచయో ధర్మిణః పుణ్యజనా యత్ర ప్రచేతసః
యే సదాగతయోఽ క్షీణ నవార్థేశాః కలాన్వితాః
జగద్ధితాస్తే భూదేవా దేవతాతిశయా నకిమ్

మూలమున బ్రహ్మ, విష్ణు, బృహస్పతి, శివులని మూర్తిత్రయము క్రమముగా చెప్పబడలేదు. అనువాదమున ఈ క్రమము పాటింపబడినది. బుధ గురుల్ అనునది లేదు. "పూరుషేంద్రాః" అనునది పురుషోత్త మార్థము నొసగదు. ఇట్లే ధర్మిణః అనునది. జగద్ధిత పదమువలన సూర్యార్థము స్ఫురించుట కష్టము. ఆ పురమందలి బ్రాహ్మణులందు బ్రహ్మాది దేవతా ధర్మములున్నవి. వారు దేవతా మహిమలన్ జెన్నొందుటల్ చిత్రమే అను మాటకు దేవతాతిశయానికిమ్, అని అనువాదము యుక్తముగా లేదు.

97. సీ॥ పగలైనఁ దెల్వి గోల్పడని రాజులు శరంబులు చన్నవెల వెలబోని
ఘనులు। ధనదాశ గేలు మోడ్పని సార్వభౌమాంకు, లని వెన్కముందు
జూడని కుమారు। లరిమెచ్చ గరములు నెరపనియును లాల,
మున వాలుమలవని పురుషసింహు। లన యంబునడకఁ దప్పని
గోత్రపతు లెప్పుడును సీదిరము లేని యనఘభోగులు.

గ॥ యత్ర చ్ఛైద్రేఽపి దీప్యమానే తేజో మహిమానో రాజానః విగలి
తేష్వపి శరేషు వివర్ణ తావిహీనా ఘనాః యదాకదాచి దప్యభిదనదాశ
మకృతకర ప్రసార శంకా స్సార్వభౌమాంకాః రణాం (గణేప)
శ్చాత్పురోధ్వ ప్రచారాః కుమారాః ఘనారి కౌతుకార్థ, మనాకలిత కర
ప్రిదాన రచనా ఇనాః సంగ్రామ రంగే సర్వదా ఖడ్గధారిణో నృకే

సరిణః, నితాంత మవర్జిత సద్గతయో (గోత్రప) తయః నిరంతరం ఛిద్ర వియోగినో మహాభోగినః విభాంతి, పుష్పవద్వంశ్యతయా కువలయాధారాః కమలానుగుణ విహారాః నిరతిశయ సౌజన్యాః నీతి పరమూర్ధన్యాః, నిరుపమ యశః కన్యాః నిస్తుల దయాధన్యాః నిత్య శుభ రాజన్యాః.

ఒక్కొక్క భాషలో ఒక్కొక్క విశిష్ట లక్షణముండును. దానిని యథాతథముగా అనువదించుటవల్ల మూల భావము స్ఫురింపకపోగా అనువాద భాషకే అపకారము జరుగుతుంది. ఈ విషయము కవి జాగరూకతపై ఆధారపడి యుంటుంది. "పగలైన" ఇత్యాదులు పై లక్షణమును సంతరించుకొన్నవి. వాని పైననే తెలుగు జీవించును. విరోధ స్ఫూర్తికి సంస్కృతమున వాక్యములుపయోగించు పద్ధతి వేరుగా నుండును. కాదంబరిలో మనకు ఈ లక్షణము కన్పట్టును. అక్కడ భాష సజీవముగా నిల్చినది.

పగలైన దెల్పిగోల్పడని వెలవెలబోని కేలు మోడ్పని ఇత్యాదులు తెలుగు జాతీయములు జాతీయములవే గైకొని అర్ధాంతర స్ఫోరకముగా వక్తవ్యాంశమున కతుకునట్లు మలచు శక్తి రామరాజ భూషణునిలో అడుగడుగున గోచరిస్తుంది. పగలైనన్= విరోధ మేర్పడినను పగటిపూటైనను అను అర్థద్వయము, 'వైరేపి దీవ్యమానే' అనుటలో రాదు. తాదృశోభయార్థ ప్రత్యాయక పదము లభించనపుడు మాత్రము అనువాదకు డంతకన్న వేరు చేయలేడు వెనుక ముందు జూడని కుమారులనుటకు "పశ్చాత్పురోధ్వ ప్రచారాః" అనునది సంబంధించుట లేదు 'పురః పశ్చా దకృత దృక్ప్రసారాః' అనుట యుక్తము. వాలుమరువని= ఖడ్గమును మరువని అని సామాన్య అర్థము. నరసింహస్వామి యుద్ధమున ఖడ్గమును మరచినాడని సింహమైనను తోక లేదని అర్థాంతరము స్ఫురించును. ఈ సారస్యము సర్వదా ఖడ్గధారిణః అను పదమున రాదు. చిత్ర కరవాల ధారిణః అన్నచో తదర్థ స్ఫూర్తి కలుగును. (సీదిరము= రోతగొట్టుతనము కుబుసము శృంగారము) (భోగులు, సర్పములు సుఖానుభవము కలవారు) భోగులైన వారికి కుబుసములు తేవు అనుట విరోధము.

గారిమ్యత లేని శృంగారులని పరిహారము. వాక్య సౌందర్యమునకైనను సౌర్య భౌమాంకా అపి కుమారా అపి. అని ఆరోప్యమాణముల చివర అపిని చేర్చి వానిని దాని విశేషణములకు పూర్వము ప్రయోగించిన బాగుండెడిది, విభాతవైరా అపి అనపగత తేజోమహిమానో రాజానః, నిర్వ్యూఢ శరా అపి వివర్ణ తానధీనా ఘనాః అని అనువదించినచో సంస్కృత వాక్యము సజీవముగా నుండెడిది. విభాతవైరాః= స్ఫుటముగా భాసిల్లు వైరముగల వారయ్యు అని విభాత (ప్రభాత) రూప వైరము గలవారనియు ఉభయార్థ స్ఫురణ చేకూరెడిది. ఔరా వీరన వీరన యైక పరుల నునది అనువాదమున లేదు. చివరకు నీతి పరమార్ధన్యాః అని పేర్కొనబడినది. చంద్రమేఘ కుమార నరసింహాదులు వీర నీతి దప్పినారు. వీరు (ఆ పట్టణములోని క్షత్రియులు) మాత్రము తప్పలేదు. కావున వీరే వీరనయైకపరులనే స్ఫూర్తి నీతి పరమార్ధన్యాః అనే పదం వల్ల కలుగదుగదా.

98. చ॥ చెలిపులిగూడు మాను పని శ్రీదుని గా దని మిత్రు నక్షయో
జ్జ్వల వసుఁ జేయ మిత్రి వసుసంపదకైనఘ నావరోధమున్
వెలువడి జేయ నేర్తురు మణీ విపణీ తపనీయ రాశి పే
శలరుచి గోటి కోటి విల సద్ధ్వజ కోటిఁ బురీ కిరాటకుల్

శ్లో॥ శ్రీదం యత్ర విశో విహస్య సుహృదో భైక్ష్యా పనోదాక్షమం
మిత్రం కర్తు మభీక్ష్ణ మక్షయ వసూత్కర్షంచ మిత్ర శ్రియాం
సమ్మార్ష్టుంచ ఘనో పరోధ మధికం శక్తా నిషద్యా మణీ
కుంభి న్యున్నతి హేమరాశి సుషమా కోటి ధ్వజాలీ పటైః

అనువాదము సరసముగా నున్నది. తన చెలికాడగు కృత్తివాసుని భైక్షమును మాన్పలేని ధనపతి (కుబేరుడు) గొప్పతన మెట్టిదని తిరస్కరించి మిత్రుని (సూర్యుని, చెలికాని) తమ సువర్ణ రాసుల నిగ్గుదేరిన కాంతి పుంజ ముతో. అక్షయవసు (కిరణ) సంపద గలవానిగా చేయుచు ఆ మిత్రుని వసు సంపధకు కలిగిన ఘనోపరోధమును (గొప్పవారి అడ్డగింపు మేఘముల అవరోధము) కోటి కోటి ధ్వజకోటులచే (ధ్వజ పతకా మారుతములచే) తొలగింతురు. అందలి వైశ్యులు కోట్లకు పడగలెత్తినారని భావము.

99 మ॥ బలిచూడామణులందు విష్ణుపదజుల్ పాటించు ధాన్యంపుది
ప్పలు చంద్రామృత సాంద్రసేకమునఁ బై పైమోసులెత్తంగ ద
త్కల మాంకూరము మేయుచున్న నెలజింకన్ సారెవారించు వా
రల తోఁబుట్టువు గంగ పద్మముఖనిర్యద్భృంగ నాదార్భటిన్.

శ్లో॥ తద్విష్ణు పాద భవతాదృశ ధాన్యరాశి
చంద్రామృతోదితనవాంకుర చర్వణేచ్ఛుమ్
గంగా తదీయ సహజా కమలాస్య నిర్యద్
భృంగారవై ర్విధు మృగం భృశమాశురుంధే,

విష్ణు పాదము బలి చక్రవర్తికి చూడామణి కావున, ఆ విష్ణు పాదమున బుట్టిన శూద్రులను బలికి చూడామణులేయగుదురని సాదృశ్యము. అంతే కాదు వారు బలవంతులకు శిరోమణులు. బలి చక్రవర్తిని పాతాళమునకు త్రొక్కిన అది విష్ణు పాదము నందు పుట్టిన వారు బలవంతులకే శిరోమణుల గుట ఆశ్చర్యమేయని చమత్కారము. అట్టి బలి చూడామణులు పండించిన ధాన్యరాసులు మొలకెత్తగా ఆ మొలకలను తినుటకై జింక ఆరుద్రలు సాచుచు రాగా వారి సహోదరయగు గంగాదేవి తన తమ్మి మోము నుండి వెలువడు తుమ్మెదల ఝంకారమను ఆక్రోశ ధ్వనులతో వారించుచుండెను తమ్ముల సొత్తునకు చేటుకలుగునపుడు సహోదరి సహింపదుగదా అని భావము. బలి చూడామణుల నది తప్ప మిగిలినది అనువదింపబడినది.

100 చ॥ పరబల భంగ చంగము లభంగుర తుంగ మతంగ జంబుల
ప్పూరి. బరికీర్ణ కర్ణ పుట పూరిత భూరితరానిలాహతి
వ్విరియగ దోల మేఘములు నింగి దొలంగి తదంఘ్రిమూలముల్
శరణము నందబోలు ననిశంబు బదంబు మదంబు పేరిటన్.

101 శ్లో॥ మత్తాలి భీకర మదావల కర్ణతాల వాతూల ధూత పరి ధూత బలాహకౌఘః। తత్రా ససాద శరణం తరసా తదీయ పాదాన్ తదాను ఘన పాద మదాభి ధానః.

ఆ పట్టణమందు పరబల భంజకములగు మత్తమాతంగములుమహోన్నతములై తమకర్ణ వాతూలములచే మేఘములను చెల్లాచెదరగునట్లు పారద్రోలగా అవి ఆకాశమును విడచి వాని పాదముల శరణుజొచ్చినవి. అందువలననే వానికి ఆ ఏనుగుల పాద మద నామ మేర్పడినది. మేఘమను నామము ఏనుగు పాద మదమున కున్నది. మేఘస్తు చరణ వ్రజేయని ప్రమాణము. మూలమున మేఘనామము వాచ్యకముకాగా, ఇందు లక్షితలక్షణాబోధ్యమని భావించవలెను. అనువాదము శబ్దార్థ భావ బంధురముగా నున్నది.

మ॥స॥ పర భూభృత్ప్రాప్తి నబ్ధిం బడురవి హరులం ద్రొబ్బి(బాటింప వెందున్
సరిగా దద్ధిక్క్రృతుల్ సైచక రవి హరియై చాయకున్ రానడంచుం
జరణోద్ధ్యద్ధూళిఁ ధధ్వానతఁ దగుహరియున్ సప్తిగాఁ బాదధారా
స్ఫురణం బేవింతయంచుం బరిహరులు నగుంబూర్ణధారా సమృద్ధిన్.

102 శ్లో॥ ప్రాప్తాబ్ధిన్ పర భూభృ దాప్తిషు హరీ న్నారాక్రన్ సమాన్ మన్వతే
తల్లజ్జాహయ రూప శోభితరణిం ఛాయాగతం రేణుభిః
పాదోత్తేద్ధస్నగయంతి సూర్యగహరిం (తం పాద ధారంనిరా)
దృత్యాశ్వాః ప్రహసంతి సప్తి) తురగం సంపూర్ణ ధారాభరైః

పర భూభృత్తు (పశ్చిమగిరి) అడ్డుగానిలిచినపుడు అతనిని దాటలేక వెరచి సాగరమున పడిపోవు సూర్యాశ్వములు మాకు సరియాయని ఈ సడించుచున్న ఆ పట్టణాశ్వముల ధిక్కారమును సహింపక సూర్యుడు పగదీర్చుకొనబూని అశ్వమయ్యెను. ఆ అశ్వరూపముననున్న సూర్యుడు తమ ఖరధూళిచే కప్పివేయబడెను. (సూర్యునకు హరియను నామమున్నది, హరిపదమునకు అశ్వమను అర్థముకలదు. లేక ఛాయాదేవి ప్రీతికై సూర్యుడు అశ్వరూపమును దాల్చెనని పురాణ కథనైన గ్రహించవలయును.) అపుడు సూర్యుడోడిపోగా సూర్య మండల వర్తియగు విష్ణువు కోపించి పాదధారా స్ఫూర్తి నెరపుచురాగా, పూర్ణధారా సమృద్ధిగల మాతో పాద ధార (పావుదార 4వ వంతు ధార) గల నీవు పోటీ పడుటయా యని పరిహసించుచుండును. విష్ణువు హయగ్రీవావతారమెత్తుటచే అశ్వరూపియని పాదమందు గంగాధార యుండుటచె పాద ధారుడని,

ఈ రెంటిని భంగ్యంతరమున చమత్కరించి నాడని గ్రహించవలెను. అనువాదము పరమ సమంజసముగా నున్నది. సప్తతురగమ్ అను పదములు ఏకార్థకములు సప్తియనునది కోష్ఠమున నున్నది, ప్రకాశకులే దీనిని పూరించి నారు. ఇది ప్రమాద మూలకమని వేరచెప్పబడిలేదు. సప్తివదనమ్ అని మార్చుట యుక్తము.

103 క॥ అన్నగరి నాట్య శాలల., జెన్నగుమురజముల రవళి చే నటియించుం
గన్నియల కన్న మున్నుగ, బన్నగ భుక్తులు దృష్టి పాత్రములగుచున్.

104 శ్లో॥ యన్నాట్యశాలా మురజాది నాద, సన్నాట్య కన్యామణి సంతతేః ప్రాక్
గోత్రాణి దృక్శ్రోత్రభుజాం హి దృష్టి, పాత్రాణి భూత్వా నగరే నటంతి)

ఆ పట్టణ మందలి నాట్య శాలలలో నాట్య గోష్ఠులందు వాయింపబడెడి మురజ తార స్వనములను, మేఘధ్వనులుగా భ్రమించి నెమిళ్ళు నాట్యకన్యలకన్న ముందే దృష్టి పాత్రములై నటించుచుండును. దృష్టి పాత్రములనగా నెమిలి ఈకల పై కనులవంటి గుర్తు లుండును. పత్రసముదాయము పాత్రము. దృష్టిపాత్ర మందుగలవి దృష్టి పాత్రము. చూచుటకు తగి యున్నవని సామాన్యార్థము. మూలగత సారస్యము విడువకుండ అనువదింపబడినది. 'మురజాది నాదాత్, అనుట యుక్తము.

104 ఉ॥ చందన గంధు లిందుమణి సౌధ తలంబుల గొండ్లిసల్పగా
నందలి దివ్య చిత్రముల యందొకరై యనిమేష భామినుల్
కందళి తాద్భుత స్ఫురణ గన్గొని తన్నటనాంత గీత ని
ష్యంద సజీవ చిత్రముల సందడి నేగుదు రప్పురంబునన్.

105 శ్లో॥ చంద్రాశ్మ సౌధ తల చారునట ద్వధూటీః వీక్ష్యాని మేషవనితా
వృతదివ్య చిత్రాః। లాస్యాంతగానల సమాన సజీవ చిత్ర
(సంబాధతో హ్యపసరంతి బహిర్నగర్యామ్.

అనువాదము చక్కగా నున్నది. వృతదివ్యచిత్రాః అనునది ద్రాగర్థ స్ఫూర్తినీయదు 'నవచిత్ర లీనాః, అనికాని 'నవచిత్ర రూపాః, అని కాని అన్నచో కొంత స్ఫూర్తి కలుగును. నగర్యామ్, అని ముందు చెప్పుకొనః వలయును అనగా బహిః, పదముతో ఇది అన్వయింపదు. లేచిచో 'నగర్యా అని పంచమీ విభక్తి ఉండ వలసి వచ్చును.

105 చ॥ ఒనరు, బురాధి రాజమున నుజ్జ్వల వజ్రకలాప గోపురా
గ్రనిహిత హేమ కుంభములు గాంగ హిరణ్మయ కంజమంజిమం
దనరగ నిక్కిదిక్కరుల తండము తుండము సాఁచునంచు నుం
చిన వెలబొమ్మలో యనఁగఁ జిత్రితత సాంద్ర మృగేంద్ర రూపముల్.

106 శ్లో॥ తద్వజ్ర గోపుర శిఖా తపనీయ కుంభాన్
ఆశాగజా స్సురనదీ కనకాబ్జ బుద్ధ్యా
యత్నాత్ స్పృశేయురితి యంత్రిత తద్భయార్థం
నిక్షిప్తమూర్తయ ఇవ ప్రతిభాంతి సింహాః॥

గోపురాగ్రము లందు తాపిన వజ్రకాంతులు ఆకాశగంగా జలమువలె కన్పట్టు చుండెను. అందున్న సువర్ణ కలశములను ఆకాశగంగా కమలముల నుకొని దిగ్గజములు తమ తొండములు సాచి పట్టుకొను నేమోయని తలంచి, వాని బెదురుకై సింహములను కాపుపెట్టిరా యనునట్లు యంత్ర కీలిత సింహ ప్రతిమ లుండెను 'యంత్రిత తద్భయార్థం నిక్షిప్త మూర్తయ ఇవ, అనునది మూల భావమును స్పష్ట పరచుట లేదు, 'తద్భయ దాన క్లప్తా స్సింహా ఇవాలిఖిత తత్ప్రతిమా విభాంతి అనుట యుక్తము.

106 ॥సీ ఘనులఁ గొండల పాలుగా, జేసిన కొఱంత, ద్విజరాజునెపుడు
గుందించు కొదువ కువలయంబు దినంబు గూల్చునాడిక బంధు,
జీవ మామోదిగా జేయని సడి కల్యాణ గోత్రంబు గరిమ వంచిన
దూఱు, సరసుల నింకించు పరుసదనము దానికేల్ వసులక్ష్మి
బూన జేయని ఱట్టు తమ్ములఁ బంకాప్తి దార్చునగడు.

తే॥ నలువ వారించు కొనియె దన్నగరసతుల, నెఱిగురులు ముద్దు
మోములు నిడుదగన్ను । లలితమోవులు బిగిగుబ్బ లరిదినాభు,
లలరు తొడలును మృదు పదంబులు, నొనర్చి.

107 గ॥ అధఘనానా మచలాధి వాసన కల్పనయా, ద్విజరాజ మండలస్య కృశతా వితరణేన, కువలయస్యాసుదిన ముల్లోక కరణేన, బంధు జీవస్యామో దాదానేన బుధగోత్రస్య మహౌన్నత్య భంగ సంపాదనేన సరస్వతి శయానాం సరసీంద్రాణాం, కాలుష్య కలనయా దాని హస్తేషు వసులక్ష్మ్యయో జనేన కనిష్ఠానాం పంక పాత్రపణేనచ జనిత మహితాప వాదం క్రమేణధాతా తదీయ నగర యువతి జన కుటిల కచ లలిత ముఖ ఘన నయనసు రక్తోష్ఠసు వృత్త కుచకలశ నిమ్నానాభి మహోరుకాండ మృదు చరణ రచనార్జవేన మమార్జ.

అనువాదమున శ్లేష చక్కగా పొందుపరచి భావము పోషింపబడినది సరస్వతి శయానాం సరసీంద్రాణామ్, అను పదములు ఏకార్థకములు వ్రాయ సకాదు చేర్చియుండ వచ్చును. 'సరసీంద్రాణా, మనుట సరసముగా లేదు. ఇంద్ర పద ముత్తర పదముగా నున్నపుడు శ్రేష్ఠవాచక మగును. సరసీయను స్త్రీ లింగమునకు శ్రేష్ఠార్థమున నైనను పుంలింగమగు ఇంద్ర పదము జేర్చుట ఆంజస్యావహముగాదు. సరసేంద్రాణా, మన్నను సరసీ పక్షమున అదే చిక్కు వచ్చును. 'సరసానా, మన్న చాలును. 'అను దినముల్లోకా కరణెన. అని యుండె నేమో, ఉల్లోక పిదప అక్షరములు చెదరి పోగా వానిని ప్రకాశకులు పూరించుట బట్టి దీర్ఘము లోపించి నదేమోయను అభ్యూహ కలుగక పోదు, ముల్లోక అకరణేన = సంతోష ప్రపంచము కూర్చకపోవుట చేతయని కాని, సంతోషమును లోకమందు కూర్చక పోవుటచేతనని కాని అర్థము చెప్పుకోవాలి. ఇది క్లిష్ట కల్పన. "తెమ్మల పంకాప్తి దార్చునగడు, అనుటకు 'కనిష్ఠానాం పంక పాత్రపణేన, అని గత్యంతరము లేక కనిష్ఠపదము ఉపయోగింపబడినది. కనిష్ఠ పదమునకు తదమ్ముడనునది ప్రసిద్ధము. పద్మార్థము నేయార్థము. స్వసంకేతమాత్రగోచరార్థకము. నీటి యందుండునది అను అర్థముద్వారా జలభవ

పదమును తెల్పి తద్ద్వారా కమలమును బోధించుచున్నది. కాని నీరు, తల, సుఖమను మూడర్థము లందు' కమ్. అను అవ్యయము వర్తించును ఇది మాంతమగు అవ్యయము. కందః కంజః, కంధిః కంధరా కయుంః ఇత్యాదుల మూలమున దీని మాంతత్వము వ్యాహతము కాదని తేలినది. అట్టులేని 'కంనిష్ఠమె, అని యుండును కాని, కనిష్ఠమని ఉండదన్నచో శ్లేష స్థలమున అనుస్వారము లోపింపవచ్చునని మన పెద్దలే సూచించినారు. రలయోర్లడయోస్తద్వత్ లళయో శ్శసయోరపి, వబయోర్నణయో శ్చాంతే సవిసర్గావిసర్గయోః, సబిందు కాబిందుకయో స్స్యాదభేదేన కల్పనమ్. అని భోజసూక్తి.

శ్లేషాదులలో దోషముకాదు కావున కనిష్ఠమ్. అనుట యుక్తమని తేలినది. భజించి, భంజించి, అని రాఘవ పాండవీయమున కనబడును. జలార్థమున కూడ 'క' శబ్దమున్నదన్నచో చిక్కే ఉండదు కదా.

107 మ॥ పురిపూదోటల తావి మిన్నలమ వేల్పుల్ మెచ్చి తద్భూజభా
స్వర సంతానములన్ దివిం బెనుప నా సంతానముల్ దివ్యని
ర్ఝరిణీ నిర్మల వారి పూర పరిపోషం బందియుం దన్మహా
తరులక్ష్మి పరిపూర్తిగాన కెనగెం దత్కల్ప శాఖి ప్రథన్.

108 శ్లో॥ ఆక్రీడ గంధముదితై రమరై ర్యతోద్యామా రోపితాస్సుర నదీ
జల వేణికాభిః । [త] త్సంతతి ప్రథవతత్తరు లక్ష్మ్య పూర్త్యా
తత్కల్ప పాదపయశః కిమగాత్తదాది.

స్వర్లోక మందలి వృక్షములకు సంతాన కల్పములను నామ మేర్పడుటకు కారణము పేర్కొని చమత్కరించుచున్నాడు. అధిష్ఠాన పురోద్యానముల లోని వృక్షముల పరిమలమునకు మెచ్చి దేవతలు వాని సంతానములను [మొక్కలను] గొంపోయి తమ లోకమున నాటి గంగా జలము పోసి పెంచినను, ఆ తోట చెట్లయొక్క పరిమళము పూర్తిగా తాము నాటిన వాని యందు కానుపింప నందున అవి తత్కల్పములై కల్పములను నామమున

వ్యవహరింపబడుచుండెను కల్పప్ ప్రత్యయము ఇంచుక తక్కువ అను అర్థమున వచ్చును. అను వాదమున మూల భావము సరిగా ప్రతిబింబించలేదు. "ఆ రోప్రి తాభి సరితా పరిపోషితాపి, సంతాన పాళి రపి తత్తరు లక్ష్మ్య పూర్త్యై తత్కల్ప పాదపయశ్ కిమ గాత్తదాది" అన్నచో కొంత భావ స్ఫూర్తి ఏర్పడును.

108: సీ॥ పొన్నపూ వొడిసేలఁ బొది వితే చెలియది, పొడమె బన్టీవిపై
బొదువవలదె। చెలువ మాటితివేల కలువ చాలదియుగ, ప్పఁగరాదె
మిన్నుల బావి కడది। మొగడ తమ్ముల నేల మూసితె
సతిమూయ. దగదె మానసభూనిదానములవి। తరుణి పూరెమ్మ
యెత్తవదేల యడిహేమ, శిఖరి దాపుది బయల్ సేయదగునె

తే॥ యనుచు రసమర్మ సరసోక్తు లాడునట్టి, జట్టికాంధ్ర యథోచిత సరసవచన రచన దేల్చుచు వివిధ విభ్రమము వఱల విరులు విలుతురు పుష్పలావికలువీట.

100: గ॥ పున్నాగ సురభిలే పున్నాగకుసుమం కిమిత్యపవారయసి నను
భూరిజఘనాంతరీ పాగ్రజం తన్న కిమప వారణీయమ్, ఇందీవరాక్షి
(కి) మిందీవర రేఖాంఛాదయసి నను సురదీర్ఘికా పార్శ్వ
స్థాకిం నాచ్ఛాదనీయా. పంకజముఖి కరే(ణ) పంకజ ముకుల
యుగళం కిమితి గోపయసి? నను మానస భూనిధానం త
న్నకిం గోపనీయమ్ పుష్ప కోమలాంగి కు (సుమ వల్లరీం కిమితి
న ప్రకటయసి? ననుసా కనక శిఖరి సవిధ భాసురా కిం ప్రకట
నీయేతి, నాభిరోమరాజి కుచబాహుమూల నిరీక్షణపర రసమర్మ
నర్మ వచన రచనా విలాస భాసురా విభాంతి తత్రపుష్ప విక్రయ
భావుకాః పుష్పలావికాః

అనువాదమున సంపూర్ణముగా తెలుగు వాక్యముల పరిభావము ప్రతిబింబించనది. ప్రతి వాక్యాదిలోని సంబోధనలు మూలమున లేవు సౌలభ్యముకొరకు

చేర్చబడినవి. కాని నాభి రోమరాజి కుచాది ఉపమేయములను కప్పిపుచ్చి తదుపమానములను రూపకాతిశయోక్తి మూలమున పేర్కొని తదర్థస్ఫూర్తి కలుగునట్లు చమత్కారము కావింపబడినది. వాని గోపనమువలనే ఇందు చమత్కారము రూపొందినది. అనువాదమున- 'నాభి రోమరాజీ కుచాదులు వెల్లడి చేయబడినవి. ఇదియే భేదము. పుష్పలావికలు వానినెంత గోప్యముగా నుంచుకొనిరో అంత గోప్యముగా ప్రశ్నలు వాని సమాధానములు నిగుడించుటలో మూలమున కవి చమత్కారౌచిత్యములను పాటించెను. అనువాదము ఒకమెట్టు తగ్గినది.

109 మ॥ అమరుం దత్పురిచెంతఁ గాంత కనకాబ్జాలంబ రోలంబశు
క్తిమతీవాహిని సారసారణులు తత్కేదార కోదారస
స్యము ముక్కారును బండజేయ దివివారల్ పీటిసత్రాన్నభా
గము లాసింపగ డత్పురాలయనదీ ఖ్యాతిన్ విడంబించుచున్.

110 శ్లో॥ స్రోతస్వినీ లసతి శుక్తిమ (తీతదగ్రే)
కేదార సస్య పరిపోషణ సారకుల్యా
సత్రాన్నభాగ సమవేత బుధాలిసాంద్రా
హేమాబ్జ నిహ్నుత సురాలయ సింధుకీర్తిః

ఆ పట్టణము చెంత శుక్తిమతియను మహానది ప్రవహించును. అందు హేమారవిందములు కోకొల్లలు. దాని కాలువలు వలుగడల పారుటచే పంటలు మూడు కార్లు పండును. యాగ భాగములు గ్రహింప దేవత లెప్పుడు క్రిక్కిరిసి యుందురు. దేవతా సమృద్ధము వలన హేమారవింద సంపద వలనను అమరావతిని అమరస్రవంతిని అది విడంబించుచున్నదని భావము. అనువాదమున ఈ భావము గ్రహింపబడినది. కాని సురాలయ సింధు కీర్తి నిహ్నవమునకు హేమాబ్జములు మాత్రమే కారణము కాదు. 'బుధాలిసాంద్రా' అన్నట్లు 'హేమాబ్జ సంపన్నా' అని వ్యస్తముగా చెప్పినపుడే మూల భావము ప్రస్ఫుటమగుటయేగాక కారణద్వయము చెప్పినట్లగును. 'సత్రాన్న భాగ సమవేత బుధోపమర్దైః హేమాంబుజై రతి సురాలయసింధు కీర్తిః, అన్నచో స్ఫుటత ఏర్పడును. అత్యర్కేందు కుల ప్రశస్తి మస్పృజ ద్యం కాకతీయాన్వయమ్ అని విద్యానాథ ప్రయోగము.

111 శా॥ వీటన్ మీటగు జోటు లేటి వ అదన్ వేమా ఱు గ్రీడింపఁద
త్పాటీరాంక సపంక శంఖగత ముక్తా శ్రేణి యవ్వానసం
బాటించున్ మృగనాభి పంకయుత భా మాంకంబు కంతాప్తి నే
వాటన్ మిన్కులు గల్గువారి కగు జన్మ స్థాన సౌఖ్యోన్నతుల్,

"ఈ పద్యము అనువాదమున విడువబడినది"_

112 శ్లో॥ చెన్నగునన్నదీవులిన సీమల దాఁగిలి మూతలాడుచున్
వెన్నెల రేల గప్పురపు విప్పటనంటుల నీడ నీగుఁరా
కన్నెల రో యునన్నులకు గన్నులు మూయు దదీయ వాసనల్
మన్ననగాంచి కప్రిపుదుమారము రేఁచుసమీర డింభముల్.

113 శ్లో॥ తత్రైకతే సిత తమీషు పిధానకేల్యా
(లీనాసు రాజతనయాసు కదల్య ధస్తాత్)
ప్రాక్ ప్రాప్య గంధ మకిరత్ పవనార్భకాలీ
తన్మార్గణాలి దృశి తద్ఘన సారధూలీః

ఇది అనదీ తీరమున దాగిలి మూతలాడు రాజకుమారికల వర్ణన. దాగి యున్న రాచకన్నియల మేలి వాసనలను బడసి అందుకు ప్రత్యుపకార బుద్ధితో వారికి సహాయ పడదలచి మలయ మారుత పోతములు అరాచకన్నియలను వెదక బూనిన చెలికత్తెల కన్నులలో తాము రేపిన కర్పూర ధూళిని జిమ్మి వారికి ఆ రాచ కన్నియల నగుపడకుండ జేయునని భావము. "కప్పురపు విప్పటనంటుల నీడకు కదల్య ధస్తాత్; అని అనువాదము సరిపోకున్నను. భావ స్ఫూర్తికి ఇబ్బంది యుండదు.

112 చ॥ వలనగు నమ్మహా తటిని వారి నవారిత కేళి బల్పికాం
తల చను మిట్టలం దొటగు దట్టపు దట్టుపునుంగు వాసనల్
చిలుకుచు వీటి రాజనవు జేలకు దిద్దిన కాల్వ వెంట రా
దళముగ వాని యప్పునుగు తావులె వల్చుఁ దదీయ ధాన్యముల్.

113 శ్లో॥ తద్వారి కేలి విలసత్తరుణీ కుచాగ్ర
(నిర్ముక్త సంకుమ సువాసిత వేణి) కాభిః
కేదార జాంగల భవైః కలమాది ధాన్యైః
సాపూరపూరి ఘనసంకుమదాతి గంధైః

భావము చక్కగా ప్రతి బింబించినది. 'వేణికాభిః' సాపూరపూరి పుష్టైస్తదుదాత్త గంధైః అని తచ్ఛబ్ద ప్రయోగము సముచితము.

113 చ॥ పగడపు జిట్టలన్ మనికి పట్టుగ గట్టిన పట్టు జీనువుల్
జిగి బిగి మించు చంచువుల జించినచో రసపూర మూట జె
న్నగు రసదాడి గుంపులు పురాంతిక సీమల శాలి పాలికా
జగదభి నంద్య గానరస సంగతి గన్నుల నీరు గన్గతిన్.

114 శ్లో॥ ప్రవాల నీడ ద్విజ పాలి చంచూ
(విదీర్ణ పుండ్రేక్షు రస ప్రపూరాః)
(త) చ్చాలి పాలీ తతిగీతి సంగతే
రానంద బాష్పా ఇవ భాంత్య మందాః

పగడపు తీగల చిట్టి పొదలలో నివసించు జీనులను పక్షులు తమ ముక్కులచే చీల్చగా చెరకు గడలనుండి రసము లూరి ప్రవాహము గట్టెను. తెల్ల చెరకు చేలుకాచు బాలికల గీత మాధుర్యముననే కనుల నుండి ఆనంద భాష్పములు దొరగుచున్నవా యనునట్లు ఆ ప్రవాహముండెనని భావము. కను లను దానికి కణుపులు నేత్రములని అర్థ ద్వయము, దీనివలననే చమత్కారము కలుగును ఏ తదు భయార్థ స్ఫోరకమగు పదము సంస్కృతమున లభింపమి కేవలము 'ఆనంద బాష్పా' ఇవ అని చెప్పబడినది గానరసమహత్తకు రాళ్ళు కరగుట మోళ్ళు చిగురించుట కవి సమయ సిద్ధము.

'రసప్రపూరాః' అనుచోట 'రసైకపూరాః అన్నచో శ్రావ్యత ఉండును బాష్ప శబ్దము పులింగమున ఆ ప్రసిద్ధము' గీతి సంగాత్, అనుట యుక్తము,

114 క॥ ఆరాజధాని కధిపతియై రాజిలు వసునృపాలు డత(డసిధారా
ధారాధర ధారాజల, ధారాహత రాజహంస పద్మోదయుడై.

115 శ్లో॥ రాజధాన్యాః పతిస్తస్యా రాజదోజా, వసుప్రభుః
అసిధారా హత రాజ హంస పద్మోదయో భవత్.

మేఘము యొక్క వర్ష ధార కమల రాజహంస అభ్యుదయము చెరచు నట్టులే. వసురాజు ఖడ్గ ధార రాజ శేష్ఠుల రాజలక్ష్మీ రూప సంపదలను కుంటు పరచునని భావము. అసి ధారాధారా ధర దారాజల, యని అసియందు మేఘ త్వము ధారయందు జల ధారాత్వము స్పష్టముగా రూపింపబడినది. అనువాద మున ధారా పదము మాత్రముపయోగింపబడినది. కత్తివాదర యనే జలధార యను ఉభయార్థ స్ఫోరకత ధారా పదమున కుండుట వలన అట్లు పేర్కొన బడినది. అపుడు అసి యందు మేఘత్వ మర్థతః సిద్ధించును.

115 సీ॥ తన యశోవిశద ముక్తా సౌధపాళికి, నంబుదాయనము వాతాయనముగ
దన శౌర్య శిఖి శిఖా తతికి జాంబూనద, భూధరం బపరంజి పూదెగాగ(
దన బలోద్ధత రజోదంభ కుంభినికి దా, రాగ్రహంబులు గర్భ
రత్నములుగ। దన దాన ధారాఖ్య వనధిక మిన్నేఱు కల్లోల
ధుతవారి కణముగాగ.

తే॥ దన వినూతన సుగుణ సంతానవల్లి, సముదయంబున కంబోజ సంభవాండ
భాండము లఖండ ఫల పరం పరలుగాగ వఱలు భవ్యవిభా విభావసుడు వసుడు.

116 శ్లో॥ తారా ధ్వజాలక యశస్తతి వప్రి సౌధః
భర్మాద్రి భూరి కణభాసుర శౌర్య వహ్నిః
నక్షత్ర రత్నబల (ధూత రజోఽవనీకః)
(దానాఖ్య నీర నిధి) శీకర తాభ్రి భంగః

తన కీర్తి సౌధమునకు ఆకాశము గవాక్షము కాగా తన శౌర్యాగ్నికి బంగారు కొండ బంగారు పూసకాగా తన సేనాసముద్ధూత పరాగ భూమికి సూర్యాది గ్రహములు గర్భరత్నములు కాగా తనదాన ధారా జలరాశికి ఆకాశ గంగ పైకెగసిన చిరుతరంగము కాగా, తన సుగుణ సంతానమను సంతాన లతకు బ్రహ్మాండాదులు ఫల రాసులుకాగా వసురాజు విరాజిల్లు చుండెను. అను వాదమున ఈ స్ఫూర్తి కలుగుట లేదు. ఆకాశమే గవాక్షముగా గల కీర్తి మండలమను వజ్రి సౌధము గల వాడన్నచో భావ స్ఫూర్తి అటుంచి వాక్య సౌందర్యమునకు కూడా అవకాశము లేదు.

శ్లో॥ నీలం వారిభృతాం గవాక్షతి పదం యత్కీర్తి సౌధావలేః
మేరు స్స్వర్ణకణత్యహో కనకభూః యచ్ఛౌర్యవహ్నే ర్గ్రహాః
తారా యద్బలధూతధూళిమిషభూమ్యా గర్భరత్నంతిచ
స్వర్గంగోర్మిధుతాంబుశీకరతి యత్త్యాగైకధారాంబుధేః

అని మార్చినచో కొంత భావస్ఫూర్తి కలుగుతుంది.

శ్లో॥ ఖంబ ద్బ్రహ్మాండ ఫల వద్గుణ కల్ప లతాగణః
వ్య భా దతి శుభాకారో విభావ ఽనిభోవసుః
ఇది సీస గీతాను వాదము

శ్లో॥ గుణ సంతాన వ్రతతీ ఫలద్బ్రహ్మాండ మండలః
విభాతి స శుభాకారో విభావసునిభో వసుః

అని మార్చిన బాగుంటుంది.

116 చ॥ మసలక యెల్లకాలమును మారుత పారణ ధార్యమాణమై
యసమ శిలోచ్చయంబుల ననంత యనంతతపం బొనర్చితా
వసుమతి యై తదీయగుణ వాసన గంధవతీ ప్రతీతియుం
బొసగగ దెల్పె రత్న పరిపూర్ణ మహాకటకాభి ఖ్యాప్యమున్.

117 శ్లో॥ (తప్త్వా తపశ్చిర మిలాఽనిలభక్షణా) ద్రి
వాస ప్రథా వసు (మతీ) వర తద్గుణౌఘైః
ప్రాపద్ధ్రువం ప్రకట గంధవతీ ప్రతీతిం
కల్యాణ రత్న విలసత్కటకాభి రూప్యా.

భూదేవి పర్వత వాసము, వాయు భక్షణ చేయుచు పెక్కు కాలము తపస్సు చేసి వసురాజును పొందినదై వసుమతియను నామమును అతని గుణ వాసనా యోగము వలన గంధ వతి యను నామమును పొంది తదుచిత రత్న కంక ణాద్యలంకార ప్రాభవమును అనుభవించెను. భూమి అనిలభక్షకుడగు ఆది శేషునిచే, సప్త కులాచలములచే మోయబడుట పురాణ ప్రసిద్ధము. వసుమతీ గంధవతీ నామముల ఉక్తి వైచిత్ర్యముచే భంగ్యంతరమున సంభవించినట్లు వర్ణించుట చమత్కారము. 'వరతద్గుణౌఘైః ప్రకట గంధవతీ ప్రతీతిమ్'. అన్నపుడు గంధవతీ ప్రతీతికి గుణ వాసన కారణమని చెప్పక తద్గుణౌఘము అని చెప్పుట దొంక తిరుగుడుగానున్నది, గుణముల సంస్కారమనే గుణమగు గంధమని దాని అర్థము 'గుణ వాసనౌఘైః, అనుట యుక్తము, ఔదార్యాది గుణముల సంస్కార ప్రవాహములనే గుణమగు గంధము యొక్క ప్రవా హముల చేతయని అర్థ మేర్పడును. అనంత తపం బొనరించి అనంత=భూమి అనంతమగు తప=మొనరించి, అసమ శిలోచ్చయంబులన్ = విషమము (దుర్గమము) లైన పర్వతములందు, సప్తకుల పర్వతములందు అను పదగత చమత్కారము అనువాదమున రాలేదు.

117 సీ॥ మీఁటినరాజు బిల్మి నడంపలోనైన, నభినవస్థితిఁ బెంప నతడె నేర్చుఁ
దేజి జీ చూచిన దీప్ర దీప్తి జూప జనాళి, కక్షిసాఫల్యమీ నతడెనేర్చు
సింధు వెంక ప్రతాప శిఖిఁ బూన విప్రశాణి, తాంబుల నవి నింప
నతడె నేర్చు నేమి దుస్సుఖుని తేజము మలుప పాదంబు, లంటిన
వెల్గుబంప నతడె నేర్చు.

తే॥ మండలము దాల్చి హరిదెస మైత్రి నిలుప నలఘు సన్మార్గ గతిదెల్ప
నతడె నేర్చు। నా జగద్బంధునకు వసురాజ నామ, మిడిన
చతురాస్య కౌశలం బెన్నదరిది,

118 శ్లో॥ ఉద్వృత్తోల్బణ రాజ సార మథనే స్వాధీన తద్రక్షణే
సామాన్యేక్షి తృ తాపనే సకల దృక్సాఫల్య దానే చ సః
దక్ష స్సింధు విశోష పోషకరణే తేజోగ్ని దానోదక్తైః
దామ్నోరేస్సమి దున్ముఖస్య హరణే పాదస్పృశోభాసనే,

సర్వలక్షణ సంపన్నమైన అనువాదమిది. ఇందు శబ్దార్థ భావాదులు పరుగులు తీసినవి. ధామ్నోరేః అనునది అచ్చు పొరపాటు, 'ధామ్నారేః' అని యుండవలెను కాని.
'అరి' పదము శత్రువును బోధించును అగ్నిని బోధింపదు. సమిదున్ముఖుని తేజము మలంప' అనిమూలము సమిత్ అనగా యుద్ధము. సమిధ. యుద్ధము జేయబూనిన శత్రువును అణగ ద్రొక్కను. అతడె పాదాక్రాంతుడైనచో భాసిల్ల జేయునని రాజ పరమగు అర్థము. కట్టెల కభిముఖుడు అగ్ని. పగటి పూట తేజస్సును తొలగించి రాత్రి సమయమున అతనికి తేజస్సును కల్గించు వాడు సూర్యుడు. కావున అగ్ని సూర్యుని పాదములను (కిరణములను) స్పృశించును. (ధరించును.) (దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః అని కాళిదాసు) అరిపదముతేకన్నను నిర్బాధముగా శత్రువహ్ని పరార్థములు స్ఫురించును. కావున ధామ్నోరేః అనుచోట 'ధామ్నాఽయమ్' అన్న సరిపోవును.

118 శ్లో॥ అత్యంత మండల ధృతౌ హరి మిత్రభావే
సన్మార్గ గత్య ధిగమేచ (స) ఏవ శక్తః
ఇత్యేవ తస్య హితధీః కిములోక బంధోః
వేధా వ్యధత్త విశదం వసురాజ నామ

ఇది సీస గీతమునకు అనువాదము. ఇందు సూర్యవసు రాజులకు అర్థ న్వయము స్ఫురింప జేయబడినది. ‹హరి దెసమైత్రిని నిలుపన్: అని

మూలము. ఇంద్రుని తో మైత్రి నిలుపుట వసురాజుకు సంబంధించినది, సూర్యుడు తన మైత్రిని కృష్ణునకు ప్రదానము చేసి విలసిల్లెను. మిత్ర స్యభావః మైత్రీయని, మిత్రస్య సూర్యస్య అపత్యమ్ మైత్రీయని విగ్రహము మిత్ర పద వాచ్యుడగు సూర్యుని యొక్క కూతురు కాళిందియని అర్థము. హరి మిత్ర భావే అనునపుడు ఈ అర్థమురాదు. మిగిలినది సుందరముగా నున్నది. 'మైత్ర్యా హరే రుపకృతౌ పృథు మండ లాప్తౌ' అని మార్చిన తదర్థస్ఫూర్తి కలుగుతుంది.

118. మ॥ జననాథాగ్రణి యొక్కనాడు హిమవజ్జాతుండు కోలాహలా
ఖ్య నగాధీశుడు వ్రాలి శుక్తిమతి నాగన్‌వేగ లేగవ్వమీ
టిన సూటిన్ బొటవ్రేలిగోట నెగమీటెం గుంఠితాహార్య శా
సన గర్వాగ్రహుడై బలారి తనతో సఖ్యంబు వాటింపగన్

119. శ్లో॥ కోలాహలాఖ్య కులశైల సుతే కదాచిత్
తచ్ఛుక్తి మత్యుపరి తాదృశి లంబమానే
క్షిప్తే నఖేన సులభం క్షితిపేన తేన
తత్సఖ్య మాప నగభిత్ తరసాఽ దరేణ.

ఇంద్రుడు వజ్రముచే కావించిన పర్వతశిక్ష వసురాజు కాలి గోటిచేతనే చేసెను. కావున తాను పర్వతమును దండించువాడనను గర్వమును దిగవిడిచి వసురాజుతో చెలిమి చేసెనని తాత్పర్యము,

వ్రాలి శుక్తిమతి నాగన్ అను పదములోని సారస్యము తాదృశిలంబ మానే అనుచోట స్ఫురించుట లేదు. కుంఠితా హార్య శాసన గర్వాగ్రహుడై బలారి తనతో సఖ్యంబు పాటింపగన్, అని మూలము. వసురాజు నగమును గోట మీటగా నగభేత్త వేగముగా ఆదరముతో అతని సఖ్యమును పొందె నన్నది అనువాదము. నగభిత్ పదముచే కుంఠితా హార్య శాసన గర్వాగ్రహుడను పదముయొక్క అర్థమును స్ఫురితము కాదు.

119. తే॥ ప్రబల కోలాహలాహార్య పతనరుద్ధ, విపుల శుక్తిమతీమగ్న
విపుల కతని। చరణ నఖరేఖ సంవర్త సమయజలధి,
నుద్ధరించినకిటి దంష్ట్రి యొఱపు దెలిపె.

120. శ్లో॥ బుద్ధ కోలాహలాపాత రుద్ధ శుక్తిమతీజలే
మజ్జ దుర్వ్యా మహాకోలసజ్జ దంష్ట్రాస తన్నఖః

కోలాహలునిచే అడ్డగింపబడిన శుక్తిమతీజల ప్రవాహమున మునిగిపోయిన భూమికి వసురాజు గోరు ప్రళయ సమయమున పైకెత్తిన ఆది వరాహ స్వామి దంష్ట్రి ఒరపు తెలిపినట్లు తెలుగుపద్యమున పేర్కొనబడినది. ఆ భూమికి వసురాజు గోరు ఆది వరాహ దంష్ట్రియైనదని అనువాదమున చేయబడినది.

120. చ॥ బలరిపు మిత్రుడైన యల పార్థివ తల్లజు పాదపల్లవో
జ్జ్వలనఖ రేఖ దండ నగషండ విఖండన చండిమంబు తా
వలముగ నభ్యసించెనొకొ వజ్రము రాజ శిరో విభాగ భా
గలఘు కిరీట వజ్రకళి కాకృతి నిచ్చలు నాశ్రయించుచున్

121 శ్లో॥ పాకాహితేష్టవసు పార్థివ పన్నఖాగ్రాత్
పర్యాప్త పర్వత విపాటన పాటవం తత్
వజ్రం వమన్నరవరాలి కిరీట పీఠ
సార్థచ్ఛలేన కిమువాప సదాశ్రితం సత్

వసురాజు యొక్క పాదనఖము పర్వతభేదముకావించినది. కనుక వజ్రాయుధము తనకా సామర్థ్యము కల్గుట కొరకు సామంత రాజమకుట సంఘటిత వజ్రకళికా రూపమున ఆశ్రయించి అతని పాదనఖ సన్నిధిలో గిరినికర భేదన నైపుణ్యము నేర్చుకొన్నట్లున్నదని తాత్పర్యము.

అనువాదము మూలాను సారముగా నున్నది.

121 చ॥ ఘనుడతడే గుడెంచి సరి గద్దియ నుండనగారి శైలఖం
డనకథ చారణాళి వొగడన్ నిజ సన్నుతి కోసరించునే।
ర్పున దలవంచి పీఠతట రూఢమణిన్ బొటవ్రేలు మీటున
య్యనఘుడు కొండ మీటిన మహాద్భుత కృత్యము దెల్పు కైవడిన్.

121 శ్లో॥ అర్ధాసనం వసువరేఽయతి చారణానాం
నానాద్రి ఖండనను తేర్నగభి న్నతస్సన్
చిక్షేప పీఠగత చిత్రమణిం నఖేన
సంసూచయన్నివ తదద్భుత శైలకృత్యమ్.

అనువాదము చక్కగా నున్నది. కాని మూలమున వసురాజు ఇంద్రునకు సరి గద్దియపై కూర్చొనగా, అనువాదమున ఇంద్రుని అర్ధాసనము నదిష్ఠించినాడు

122 మ॥ అనఘాత్మీయ పదోప కంఠమునఁ బ్రాణాచార ముం బూనురీ
తి నితాంతానత శృంగమై నిభృతమై డికొ్కది యకొ్కండ యుం
డినఁ గొన్నాళ్ళకు గేళి శైలముగ బాటించెన్ మహీజాని మ
న్నన దచ్చైల శిరంబుపై మృదుపద న్యాసంబు గావించుచున్.

123 శ్లో॥ ప్రాయోపవర్త మివ పాద సమీప ఏవ
తస్మిన్ స్థితే నతి తథా నిభృతాతి సమ్రిమ్
విక్షిప్త మంజులపదో నిత రాంత దద్రే

క్రీడాచలం సకృతవాన్ కృపయా తమద్రిమ్

తన పాదము చెంత కొంతకాలము ప్రాణాచారముగా పడి యుండి వేడికొనగా, వేడికొనగా వసురాజు కొన్నాళ్ళకు ఆ కోలాహలుని క్రీడా శైలముగా జేసికొని మన్నించెనని భావము. వరము వేడుకొనుట కాయన్నట్లు (వరునిగా స్వీకరించుట కన్నట్లు అని అర్థాంతరము) తన పాదము చెంత నిలిచియుండగా ఆ అద్రిని కనికరించి క్రీడా శైలముగా చేసికొనెనని అనువాదము. దీనివల్ల కొన్నాళ్ళకు అను సారస్యము రాలేదు 'ప్రాయో వరార్థమివ,' యని అర్థాంతర స్ఫోరకముగా చమత్కారావహముగా అనువదించినాడు. తస్మిన్ స్థితే సతి తథా నిభృతాతి నమ్రిమ్అగిరి నిల్వగా అట్లు కదలక వంగియున్న ఆ గిరిని అని యుండుట వాక్య లక్షణము కాదు; భక్త్యా శ్రితం చిరతరం నిభృతం వినమ్రమ్ అని మార్చుట యుక్తము. ప్రాయః అనునది ప్రాయోపవేశమును సూచించుచున్నది.

123 ఉ॥ ఆ నరలోక పాలకు మహా మహనీయ భుజోప గూహన
శ్రీ నిరవొందుచుం బుడమి చేడియ గోత్రము లూరడిల్ల, సం
తాన సమృద్ధిచే శుభ వితానము తానక మయ్యె నేక సం
తానము గన్న దైవత వతంసపురిం బురణించి నవ్వుచున్.

124 శ్లో॥ భూభామినీ తదుప గూహన భూరి భాగ్యా
సంతాన సంఘ లలితా సము దూఢ గోత్రా
విఖ్యాత మంగల వితానతతా సదైక-
సంతాన దేవ నగరీం సదృశీం న. మేనే.

ఆ రాజు యొక్క బాహాగ్రమున నిరవొందిన భూనాయిక గోత్రము (కులములు—కుల పర్వతములు) లానందించు చుండ సప్త సంతానముల సమృద్ధి ఎడసి ఏక సంతానముగన్న అమరావతిని పరిహసించుచున్నదని భావము. సము

దూఢగోత్రా=మోయబడిన పర్వతములుగలది. అనగా ఏ గోత్రములు పూర్వము తనను మోసి అలసెనో ఆ గోత్రములను తాను మోయుచు వాని అలసట తీర్చుచున్నదను చమత్కారము మూలాధికముగా అనువాదమున స్ఫురింప జేయబడినది. కుశ వితానమని మాత్రిమే మూలమున కలదు. అనువాదమున మంగల వితాన తతా యని మంగల పదము గ్రహింపబడినది. స్వర్లోకమున ఒక మంగళుడే కలడు. తన వద్దనో మంగళ వితాన మున్నదని చమత్కారము, తన వలె అమరావతి గోత్రముల మోయుట లేదు. అమరావతినే గోత్రము (మేరువు) మోయుచున్నది. తన వలె అనేక సంతానములు కలదికాదు. తన వలె అనేక మంగళ సంపన్నకాదు. అందు ఆ మంగళునకు విఖ్యాతత లేదు కావున భూనాయిక అమరావతీ సుదతిని పరిహసించుచున్నదని అనువాదమున మూలాధికముగా పారస్యము కల్పింపబడినది.

125 సీ॥ లలనాజ నాపాంగ వలనా వసద నంగ, తుల నాభికాభంగదో
ప్రసంగ। మలసానిల విలోల దళసానవరసాల, ఫలసాదర శుకాల
పన విశాల॥ మలి సీగరు దపీక మలినీ కృతధుపీక మలినీ సుఖి
తక్కోక కులవ ధూక। మతి కాంత సలతాంత రతికాంత, రనితాంత
రణతాంత సుతనుకాంత.

తే॥ మకృత కామోద కురవకా వికలవకుల ముకుల సకల వనాంత ప్రమోద
చలిత। కలిత కుల కంఠ కులకలర కాకలీవిలాసులతము [illegible]
మధుమాస వాసరలు.

126 శ్లో॥ కాంతా లోక వలద్వలక్ష విలసత్కందర్ప దోర్విక్రమో
[illegible] ధూత రసాలసాల పల్లభుగ్వాచాల కీరావలిః
[illegible] పక్ష విపీల [illegible] చక్రాంగనో
[illegible]

దీనిని వచన రూపమున అనువదించినచో శబ్దార్థ సౌందర్యము మౌలిక ముగా గోచరించెడిది. 'అనంగతులన, అధిక, అభంగదోః ప్రసంగ', 'మనుదానుకి ప్రవిల సత్కందర్ప దోర్విక్రమః, అను శ్లోక ప్రథమ చరణము సరియైన అనువాదము కాదు. పదార్థ బోధ సరిగా నేర్పడుట లేదు. 'కాంతా పాంగలత్స్మరాధిక భుజా గాఢోప గూహక్రమః', అని మార్చుట యుక్తము.

శ్లో॥ కృతకాన్య గంధనుత కాంత మేదినీ (తేటగీతి అనువదము)
వకులాది సాల ముకులాతి మంజులః
కల కంఠ బాలకుల కల కంఠ కాకలీ
ప్రథమాఽవిరాస మధు మాసవాసరః

అను ప్రాస సౌందర్య మనువాదమున కృత కేతరముగానున్నది. అను వాదము యథా మూలము. కాని ప్రథమ చరణాంతమున నున్న 'మేదినీ' పదమునకు ప్రయోజన మగుపడదు.

126 చ॥ ఒనర హిమావ కుఠంనము లూడ్చి తెమల్చిన పత్త్రభంగముల్
సన నసియాడుచున్ మొగడ చన్నుల పల్లవ పాణి గప్పనూ
తన లతికా లతాంగుల నుదార గతిం జలివాపి నెయ్యపుం
బెనకువ వేర్పె దక్షిణసమీరణు డొయ్యన దావు లంటుచున్.

127 శ్లో॥ (ఆకర్షన్) తుహినావ గుంఠనపటం తత్పత్ర భంగం నయన్
సోత్కంపం ముకులస్తనాన్ కిసలయో దంచత్కరై ర్గూహతామ్
మందం జాడ్య మపాస్య మంజుల లతా ముగ్ధాజనానాం స్పృశన్
బద్ధామోద తలాని దక్షిణ మరుత్ బంధాన్ కిమధ్యాపయత్.

చక్కని అనువాదము, నాయకుడు నవోఢ మునుగు దీసి ఆమె చిగురు టాకుల వంటి చేతులు కప్పుకొనగా. ఆమె వడకును పోగొట్టి, అభీష్టముల దీర్చి బుజ్జగించి ముగ్ధా నాయికను కోరికకు అనుకూలముగా మలచుకొనినట్లు మలయ సమీరుడు తీగ కన్నెల నట్లొనరించి వాని తావు లంటుచు నెయ్యపు

వెనకువ నేర్పెనని భావము, తావులు = కళాస్థానములు సువాసనలనుటకు, 'ఆమోదతలాని', అని అనువదించుట అతి సమర్థముగానున్నది. ఇట్లే బంధాన్, పదము సముచితముగా సారస్యావహముగా నుపయోగింపబడినది. మూలాను సారము దక్షిణ పదవినివేశము. అనువాదకుని దాక్షిణ్యము సాటుచున్నది. 'అధ్యా పయత్, అనునది ద్వికర్మకము, 'ముగ్ధా జనానామ్ అధ్యాపయత్; అని ప్రయోగము వాక్య విరుద్ధముకాదా యను శంక కలుగకపోదు. ముగ్ధా జనానాం బద్ధా మోదపదాని స్ప్రుశన్ అని అన్వయము. అపుడు ఉపక్రాంత పరామర్శక ముగా 'తాన్', అధ్యాపయత్ అని తచ్ఛబ్ద మధ్యాహరించుకొన్నచో పై దోషము నకు శంకాప్రసక్తియె ఉండదు.

127 మ॥ అలరుంగైదువు జోదు కూర్మి సయి దోడై మాధవ శ్రీతపః
ఫలమై యాడు మరుత్కుమారు బ్రియమొప్పం దేనె నీరార్చి లేఁ
వెలి పూజొంపపు బొత్తులం దొడిగి ధాత్రీ జాతముల్ జోలవా
డె లపత్పల్లవ డోల నుంచి కలకంఠీనాద గీతంబులన్,

128 శ్లో॥ సూనాసవై స్స్నమశరాప్త మరుత్కుమారం
ప్రస్నాప్య పుష్ప పట పల్లవ లోల దోలామ్
ప్రాపయ్య మాధవ రమా ప్రమదాయ ధాత్రీ-
జాతోత్తమా జగు రలం కలకంఠ నాదైః

మాధవ శ్రీ తపః ఫలముగా జన్మించిన మరుత్కుమారునకు ధాత్రీ జాత ములు (వృక్షములనే దాదుల సమూహములు) తేనె నీరార్చి లేత పూగుత్తులనే పొత్తిళ్ళు పరచి చిగుటాకుల తొట్టిలలో పరుండ బెట్టి కలకంఠీ గీతములతో జోలపాడుదురని భావము అనువాదము పరమ రమణీయముగా నున్నది. మాధవ శ్రీ తపశ్శ్రీ ఫలమై అనునది లేకున్నను 'మాధవరమా ప్రమదాయ' అను మాటలో అది చరితార్థ మౌతుంది.

128 సీ॥ మును సుమనోరాగమున వసంతము మూపె, గాన నేందిర యశో
కంపు గొమ్మ । కా కొమ్మ నగుచు నెయ్యమున గ్రొన్నన తేనె,
మెలగెడు సరసాళి మీద జల్లె । నాసరసాళి సోయగపు బాటల తోడ,
జని మాధవి ప్రవాళ శాటి, దుడిచె । నా మాధవి పరాగ మక్షిరాగమ్ము
మించ, బరతెంచు కలకంఠిపై విదిర్చె.

129 శ్లో॥ వన్యశ్రీః ప్రకటీచకార సుమనోరాగా ద్వసంతం పురా
కంకేల్యా మధురం మరంద మకిర త్కాంతాలి పంక్త్యై మసౌ
మాధవ్యాః కిసలాంబరే మహతి సా గాత్రీ మమృ మార్జెవతం
దృగ్రాగాయ పరాగమాశు కలకంఠ్యగ్రే చిచిక్షేప సా.

అశోకంపుకొమ్మ= అశోకపుకొమ్మ యనేస్త్రీ అను అర్థద్వయ స్ఫూర్తి
'కంకేల్యాః,' అనుచోట లేకున్నను. మూలము నందలి మాధవి పదమునకు గురి
వింజ తీగయను మాధవియను పేరుగలదని అర్థము జెప్పినట్లే అశోకపు కొమ్మ
కంకేలియను స్త్రీ అని అర్థము చెప్పవలసి యుండును. అక్షిరాగము మించ
బరతెంచు కలకంఠిపై మాధవి పరాగము విదిర్చెనను మూలమునకు కలకంఠి
కన్నులు ఎర్రబరచ ఆమెపై పరాగమును మాధవి విదిర్చెనని (చిమ్మె) 
కొద్ది మార్పు చేయబడినది.

అనువాదము మనోజ్ఞముగా నున్నది.

తే॥గీ॥ ఇట్లు లతికలు హితకోటి నెనసి యపుడు, మదవదేవోత్సవ,
క్రీడ బొదలు ననిన । వరులు ధరుణులు విరుల యో వరుల వ
లులు, సిరుల వల్లరాచ జాతరలె సేయుటరుదె.

129 శ్లో॥ ఏవం లతాభిరపి జాత హితా న్వితాభిః
కామోత్సవే విరుపమం కలితే తదానీమ్
కంధర్ప దైవత మహోత్సవ కల్పవేవ్యా
తాదృజ్నకింను తరుణీ తరుణావలీనామ్.

ఇది సీస పద్య గీతమున కమవాదము. అచేతనములగు లతాతరువులే మదన మహోత్సవమున తేలియాడు చుండగా, ఇక చేతనులగు తరుణీతరుణులను గూర్చి వేరే చెప్పవలయు నా అని మూలమునకు 'తాదృఙ్నకిం,' ను తరుణావలీనామ్' అన్న అనువాద వాక్యమున ఉదాత్తత లోపించినది.

129 మ॥ అరిగాఁ బంచమ మేపగించి నవలా లవ్వేళ హిందోళవై
ఖరి సూపం బిక జాత మాత్మ రవ భంగ వ్యాకులం బైవనీ
ధర నాలంబిత పల్లవ వ్రత విధుల్ తాల్పందదీయధ్వనిన్
సరిగా గైకొనియెన్ వసంతము మహా సంపూర్ణ భావోన్నతిన్.)

130 శ్లో॥ త్యక్త్వాథ పంచమమరిం తరుణీ జనేషు
హిందోల గాయిషు హితాత్మరవావ మత్యా
వన్యాంపికేషు కిసలవ్రతిషు స్వరం తం
సంపూర్ణతో నుజగృహే రిసమం వసంతః

స్త్రీలు పంచమ స్వరమును అరిగా (ఋషభ స్వరరహితముగానని భావము) భావించి హిందోల రాగమును నాలాపింపగా కోకిలలు తమ స్వరమునకు భంగము వాటిల్లుటచే కలతపడి వనభూమి ప్రవేశించి చిగుళ్ళభక్షణ సేయుచు వ్రతము సలుపగా ఆ కోకిలల పంచమ స్వరమును వసంతరాగము మహా సంపూర్ణ భావ స్థితితో సరిగాఁ ఋషభస్వర సహితముగా సంతరించెను. వసంత ఋతువు ప్రవేశించినపుడు స్త్రీలు ఋషభ పంచమములతో గూడ సప్త స్వరసహితమగు సంపూర్ణ సంజ్ఞగల వసంత రాగమును పాడిరని తాత్పర్యము. 'సరిగా' అన్నప్పుడున్న చమత్కారము 'రిసమమ్' అన్నపుడురాదు. ఐన అరిగా భావింపబడిన దానిని అరి సమముగా జేసెనను విరోధము సంధికృతముగా నేర్పరచి దానిని సంధి రహితముగా పలికి విరోధాభాసకృత చమత్కారము సంధ్య సంధి మూలమున అనువాదకుడు మరియొక పద్ధతిని ప్రవేశపెట్టి నాడని భావించవలయును అనువాదకుడు ఇక్కడ చక్కని చాకచక్యమును కనబరచినాడనవచ్చు (అనుజగృహే+అరిసమం = అనుజగృహేరిసమమ్, అనురీతి రెండు విధముల ఉచ్చరించినను అనుజగృహేరిసమమ్ అనియే ఉండును – శ్లేష స్థలము కావున అకార ప్రశ్లేష చిహ్నము సూచింప బడలేదు.

130 మ॥ కరఘాతంబుల కోర్వలేక హిమ సంఘాతంబు శీతక్షమా
ధర దుర్గంబు భజింపగా నలజగత్కంప ప్రదాస్తోకభీ
కర దోషాయతి శాలి జుట్టుకొని లగ్గల్ పట్టి ధట్టింతు నం
చర విందాప్తుడు దీచి కేగె ప్రబలుండై మాని దాక్షిణ్యమున్.

131 శ్లో॥ దుఃఖై రసహ్యై కర ఘాత భరైర్హిమాద్రి
దుర్గంగతే హిమ కులే ద్రుత మబ్జినీశః
ఆక్రమ్య తాదృగహితం ప్రబలో నిహంతుం
దాక్షిణ్య మాశు కిమపాస్యయయా వుదీచీమ్.

మంచు అరవిందములను చెడగొట్టుట వలన వాని ప్రియుడైన సూర్యుడు కోపించి కర ఘాతములు చేయగా అవి తమ నిలయమగు హిమాలయ దుర్గమున తలదాచుకొని జగత్తును వడకించుచు దోషాయతి శాలులై (రాత్రులకు దీర్ఘత్వము కలిగించుచు.) విజృంభిచుచుండగా చుట్టుముట్టడించి అహిమము లను మర్దింతుగాక యని సూర్యుడు దాక్షిణ్యమును (మోమోటమును, దక్షిణా యన స్థితిని) మాని ప్రబలుడై ఉదీచికేగెను. సూర్యుని యందు ప్రబల వ్యవ హారము సమారోపింపబడినది. లోక కంటకులై దోషాభిభూతులై ఉండు వ్యక్తులను చుట్టుముట్టి వీరుడు వారిని రూపడగించునను అప్రకృత వ్యవ హారము ఇందు స్ఫురించుచున్నది. "జగత్కంప ప్రదాస్తోకభీకర దోషాయతి శాలి" అను మాట పూర్తిగా అనువాదమున విడువబడినది. మిగిలినది హృద్యము.

131 మ॥ చివురుంగైదువు వేల్పు చైత్రమున నక్షీణధ్వజో త్క్షేపవై
భవుడై తెమ్మెర తేరిపై గదలి రా బ్రిత్యగ్ర సాలాగ్రహ
ర్మ్య విటంకంబుల ప్రాకి వల్లి వనజాస్యల్ సల్లి రుత్ఫుల్ల ప
ల్లవ హస్తంబుల భావి భావుక ఫలోల్లాసంబుతో గ్రొవ్విరుల్.

132 శ్లో॥ ఆరుహ్య మంద మరు దాత్మ రథం మనోభూ
దేవే భియాతి దివి భావి ఫలాభి లాషాత్
సాలాగ్ర సౌధ మధి రుహ్య లతా తరుణ్యః
కిం ఫుల్ల పల్లవ కరై రకిరన్ సుమాని.

ఇది పరమ రమణీయమైన అనువాదము. రథారూఢుడైన దేవునిపై పుర స్త్రీలు మేడలపై నిలచి పువ్వులు జల్లుదురు. సాధారణముగా రథోత్సవమునకు పూర్వము ధ్వజారోహణము చేయబడును. మీన ధ్వజారోపణను వసంత మాసమొనరింప మలయమారుత రథము నధిష్ఠించి మదన దేవుడు వచ్చుచుండ సాలాగ్రము లధిష్ఠించి లతా తన్వులు పల్లవ హస్తములతో క్రొవ్విరుల్ భావి భావుక ఫలోల్లాసమునకై చల్లిరి, అను భావము యథా మూలముగా అను వదింపబడినది. "అక్షీణ ధ్వజోత్క్షేపవైభవుడై" అనునది అనువాదమున రాకు న్నను. రథోత్సవము చెప్పబడుటచే అది తేలికగా వ్యక్తమౌతుంది మూల మున లేని ‹దివి› అను మాట అనువాదమున కూర్చబడినది- ఆకాశము నుండి వచ్చుచున్న ఆ మన్మథునిపై పూలు జల్లుటకు లతా తన్వులు సాలాగ్రము నెక్క వలసి వచ్చెనను సారస్యము అనువాదమున పోషింపబడినది.

132 మ॥ మహిళా మండల మంజుల భ్రమరకా మర్దంబు శ్యామాముహు
ర్మహ రున్మీలిత పత్ర భేద నిపుణంబుం బద్మినీ కంకణ
గ్రహణో పాదియు నై సగంధ విటపి ప్రాప్తిన్ విజృంభించుచున్
విహరించెన్ మధుమత్త గంధ వహ మవ్వేళన్ వనాంతంబునన్.

133 శ్లో॥ ఆ మర్దయన్ భ్రమరకాన్ మహిలావలీనాం
శ్యామాలి పత్రచయ హారకృత పద్మినీనాం
కర్షన్ స కంకణ కరాన్ వనగంధ వాహో
మాద్యన్ స గంధ విటపో మధునా, రరామ.

ఇందు గంధ వహుని ధౌర్త్యము వర్ణింపబడినది. గంధ వహుడు (వాయు వను మదోన్మత్తుడు) మహిళల యొక్క (ప్రేంకణపు తీగలను స్త్రీల యొక్క) భ్రమ రకములను (తుమ్మెదలను ముంగురులను) చెదరగొట్టుచు, శ్యామల (బావంచి తీగలను యౌవనమధ్య స్థల) యొక్క పత్ర రచనలను (ఆకుల గుత్తులను మకరికాది పత్రములను) విదిల్చుచు. పద్మినుల (తామర తీగలను పద్మినీ జాతి స్త్రీల) యొక్క కంకణములను (జలబిందువులను. చేతి కడియ ములను) కొల్లగొట్టుచు, స గంధ విటపుడై (సువాసిత వృక్షములను మద-

మత్తులగు విట (శ్రేష్ఠులతో గూడి) మధువుతో (వసంత ఋతు వసుకల్లుతో) కైపెక్కి స్వేచ్ఛగా విహరించెనని భావము. మూలమున కర' పదము లేదు అనువాదమున "కంకణ కరాన్" అని 'కర' పదము చేర్చబడినది. జల (లేక పూదేనియ) బిందు శోభలను బంగారు గాజులుగల చేతులను లాగుచు అని కాని చేతి కడియములను కొల్లగొట్టుచు అని కాని అర్థము గ్రహించవచ్చు, మహిళా భ్రమరకములను శ్యామా పత్రచయమును విదిర్చునని చెప్పినపుడు, పద్మినీ స కంకణ కరములను లాగునని చెప్పుటయే సముచితమని తోచును. అనువాదము చక్కగానున్నది. కాని క్రీడార్థక రము ధాతువు ఆత్మనే పదియే కాని పరస్మైపది కాదు. అడి లిఙ్రూపమునరేమే, అనియగును ఆరరామ అని ఉండ వచ్చు, కాని అపుడు రమించెనని అర్థముగాక విరమించెనని అర్థమే వచ్చును. వ్యాఙ్ పరిభ్యోరమః అను సూత్రాను సారము వి, ఆ. పరి. అను ఉపసర్గలు పూర్వముననున్నపుడు రము ధాతువు పరస్మైపదిలో మారును. ఆరరామ యని ఉండవచ్చును కాని ఆరతియనునపుడు విరతియను, అర్థమునే గ్రహించుచు న్నాము. ఆరరామయనునది కూడ విరామార్థమునే బోధించుచునన్నచో 'లలాస' యని కానిఁ వ్యవహార్షీత్, యని కాని పఠించవలయును, క్రీడార్థమున కూడ ప్రయోగములున్న వన్నచో ఇబ్బంది యుండదు.

సీ॥ ఏ పారు పొదరిండ్ల నా పాట లాశోక, దీపార్చి గనక కలాపమరసె
సాలావలులు దాటి యేలాలతావార, బాలా తతిపరాగ పటము లూడ్చె
నానా మధుపనవ్య గానామృతము మెచ్చి సూనాసవములెల్ల జూఱలిచ్చె
శంకారహితధీర హుంకార శుకభటా, హంకారముల ఫలా
హతియొనర్చె.

134 శ్లో॥ కుంజౌకః కనకాన్య శోక కుహనా దీపార్చిషో పాద దా
వేలావార వధూ పరాగ పటికా స్సాలాన్ విలంఘ్యాకృషత్
సంగీత్యా మధు పావ లేర్మధు దదౌ సౌనంస గంధా నిలో
భ్రాజత్కీర భటార్భటీభి రతనోత్ భాస్వత్ఫల వ్యాహతిమ్.

ఇందు గంధవహుని దౌష్ట్యములు చిత్రింపబడినవి. గంధవహుడు పొద రిండ్లను ఇండ్లలో ప్రవేశించి రక్తా శోకపు దీపముల సాహాయ్యమున

సంపెంగ పూల సంపద అను బంగారు సంపదను హరించి వృక్షములను ప్రాకారములను దాటి ఏలాలతలను వారవనితల పరాగములను వస్త్రములను ఊడ్చి తుమ్మెదలను మద్య పాయుల గీతా లాపములకు మెచ్చి పూదేనియయను ఇప్ప పూల సారాయి విందు వానికొనరించి నిర్భయ సంచారులగు చిలుక బలగముతో బహు ఫలములకు ఆహతి కల్పించెనని భావము. అను వాదము పరమ రమణీయముగా నున్నది. దాధాతువున్నప్పుడు దాన యోగ్య వ్యక్తి చతుర్థిలో నుండుట సంస్కృత సంప్రదాయము. 'మధుపావలేః దదౌ, అనుచోట చతుర్థికిబదులు షష్ఠి ఉపయోగింపబడినది. మధుపాలియొక్క సంగీతముచే అని 'మధుపావలేః అనునది 'సంగీత్యా' అను తృతీయాంతముతో నన్వయము కల్పించి వానికి సౌనాసవము నొసగెనని గ్రహించవలయును. లేనిచో మధుపాలయే అని యైన మార్చుకొనవచ్చును. 'అశోక కుహనా దీపార్చిషా' అనుచోట అశోకములను కపట దీపములతో నని అర్థము. దొంగవద్ద కపట (దొంగ) దీపములుండుట యుక్తమే కావున మూలమున లేకున్నను సారస్యము కొరకు 'కుహనా' పదము చేర్చినాడు. కనక కలాపము సంపెంగ పూలను సువర్ణాభరణములని మూలమున నున్నది. అనువాదమున 'కనకాని' అని కనకసామాన్యము గ్రహింప బడినది ఆభరణములనే కాదు. దాచుకొన్న బంగారమును కూడా కొల్లగొట్టినాడని సూచించుటకై 'కనకాని' అని కనక బహుత్వమును నిర్దేశించి మూలగత సారస్యమునకు ఉత్కర్ష కలిగించబడినది.

తే॥ ననుచు నాగంధవహుని ధౌర్త్యములు దెలుపు శీలవిరిసిన విరులు
133 రాలిన రజంబు లొలికిన రసంబు లురిలిన ఫలము లధిపు.
ప్రోలనిడి పల్కిరుద్యాన పాలురపుడు.

గ॥ ఇతి మలయ పవన ధౌర్త్య మీరయంత ఇవ కేళీవనపాలా,
134 వికచ కుసుమాని విశిథిలరజాంసి విగలన్మధూని విలుఠత్ఫలానిచ
మహోపహార తయా వసుధాధినాథసవిధే నిదాయ
గిరా సుధా విధయా కథయామాసుః

ఇది సీస గీతమునకు అనువాదము. విరిసిన విరులను చోట 'విరిసిన' పదమునకు రాలిపడిన యని అర్థము. తమ మాటపైన రాజునకు సంపూర్ణ

విశ్వాసము కలిగింపనై తగిన సాక్ష్యములను చూపుచున్నారు. ఆ గంధవహుడు కొల్లగొట్టి ఎత్తుకుని పోగా పడిపోయిన వస్తువులను, చెడగొట్టబడిన వస్తువులను రాజుగారి ముందిడి విన్నవించుకొనుచున్నారు. ఆ వస్తువులు మధురోపహారము లెట్లగును. అమూల్యములైన వాసినే ఉపహారములుగా సమర్పింతురు కాని, విశీర్ణ కుసుమములను, విగలిత పరాగములను రాజుగారికి సమర్పింపరు కావున 'మధురోపహారతయా! అనునది మూలవిరుద్ధమేకాక అనౌచిత్యావహము-దీనిని తొలగించి 'వికచకుసుమాని; లోని వికచ స్థానమున విశీర్ణ పదముంచుట యుక్తమని తోచుచున్నది.

క॥ స్వామీ యేమని పొగడెద, మామనికిన్ మనికియైన యారామమునం
గామ నిశితాస్త్రములు త, త్కోమలతర లతలు జిగురు గొమ్మలుజేవల్.

135 శ్లో॥ స్వామిన్ సదా రామవరం సచైత్రం
కథం స్తుమః కామ నిశాత బాణాః
తన్మంజు వల్లీ తరవః ప్రవాల
శాఖా ప్రసారా శ్శతకోటి సారాః

ఆ మనికిన్ మనికియైన అను మూలమునకు 'సదా రామవరం సచైత్రమ్ అనునది. సరియైన అనువాదముకాదు. కాని 'చిగురు గొమ్మలు చేవల్' అనుమూల భావము 'ప్రవాల శాఖా ప్రసారా శ్శతకోటి సారాః; అను వాక్యమున చక్కగా విశ్లేషించబడినది.

తే॥ నాథ చివురులు రంజిల్లెననలు మొలిచె, నలరె విరులెల్లి బూపలు
దలలు సూపె। బసిమి నిరవొందె బిందియల్ బలసె నవళ, లాటు
వులు సాంద్రరుచుల ఫలంబు లెసగ.

136 శ్లో॥ ప్రవాలా ముకులాగుచ్ఛాః ప్రసూనాని తదంకురాః
భవ్యనవ్య శలాటూని భాంతి పక్వ ఫలానిచ.

చివురులు రాగిల్లెను మొగ్గలు పొటమరించెను పువ్వులు వికసించెను మొటిమలు పొడసూపెను పిందెలు పసరు ఛాయతో నొప్పెను కాయలు బలసెను ఫలములు స్వాదురుచుల నెసగెనని ప్రవాలాదులకు రాగిల్లుట మున్నగు స్వాభావిక ధర్మములు మూలమున సుందరముగా పేర్కొనబడినవి. అనువాదమున ఈ ప్రతి పాదనలేదు. కేవలము ప్రవాళాదులు పేర్కొనబడిన్నవి - కానివాటి- అవస్థలు ఉల్లేఖించలేదు,

135 ఉ॥ కేళివనాలి నీ యెడ శుకీనినదార్భటి చెప్పనేల భూ
పాలక నీలకంఠములు పాయక మ్రోయు లతాంతవాస నా
జాలము నోడుముట్ట సురసాలము నీడ్కొనివచ్చు షట్పదీ
మాలిక దోచు నబ్బురపు మబ్బుల యుబ్బులు గుబ్బతిల్లగన్.

137 శ్లో॥ కేళీ (వనేరసతి) కేకికులం శుకౌఘః
స్వర్ద్రుం విహాయ దివ ముత్సుమ సౌరభాయ
అభ్రాగతా నలిగణా నవలోక్య మోదా
దాడంబ రాంబుద కదంబ విడంబి బింబాన్.

రాజా మన ఉద్యానమున చిలుకల ఆర్భాటము వేరే చెప్పబనిలేదు. ఇందలి లతాంతరు కుసుమ వాసనలు మిన్నంటి కపాలములకెక్కగా నందన వన పారిజాతములను విడిచి తుమ్మెదలు బారులుకట్టి వచ్చుచుండును. అట్లుబారులు కట్టి వచ్చెడి భ్రమర పంక్తులను చూచి మేఘములనుకొని నెమిళ్ళు కేకలు పెట్టు చుండును. అని పద్య భావము. ఈ స్ఫూర్తి అనువాదమున గోచరించుటలేదు. పూర్వార్ధమున అన్వయక్లేశ ముండుటవలన వాక్యార్థమే బోధపడుటలేదు.

శ్లో॥ కేళీవనే శుకరవాకులితే మయూరా
ఆనాక మాచిత లతాంత పరిమలార్థమ్
త్యక్త్వాఽఽగతాన్ సురతరూన్ మధుపాన్ విలోక్య
పాథోదమండల ధియా నినదంతి నూనమ్.

అని మార్చినచో పద్యగత భావమ్ము బోధపడుతుంది.

క॥ మహనీయ మధురఝరీ సంగ్రహమున గాలువలు వఱపి గనిమలుగ రజం। బహరహము నె ఱపి మాకున్ సహకారము లయ్యె నచటి సహకారంబుల్.

138 శ్లో॥ మకరంద మహాకుల్యాః పరాగ పద సేతవః
సహకారాహి తత్రస్థాః సహకారా దినే దినే.

అనుష్టుప్ గతి అందముగానున్నది. ఆ వనమందలి తియ్యని మామిల్లు పూదేనియల కాలువలు సారించుచు వారికి పరాగముల కట్టలు గట్టుచు మాకెంతో సహకరించుచున్నవని పద్య భావము. పూదేనియ గొప్ప కాల్వలు కలిగి పరాగ సేతువుఱ కలిగి అందలి తియ్య మావుఱ సహకరించుచున్నవను అనువాద వాక్యమున స్పష్టముగా ప్రతిబింబించుట లేదు. అందలి పూదేనియకాలువలు, అందలి పరాగమయ సేతువులు అనివ్యస్తముగా (సహకారములకు విశేషణము చేయకుండ) అర్థము చెప్పినచో సహకారముల సహకారత్వము అసలే కుదురదు. బహువ్రీహి సమాస మాశ్రయించునచో పారించుట కట్టుట అను మాటలలోని స్పష్టత గోచరింపదు. కావున "ప్రవాహ్య మధుభిః కుల్యాః సేతూన్సంధాయ పాంసుభిః" అని పూర్వార్ధము మార్చినచో తాత్పర్యము సుగమమగును.

138 శ్లో॥ ఆయారమ్మల బొల్చుకొమ్మలబెడంగాపల్లవ శ్రేణి రం
గాయా తావుల మించు పూఱఅపు లాహా యెన్నగా శక్యమే
యా యుద్యానము సాటి చైత్రరథ మెట్లౌ నాయత శ్రీయుతం
బై యొక్కొక్క నగంబె చైత్ర రథమై యందున్ విజృంభింపగన్

140 శ్లో॥ తత్కుంజ వల్లి తరుపల్లవ సూనశయ్యా
లక్ష్మీనుతౌ కమలజోపి నలబ్ధవర్ణః
(కేలివనేన) బత చైత్ర రథం సమంకిమ్
ఏకైక సాల ఇహ చైత్ర రథాధి లీలః

ఆ కొమ్మల బెడంగు ఆపల్లవ శ్రేణిరంగు ఆ యాతావుల మించు పూబరపు లాహోయను మాటలలోని అర్థాంతర స్ఫూర్తి కృతత చమత్కారమను వాదమున లేదు. వాని నెన్న శక్యమేయని మూలమున నుండగా కమలజునకు కూడ వానిని నుతింప దగిన పాండిత్యము లేదని అనువాద మొనరింపబడినది– 'కేలీవ సేన బత చైత్ర రథం– సమంకిమ్,' అనుచోట ఆ ఉద్యానము సాటి చైత్ర రథమెట్లౌ అను తెలుగు వాక్య పరిభావము సంపూర్ణముగా పడినది. "చైత్ర రథాధి లీలః", అనుచోట అయత శ్రీయుత మను భావము స్ఫురించుటయే గాక చైత్ర రథుని (వసంతుని) అధిక లీలలు గలదని అర్థాంతర స్ఫురణ చేయబడినది.

139 సీ॥ ఇమ్ములై మరుహజారమ్ములై పొదలుండ, బూజవికలు వేఱపూనవలదు
తెప్పలై నెత్తావి కుప్పలై పుప్పొళ్ళు, రుల గందవడి త్రోవ జిలుకవలదు
సారమై హిమజలా సారమై పూదేనె, నెఱయగేళాకూళి నింపవలదు
మొత్తమై మారుతాయత్తమై గంబూర, మొగయ వితానముల్
బిగియవలదు.

141 శ్లో॥ లీలానికుంజ గృహేషు శోభిషు పరాశ్చాలా నకల్పావ్యై స్సుమైః
మానా నాపట వాసక్లుప్తిరయనే సూనాలిరేణూక్షణే
పూర్ణా విభ్రమ దీర్ఘికా సుమకుజో ద్గీర్ణాసవైః కింజలైః
వాతాధూత సితాభ్రరేణు ర్ఘపరి స్పీతా వితానై రలమ్.

వసంతుడు నీవన పాలకుడు కావున నీ వెపుడు వత్తువోయని అలంకరించి ఎదురు చూచు చున్నాడు. సాధారణముగా తమ ప్రభువులు వన విహారమునకై వచ్చునపుడు వన పాలురు పూబందిళ్లుగట్టి త్రోవలందు మెత్తగానుండునట్లు గంధపు పొడి చల్లి కేళాకూళిలో నీరు నింపి మంచు చినుకులవలె నలుగడల పడునట్లు ఒనరించి పైన మేలు కట్టుకట్టి అలంకరింతురు. వసంతుడు అదియే యొనరించెను. రాజా! మేము చేయనక్కర లేకయే అతడు మావలెనే దేవర వన పాలకుడగుటచే పూజవికలకు మారుగా పూపొదరిండ్లు మున్నగు వానిని సమకట్టి తమరాక కెదురు చూచుచున్నాడని భావము. ఇది అనువాదమున

చక్కగా ప్రతిబింబించినది. కాని తెల్గు వాక్యముల ప్రభావము మొదటి చరణ మున సంపూర్ణముగా, ఇతర చరణములో సామాన్యముగా ప్రసరించినది. ప్రాస నియమము పెట్టుకొనకున్నచో వాక్యమునందముగా (సంస్కృత లక్షణ సమన్వితముగా) నిర్మించి యుండెడివాడు.

శ్లో॥ లీలాకుంజ శతాని భాంతి కుసుమైః క్లృప్తైరలం మండపైః
మార్గాః పుష్పపరాగచూర్ణ మసృణాః పిష్టాతకైః కింకృతమ్
సంపూర్ణాని సరాంసి సన్మధురుచైః స్సంపూరితైః కింజలైః
వాతా ధూతసితాభ్రపాంసు రుపరిస్ఫీతా వితానై రలమ్.

అని మార్చినచో మూల భావంతో పాటు సంస్కృతపు నుడికారం ప్రస్ఫురిస్తుంది. కాని ప్రతి పాద ప్రాసకు భంగం కల్గుతుంది.

తే॥ స్వామి యారామ శుభవైభవములు సూడ
నెపుడు విచ్చేయుదురొ యంచు నెదురు సూచు
సహజ సౌభాగ్యములు గూర్చి చైత్రుడతడు
కూర్మి భవదీయ వన పాలకుండు గాదె.

141 శ్లో॥ హృద్యాన వద్య సౌభాగ్య ముద్యాన మభివీక్షితుం
వన పాలక చైత్రస్త్వాం వనపాల ఇవేచ్ఛతి.

ఇది పై సీస గీత పద్యమున కనువాదము "సహజ సౌభాగ్యములు గూర్చి, చైత్రుడతడు కూర్మి భవదీయ వన పాలకుండుగాదే" అన్నది మూలము. వనము పాలించె చైత్రుడు నీవా ఉద్యాన సౌభాగ్య మూలో కించుటకై వన పాలకునిగా కోరుచున్నాడన్నది అనువాదము. ఇవవీక్షితుమ్ వన పాలః ప్రతీక్షతే - అని మార్చినచో చైత్రుడు వన పాలునిగా ఎదిరి చూచుచున్నాడన్న మూల భావం స్పష్టమౌతుంది. అభివీక్షితుం అన్నపుడున్న బిగువు ఇవ వీక్షితుం అన్నపుడు మాత్రము రాదు.

తే॥ తెచ్చిన నవేక చక్ర సందీప్తమును న, తీత హరిదశ్వమును జగద్వి
ఖ్యాతోరు। సారథియు నైనయమ్మహా సార సహితు. నరద
మరుదయ్యె జనలోచ నాబ్జములకు.

145 శ్లో॥ అతిచక్రోఽతీత హరిదశ్వః ఖ్యాతోరు సారథిః
స సారస హితస్యాసీత్ సర్వ నేత్రాబ్జ విస్మయః

"మహా సారసహిత" అనుచోట మహచ్ఛబ్దము సూర్యాధిక్యమును వసు రాజునకు స్ఫురింపజేయును. అనువాదమున ఈ మహత్ పదములేదు. సారస హితుని రథము ఏక చక్రము హరి దశ్వము అనూరు సారధికము ఈ మహా సార సహితుని రథము అనేక చక్రము అతీత హరిదశ్వము ఖ్యాతోరు సార ధికము అగుట వలన ఈతడు మహా సార సహితుడయ్యెను. సూర్యుడు కేవ లము సారస హితుడు. ఆను సారస్యమును మహచ్ఛబ్దము సూచించుచున్నది. మహచ్ఛబ్ద మనువాదమున లేదు. మహాసార సహితస్యాభూ ద్దృగబ్జప్రమోదదః అనిమార్చినచో పై అర్థము వచ్చును. అతి చక్రః అనుచోట అభి చక్రః అనిమార్చినచో నాల్గు దిక్కుల చక్రములు గలదను అర్థము వచ్చును

144 మ॥ ద్రవిణాధీశ్వరు డాత్మరూఢ వసునాథ ఖ్యాతి భీతిం గర౦
బు విమానోత్తమ మంపెనో యన రుచిం బొల్పారు నాస్యందనం
బవనీ నాయకుడెక్కె నొక్క మొగి శంఖారావముల్ వందిపుం
గన వాచా విభవంబు వేత్ర ధరహుంకారంబు దోరంబుగన్.

146 శ్లో॥ నవ వసుపతి నామ ఖ్యాతి భీతాలకారా
ట్కరే కలిత విమానా కార ధీకృద్రథేందేః
వసు విభు పద (భూమౌ వంది) ఘోషై స్సహాసన్
విజయ జలజనాదా వేత్రిహుంకార వాదాః

వసు నాథుడను నామము వసురాజు కున్నట్లు కుబేరునకు కలదు. వసు నాథుడైన నాకు నాథుడా ఇతడని ఎక్కడ కోపించునోయను భయముచే కుబేరుడు తన విధేయతను ప్రకటింపబూని అప్పనముగా పుష్పక విమానమును పంపి

నాడన్నట్లున్న రథమును వసురాజు అధిష్ఠింపగా మాగధస్తవములతో శంఖనాదములు వేత్రధారుల హుంకారములు ఒక్క మొగి చెలరేగెను. జలజ పదము శంఖార్థమున ప్రయోగింపబడినది. వసురాజు రథము నధిష్ఠించుచుండ శంఖనాదాదు లేర్పడినవని మూలము. వసురాజు పాదముల చెంత రథముండగా (నిలువగా) ధ్వను లేర్పడెనని అనువాదము 'సందర్శనార్థమ్' అను తరువాతి శ్లోకమున రాజు సందర్శనమునకు అవకాశము ఏర్పరచుటకై ఈ కొద్ది మార్పు చేయబడినట్లు తోచుచున్నది.

145 చ॥ పొడగనవేళ యబ్బెనని పొంగి కళింగ శకాంగముఖ్యుల
యెడనెడ నేడ యాక కృిందుకొని యెల్లెడలన్ వెడలంగ వార్థిబల్
తొడవుల తాలి ముత్యములు తోరములై త్తొరగెం బురంబున
గ్గడల ప్రసూనకోరకని కాయము నింపిన సొంపు పెంపునన్.

వ॥ అప్పు డప్పురందర వైభవుండు మణిచాప శర్ధకలాప రాజితంబును, మదాంధరాజ హంసోద్వేజక కూజితంబును, మంజుతర కంజరాగ పుంజపింజరిత మరీచిమంజరీ సంజనిత సమంజస సౌదామనీ ధామంబును మౌక్తిక వితాన దంతురితాంత రాభిరామంబును మసార సార కిరణ దోరణీ సంస్కారిత వినీల శరదంబును నగు నరదంబు వధి వసించి సముజ్జ్వలిత హేతి ధర విభ్రమంబులు సుద్దండ దండ ధర సంభ్రమంబులును, సున్నిద్ర పుణ్యజన వాగ్విశేషంబులు నుజ్జృంభిత వాహినీశ్వర తనోన్మేషంబులు నుగ్ర పేశా గణ కలకలంబులు నుద్ధూత కేతనావలికోలాహలంబులు నున్నత రాజరాజ భజన కౌతూహలంబులు నవతరించుచు నానంద నోద్యాన రాజంబు జేరం జను సమయంబున.

147 శ్లో॥ సందర్శనార్థం సముత్సుకాః కిలేతి
సంతోషతో రాజను సంకుతేషు
కాషాతికీర్ణాః (కలికా ఇవాసన్)
భూషాలి ముక్తా భువి భూరి సక్తాః

దర్శింప నిదే యదనని అనేక రాజులు ముసురుకొని వచ్చుటచే ఒండొరుల ఒరపిడివలన వారి ముక్తాహారములు పెరుగుటచే ముత్తెములు నల్గడల రాలి పడెను. అవి నగరము నల్గడల వెదజల్లిన పూమొగ్గలన్నట్లుండెను. ఉత్తరార్ధమున వాక్యము అందముగాలేదు. భూషాలి ముక్తలు కషణము వలన అతి కీర్ణములై నేలయందు నక్తములైనమొగ్గలాయన్నట్లుండెనని పదములకర్థము దీనివలన వాక్యార్థ స్ఫూర్తి కలుగుట కష్టము. 'కాప్యై, ర్వికీర్ణాః కలికా ఇవాసన్ భూషాసుముక్తాః పతితో విశీర్ణాః, అనుట కొంత మెరగు. అనువాదకునకు భావదృష్టి కన్న ప్రాస దృష్టి యందే మమత మిన్నగా నున్నది. (భూషాసు ముక్తాః భూషణములయందలి ముత్తియములు). అట్లే రాజసు సంకులేషు అన్నది సంస్కృత కారకమర్యాదకాదు సంకుల భూపతీనామ్ అన్నచో కారకమర్యాద దెబ్బతినదు. ముసిరికొన్న రాజుల యొక్క పరస్పర మొరిపిడివల్ల భూషణాల నుండి ముత్తియములు రాలినవను అర్థము సుగమమౌతుంది.

గ॥ అథవాసవ వైభవో మణిచాప శేఖర కలాపరాజితం, మదాంధ రాజహంసోద్వేక్ష కూజితం, మంజుతర శింజరాగ పుంజసంజనిత మరీచి మంజరీ ప్రమంజన సౌదామనీ దామ గుంభితం, మౌక్తికవితాన దంతురాంత రాల జృంభితం, మసార సార కరణ ధోరణీ సంస్కారిత నీలమేఘం, నిర్మల విభౌషం, తథా విధం మణి రథ మధి వస న్నుజ్జ్వలిత హేతిధర విభ్రమమ్ ఉల్లసిత ధార్మిక సంభ్రమమ్, ఉన్నిద్ర పుణ్యజన వాగ్విశేషమ్, ఉజ్జృంభిత వాహినీశ్వర రవోన్మేషమ్, ఉద్ధూత కేతనా నిల కోలాహలమ్, ఉన్నత రాజరాజ భజన కౌతూహలమ్, ఉగ్రసేనా కలకల మప్యవ ధావయన్ జగామ నటదలి స్తోమం నవపిక గ్రామం నయనాభి రామం నందనారామమ్.

ఇందు పురందర వైభవము తుల్య విశేషణములచే వసురాజు యందు సూచింపబడినది. "ఉద్దండదండ ధర" అను మూలమునకు "ఉల్లసిత ధార్మిక మని అనువాదము. ధార్మిక పదమునకు యమార్థ ప్రసిద్ధి దండ ధర పదమున కున్నంత లేదు. నిర్మలవిభౌషం నటదలిస్తోమం నవపిక గ్రామం నయనాభి

రామమ్ అనునవి మూలాధికములు అవధానయన్ అనుచో అవధారయన్ అనుటయుక్తము.

తే॥ ఘనతరఫలానతాఖండ కదళికలును, గీరరాజీకృత సజీవ తోరణములు
బొంగు నెలమావి కురుజాల భంగనవఫ, లావళులుగాంచె నృపుడు వనాగ్రసీమ

151 శ్లో॥ దదర్శ (రంభాన) మితాః ఫలాఢ్యా
శ్శుకాఽసుమచ్ఛోభన తోరణాని
చూత ప్రవాలారుణ కేతనాని
వసుః (ఫలా) లించ వనాగ్రదేశే.

రాజు వచ్చునపుడు పట్టణాదుల పురోభాగము లందు పండ్లగెలలతో గూడిన అరటి చెట్లను ఇరు ప్రక్కల నిలిపి పచ్చని తోరణములను గట్టి మామిడి చిగురు జొంపములను వ్రేలాడ గట్టి శుకాదులు ముట్టుకొనని పండ్ల బుట్టలను కానుకలుగా నుంచుదురు. ఉద్యానవనాంగణము కూడ కదళీస్తంభాదులతో అపృథగ్యత్నముగా అలంకృతమయ్యెను. వానిని జూచుచు రాజు వెళ్లెనని భావము. "కీరరాజీకృత సజీవ తోరణములను", శుకాసుమచ్ఛోభన తోరణాని' అని అనువాదము స్ఫురింపచేయదు. చిలుకలచే ప్రాణములు కలిగినట్లు శోభిల్లుచున్న తోరణములను అని త్వరగా అర్థము స్ఫురింపదు. శుకైస్స జీవీకృత తోరణాని' అన్నచో అర్థ స్ఫూర్తి కలుగుతుంది నెల మావి కురుజాలని మాత్రమే మూలమున నున్నది' చూత ప్రవాలారుణ కేత నాని' అని అరుణ పతాకలను అనువాదకుడు ప్రవేశ పెట్టినాడు. తోరణములున్నపుడు పతాకలు కూడా ఉండవలసినదే. చూతప్రవాల రూపమైన అరుణ పతాకలనుట విశేషము ఈ సారస్యము మూలమున లేదు.

150 మ॥ అల చైత్రాంచిత సత్త్రశాలికల నిష్ఠాహారతృప్తింగుతూ
హముల్ గాంచు ద్విజావళుల్ శ్రుతిహితా వ్యాజానులాపంబుతో
నలఘు శ్రీకర శాఖికాంచల వినిర్యత్కేసరా ర్ద్రాక్షతం
బులరాల్చెన్ నరదేవ రత్నముకుటీ భూషా విశేషంబుగన్.

152 శ్లో॥ చైత్రాంచితో పవన సత్ర చిరోద్యదిష్టా
హారా ద్విజా శ్శ్రితిహి (తాలపనైః) స్సమోదమ్
శాఖాకరైస్సమకిరన్ క్షితిశక్ర మౌళౌ
మందార కేసర శుభాక్షత మండలాని.

మూలమున "చైత్రాంచిత సత్రి శాలికలన్=మధు మాసమున విరాజిల్లెడి వన ప్రవేశములనే చైత్ర మాసమున విలసిల్లెడి యాగ శాలలందు అని అర్థద్వయము వచ్చునట్లు కూర్చబడినది. అనువాదమున ఉప వనములనే సత్రములందని విడివిడిగా చెప్పబడినది. అనువాదము చక్కగానున్నది. 'శ్రుతిహితాలపనైః అను దానిని "శ్రుతిహితైర్లపితైః" అని మార్చుట యుక్తము. అట్టులే "చిరోద్య దిష్టాహారాః" అనుచోట 'చిరేప్సి తేష్టాహారాః' అని మార్చుట యుక్తము. చిరకాలము నుండి పొందదలచబడిన ఇష్టాహారము గలవై యని సారళ్యము సారస్యము చేకూరును.

151 ఉ॥ ఆదరణీయ రామ కథ నాంక శుకోక్తుల తోడ దీవము
త్తైదువచాలు శోభన పుటారతు లెత్తె సదాగతిన్ గిరి
క్షోద వినోదికిం జిగురు జొంపపు గెంపుల పళ్లెరంబు లం
ద్రోది దనర్చునగ్గలపు మొగ్గలు ముత్తెపు ముగ్గులీన గన్.

153 శ్లో॥ కళ్యాణ రామ కథ నాంక శుకోక్తి రమ్యా
వల్లీ సతీ వితతి రాప్త సదా గతేన
నీరాజనాం కిసల నీరజ రాగ పాత్రైః
ముక్తోప మానము కులైర్ధృహ రాచచార.

పళ్లెరములో ముత్తెములను ముగ్గులుగా దీర్చి నివాళించుట మంగళాచారము దీవముత్తైదువలు చిలుక పలుకులతో తెల్లని ముగ్గులు ముత్తెపు ముగ్గుల నీను చుండగా చిగురు జొంపములను కెంపు పళ్లెరములతో సదాగతి సందర్భమున వసురాజునకు శోభనపుటారతులిచ్చినవి. అనువాదమున మూలభావము ప్రతి స్ఫురించి నను 'ముత్తెపుముగ్గు లీనగన్' అనునది మాత్రము లోపించినది.

"ముక్తోప నూన ముకులైః" అనునది తదర్థ స్ఫూర్తి నీయదు.

153 మ॥ కలకంఠార్భటి నొండొరులం బిలుచుచున్ గాఢచ్ఛదాచ్ఛాదికల్
డొలయంగా నవగంధ బంధుర రజంబుల్ సిందగా జాలకం
బులు గాసిం బడగా నికుంజ నిలయంబుల్ మీఱి వాయుత్వరం
దలసూపెం బ్రతతీ సతీ వితతి గోత్రాకాంతు దేతేరగన్.

155 శ్లో॥ రాజ్ఞా లిపాలి కలకంఠ రవా విలోల
పత్త్రాంశు కోపరి (వికీర్ణసుగంధ) ధరేణుః
వ్యాలోల జాలకవతీ వనకుంజ గేహాత్
వల్లీ సతీ తతి రలక్షి సవాయువే గా.

అనువాదమున "కలకంఠార్భటి నొండొరుం బిల్చుచున్" ఇత్యాదుల లోని సొగసు రాకున్నను. భావమునకు భంగములేదు 'ఉపరి వికీర్ణ సుగంధరేణుః' అను చోట 'వికీర్ణ' కు 'విశీర్ణ, అన్నచో అనువాదము 'నవగంధ బంధుర రజంబుల్ సిందగా, అని మూలమునకు అనుకూలముగా నుండును. పత్త్రాంశుకోపరి" యని యున్నందున చల్లబడిన సుగంధరేణువు అని భావించి కోష్ఠ స్థానమున వికీర్ణ పదమును చేర్చి యుందురని తోచుచున్నది. మేలి ముసుగు తొలగుచున్నపుడు అలమికొన్న గంధ పరాగము వానితో పాటు చెదరిపోవు చుండునని భావము. తొలగిపోయెడి పత్త్రాంశుకములపై గంధపుపొడి చల్లుటలో సారస్యము కూడ లేదు. అపుడు ‹‹పత్త్రాంశుకోపరి" చోట పత్త్రాంశుకములపై చెదరిన గంధపుపొడియని అర్థముగాదా; ఇందు సారస్యమేమియను శంక కలుగును." వ్యాలోల పత్త్రాంశుకా ఉపరి విశీర్ణ సుగంధరేణుః" అనియే విభాగము. పైట తొలగినచోట మాత్రమే గంధపు పొడి చెదిరి పోయినదని ఉపరి పదమునకు ప్రయోజనము కావున ‹‹వ్యాలోల పత్త్రాంశుకా ఉపరి విశీర్ణ సుగంధరేణుః" అని రెండును వ్యస్త విశేషణములు.

154 చ॥ జనపతి దార సిల్లనొక సంపెంగ తావుల కొమ్మరాగవ
ద్ధన సుమనోభిరామ యయి కాక వహింపగలేోలు గానిచో
ననుపమ పంచ సాయక కరాంచల చంచల చాపశింజినీ
జనిత కఠోర ఝంకృతులు సైపక యున్నె పరాగ పాండువై.

156 శో॥ తత్రాతి రాగ సుమనా స్తవనీయవల్లీ
తన్వీ సమీపజుషి తాపమవాప భూపే
తస్మా (న్మనో) జ భుజతాదృశ చాపమౌర్వీ
తారస్వరా స హతరాసపరాగ పాండుః

అనువాదము మూలాను గుణముగానున్నది. 'స్తవనీయ' చోట పకార స్థానమున వకారము దొర్లినది.' తపనీయ వల్లీ తన్వీ, యనునది యుక్తపాఠము తస్మాత్=తాపము బొందుట వలననే అని అర్థము." సపరాగపాండుః'' అని ఏక పదముగా అచ్చుపడినది. దీనివలన అర్థము స్ఫురించుటలేదు. "తారస్వరాఽఽ సహతరా స, పరాగపాండుః" అనునది సరియైన పాఠమై యుండును. ఆస అనునది బహూవార్ధకమగు క్రియా ప్రతినిధి యైన అవ్యయము. పలుచోట్ల ఇటువంటి క్లేశములే ఏర్పడుచున్నవి.

155 చ॥ చలిత లతాంత కాంతి యను చందురకావి చెఱంగు దాటి స
మ్మిలిత వయో విలాసముల మీటిన విచ్చు ఫల స్తనాగ్రముల్
వెలువడ గప్పె దక్షణమ వేల్లిత దోహద ధూప ధూమకుం
తలములు విప్పి దాడిమ లతా లలితాంగి నృపాలు చెంగటన్.

157 శో॥ తాదృక్ఫల స్తనతటం సవయో విలాసమ్
విస్రస్త సూన వసనం విభు సన్నిధానే
బంధశ్లథేన కృత దోహద ధూప ధూమ
కైశ్యేన దాడిమ లతారమణీ వ్యధాత్ కిమ్.

దాడిమ లతయను లతాంగి వయో విలాస బంధురమగు ఫలస్తన తటమున పూల బట్ట చెదరిపోగా దోహద ధూప ధూమమను వెంట్రుకలతో కప్పుకొనెను అను వాదము రమణీయముగా నున్నది. కాని 'శ్లథేన', అనుచోట శ్లథ పదము

విశేషణ వాచకము. కావి భావార్థమున ప్రయోగింపబడినది. 'శ్లథ' అను ధాతువునకు 'అచ్, ప్రత్యయము విశేషణార్థముననే వచ్చును. భావార్థమున వాడుట చింత్యము. బంధము వీడి పోవుటచే అని అర్థము. బంధ పదమునకు తొడిమ, ముడి, అని అర్థద్వయము తొడిమయనెడి ముడి వీడిపోవుటచే పుష్పవసనము జారి పోయినదని భావము విస్రస్త అనుచోట 'విస్రంసి, అనుట యుక్తము.

158 మ॥ లలితైణాంక శిలాలవాల యను కేళాకూలిలో నీరుపైఁ
జెలు వొప్పన్ ధరియించి తోడనె మిళచ్చిక్రోడదంష్ట్రాదళ
త్ఫల రంధ్రంబుల చే వెలార్చి జల సూత్ర స్తంభముంబోని య
గ్గల పుంజాయల గుజ్జు నారి కడముంగాంచెన్ విభుండయ్యెడన్.

160 శ్లో॥ వాప్యంబు పూర్ణవన జాది శిలాల వాలమ్
చిక్రోడ దష్టఫల చిత్ర రస ప్రసారమ్
రాజా ద దర్శస తదా రచితాంబు యంత్ర
స్తంభోపమ స్తవన వామన నారికేళమ్.

నీళ్ళు నింఢియున్న చంద్రకాంత మణి మయమగు పాదును చలువరాలు తాకిన కేళాకూలిగా ఆపాదులో సన్న గుజ్జు టెంకాయ చెట్టు జల సూత్ర నాలముగా కోరలచే ఉడుతలు కొరికగా నేర్పడిన తూంట్ల నుండి బొట్లు బొట్లుగా జారు నీరును జల యంత్ర వివరముల నుండి పడెడి నీటి తుంపరగా కవి రూపించెను, రాజు ఆ వనమందు ఒక గున్న టెంకాయ చెట్టును చూచెను. అది చంద్రకాంత మయమగు పాదు కలిగియుండెను ఉడుతలు కాయలను గంటు పరచగా ఆ గంట్ల నుండి నీటి బొట్లు పడుచుండెను. అది కేళీకూలిలోని నీరు జలయంత్ర నాళముపైకి పీల్చుకొని సన్నని రంధ్రముల దారిన వెదజల్లు చున్నట్లుండెను ఈ భావము అనువాదమున క్లిష్టముగా స్ఫురించుచున్నది. స్తవన పదమున కౌచిత్యమేమో ? తెలియుటలేదు. 'స్తవనవామన, అనునది' 'స్తబక వామన' అని ఉండునేమో!



# ద్వితీయాశ్వాసము

3 ఉ॥ ఆ యెడ నొక్క నర్మ సచివాగ్రిణి యిట్లను నోయ ఖండతే
జోయుత యద్భుతం బొకటి చూచితి జూపెద నీకు నాదుచే
చాయనె చూడు మభ్రమున జక్కగ నల్లదె నల్ల మబ్బులో
పాయవు కొన్ని మ్రాకులు నృపాయవు జుమ్మవి నాక భూజముల్.

3 శ్లో॥ తదను విభు మవాదీత్ తం వయస్యోఽగ్రయాయీ
తపన నివహ తేజా తత్ర దృష్టాద్భుతోహమ్
కనదసిత తర మ్రాన్ పశ్య కాలాభ్రమధ్యే
కర పథ విధయామే కల్ప వృక్షాః కిలేతి.

'నాదుచే చాయనే, అద్భుతం బొకటి చూచితి' ననుటకు 'కర పథ విధయామే దృష్టా ద్భుతోహమ్' అని అచ్ఛంగా పదానువాదము చేయబడినది. 'కల్పవృక్షాః కిలేతి, అనుచోట భావ స్పష్టత లేదు. "తపననివహతేజాః, అనునది రాజ విశేషణము ఇది సంబోధ నాంతముగా నుండవలసినది, 'తపననివహతేజః, అని సంబోధనలో ఉండవలయును. 'నివహ' పదము నిరర్థకము "తరుణ తరణితేజః అనుట యుక్తము. అనువాదము పేలవముగా నున్నది." తరుణ తరణితేజ స్తత్ర చిత్రం విభాతి, కరకలిత దిశామే పశ్య కాలాభ్రమధ్యే కతిచన తరవస్తే కల్పకా నూనమేతే" అని మార్పు చేయుట యుక్తమని తోచుచున్నది. మే కరకలిత దిశా పశ్య=నాచేచాయనె చూడుము, కాలాభ్రమధ్యే కతి చన తే తరవః (సంతి) = అదిగో నల్లని మబ్బుల నడుమ కొన్ని చెట్లు కలవు, నూనమ్ ఏ తే కల్పకాః=ఇవి నిజముగా కల్పవృక్షములే, అని స్వాభావికత అనువాదమున అగుపడును.

4 చ॥ అన విని నవ్వి సూక్ష్మ గతి నారసి యారసికావతంసు, డి
ట్లను మన కేళిశైల మది యల్లదె తన్మఘవాశ్మ కూట మ
మ్మనికి మహీజముల్ చదలు మ్రాకు లటంచు భ్రమించి పల్కెదె
నను మృషగాదు నీ పలుకు నాక నగంబులె తద్ద్రి మావళుల్.

4 శ్లో॥ శ్రుత్వా వదత్త్వమితి సూక్ష్మదృశా న దృష్ట్వా
లీలా చల స్సఖలు, లేఖవరా శ్మ కూటమ్
తత్, తే ద్రుమా గిరిభవా, స్త్వ గీర్భృ మేపి
సత్యం తథైవ తరవో ననుతే యదస్మాత్.

అది మన క్రీడా శైలము. ఇది ఇంద్ర నీల కూటమే కాని నల్లమబ్బు కాదు. ఆ శిఖర మందున్న వృక్షములు నాక వృక్షములని భ్రమించితివి. ఐన నీ మాట మృషగాదు. నిజముగా ఆ వృక్షములు నాక వృక్షములే సుమా యని భావము. అనువాదము. మూలానుగుణముగా నున్నది, కాని చతుర్థ పాదమున భావము సరిగా స్ఫురించుట లేదు 'సత్యం త ఏవ తరవో నను నాక భూజాః" అని మార్చిన గాని అన్వయ క్లేశము తొలగదు.

5 సీ॥ అచటి సానులు రత్న రుచిరంబు లననేల, వాని వంశము లెల్ల నీను
మణులు ద్రుమములెల్ల ను సురాగమము లౌటరుదెన్ని, త్యసురాగములు
తదీయాంకురములు లతలు సంజీవను ల్గావె యచ్చట వాని, తావులు
నతను సంజీవనములు రసములెల్లను సిద్ధ రసము లౌ టెంతత,
త్ప్రిస వంబులును సిద్ధరసములచట.

5 శ్లో॥ తత్రస్థా మణి శోభినో యదపి తద్వంశా మణీకారణం
తద్వృక్షేషు సురాగతా ఖలు తదం కూరా స్సురాగాయతః
సంజీవన్యభిధా లతా హ్యతను సంజీవ ప్రదా స్తద్గుణాః
తస్మిన్ యత్ప్రిసవేషు సిద్ధ రసతా తస్మా ద్రసాః తాదృశాః

అనువాదమున మూల భావ గాంభీర్యమే లేదు. అచటి సానువులు మణి శోభితములు. ఏల ననగా వాని వంశములు మణులకు కారణము అను రీతిగా అనువాదము సాగినది. వాని వంశములే మణుల నీనుచూడగా ఆ వంశములకు ఆధారములైన సానువులు రత్న రుచిరములని వేరే చెప్పవలెనా యని కదా ఉద్దేశ్యము. ఈ ఉద్దేశము అనువాదమున ప్రతి స్ఫురించుట లేదు మార్పు చేయుట యుక్తము.

తత్ప్రస్థేషు మణి ప్రభా కిమత యద్వంశా మణీ నాంజనిః
వర్ణ్యాఽగేషు సురాగతా కిము యదం కూరా స్సురాగా యది
యద్గంధోఽతను జీవనో యది లతా కాస్యాన్న సంజీవనీ
తస్మిన్ వ్యుత్ర సవేషు సిద్ధ రసతా తేషా మహోకాకథా
(తస్మిన్=ఆ పర్వతమందు)

5 గీ॥ నచటి మణి చిత్ర భూములు నచట నమరు, నమర తరువుల గుబురులు
నచటి తీవ లచటి పొందమ్మి కొలకులు నభవునింట, నైన నాదంట
బలువింట నైన గలవె.

5 శ్లో॥ తత్రత్య మణి సంతాన తరువల్లీ సరోవరాః
శరాసేపి నివాసేపి శాంకరే సంతి కింగిరౌ.

ఇది పై సీస గీతమున కను వాదము. అనువాదము మూలము వలె ఉదాత్తముగా నున్నది. సరోవర పదమునకు పులింగమున ప్రసిద్ధి అరుదు.

6 మ॥ అది గాదే మన కేళి భూధరము దవ్వాచూత మాయద్రి సం
పద లంచుం గయి దండ బూని ధరణీ పాలుండు లీలాగిరిం
గదియన్ నర్మ సఖుండు వల్కు నచటం గల్ప ద్రుమహాలారసో
న్మదవై మానిక మాని సీ మధురగాన స్వాన సానందుడై

6 శ్లో॥ క్రీడా చలస్య కిల కేవల సన్ని కృష్టో
లక్ష్యాద్రి సంపదితి లబ్ధ కరావ లంబిమ్
మందార సూన మధు మత్త నిలింపకాంతా
సంగీత (మాధ్వి) భరిత స్సవయా స్తమూచే.

మన క్రీడా చల మదియే కదా దాపుననే యున్నది కావున పోయి చూతమని రాజు నర్మ సచివునికై దండ గొని ఆ పర్వతము చేరబోగా అంతలో ఆ నర్మ సచివుడు కల్ప వృక్షముల మధువు గ్రోలి మత్తు గొని మిక్కిలి ఇంపుగా పాడుచున్న దేవతా స్త్రీల మధుర గానాలాపమును విని ఆనందించుచు

రాజుతో నిట్లనియె నని భావము. భావమెట్లున్నను, అన్వయమే కుదురుటలేదు. అర్థస్ఫూర్తి అతి క్లిష్టముగా, నున్నది. దానికి తోడు సరిగా స్పేసులు లేక పోవుట, ఎంతయో ఇబ్బంది పడినపుడు కాని అన్వయ మిట్లేర్పడదు అద్రి సంపత్ లక్ష్యేతి లబ్ధ కరావలంభం తం క్రీడా చలస్య కేవల సన్నికృష్టః సవయాః మందార ................... భరితః ఊచే అని డొంక తిరుగుడుగా నున్నది. కైదండ బూని రాజు పర్వతమును చేరబోగా అపుడు అతని సఖు డిట్లనెనని మూలము. పర్వత సన్నికృష్టుడై విదూషకుడిట్లు పలికెనని అను వాదము చేయబడినది. అన్వయ క్లేశము తొలగ వలయునన్న మార్పవసర మగును. అట్లే కోష్ఠస్థానమున పూరింపబడిన మాధ్వని మోదయని మార్చుట ఉచితము.

క్రీడాచలోఽయ మతి సన్నిహితోఽస్యసంప
ల్లక్ష్యేతి సాదరకృతాత్మ కరావలంబమ్
మందార సూన మధు మత్త నిలింపకాంతా
సంగీత మోద భరిత స్సవయాస్తమూచే.

7 సీ॥ ఒకచాయ నన పాయ పికగేయ సముదాయ మొక సీమ నానామ
యూర నినద। మొక వంక నకలంక మకరాంక హయహేష, లొకక్రేవ
వనదేవ యువతి గీత। మొకచెంత సురకాంత లకరాంత తతనాద, మొక
దారి నవశారి కోదితంబు। లొక యోర బటు చారణ కుమార ఫణితంబు,
లొకదండ నలిమండలి కలగానము.

7 శ్లో॥ ఏక త్రాన్య భృతారవాలి రితరత్రాంచ ద్వనీదేవతా
సంగీతాని పరత్ర బర్హిణ రుతా జ్యేకత్ర కీరారవాః
అన్య త్రామర భామినీ తతరవా ఏకత్ర శారీస్వనా
స్సాంద్రాః కుత్రచిద దత్ర చారణగిరో యేనాలినాదాః క్వచిత్.

అనువాదము చక్కగా నున్నది. 'శారీస్వనాః, అనుచోట' శారీస్వరాః, 'కీరారవాః, అనుచోట 'కీరోదితమ్. అని మార్చుట యుక్తమని తోచును 'యేనాలి నాదాః క్వచిత్; అనుచోటి యచ్ఛబ్దమునకు ప్రయోజన మగు పడదు అచట 'మత్తాలి నాదాః అని మార్చుట భావ్యము.

7 తే॥ ఒక్క మొగి మ్రోయ గదళీ గృహోపపన్న, కిన్నరీ బృంద, బృంద
సంగీత రీతి నమరు నతివేల కోలాహలముల కలిమి, నధిపయీ యద్రి
కోలాహలాఖ్య మొక్కె.

7 శ్లో॥ కిందరీ కిన్నరీ గీత్యా సుందరీణా మహో యతః
కోలా హలైశ్చ పూర్ణోఽస్మాత్ కోలాహల ఇతీరితః

అవి అన్నియు ఒక్క మొగి మ్రోయ కదళీ నికుంజముల జేరి బృందగానము జేయు కిన్నర స్త్రీల సంగతి నమరు కోలాహలముల కలిమిచే ఈ గిరి కోలాహల నామముజెంది యుండు నేమోయను నర్మ సచివుని ఊహను మూలము వెల్లడించుచున్నది. గుహలలో నుండు కిన్నరీ గీతితో స్త్రీల కోలాహలములతో నిండి యున్నందున ఇది కోలాహలమని పేర్కొన బడినదని అను వాదము. మూలమున లేని సుందరులు (సుందరీ పదము) కిందరీయను ప్రాస పుష్టికి సృష్టింపబడిరి. కాని భావ సృష్టికి కాదు. భావము నుపస్కరించునపుడే అనుప్రాసకు చారితార్థ్య ముండును లేనిచో అది భావమునకు ప్రాసయగును.

8 మ॥ ఘన జాంబూనద రౌప్య రత్న రుచులన్ గన్పట్టు నీగట్టు జు
ట్టిన గండోపల మండలంబు గనుగొంటే మేదినీ శైలశా
సన యుష్మచ్చరణావ ధూత మగునీ శైలంబు నూరార్పగా
నను కంపామతి జేరు మేరు ముఖ గోత్రాధీశులం బోలెడిన్.

8 శ్లో॥ సువర్ణ దుర్వర్ణ మణీ స్వరూపా
గండో పలా భాంత్యభితో గరీంద్రమ్
భవత్పదా ఘాత భయాపనుత్యై
మేర్వాది శైలా మిలితా ఇవైతే.

మిత్రమా! నీ పాదా ఘాతము వలన బాధపడెడి ఈ శైలము నూరడింపనై మేర్వాది గిరులుచుట్టు జేరియున్నట్లు ఈ గట్టుచుట్టు స్వర్ణ రత్న రజతాది మయములైన గండ శిలలు ప్రకాశిస్తున్న వని మూల భావ మనువాదమున ప్రతి

స్ఫురించుచున్నది కాని కొద్దిమార్పు చేయబడినది. నీ పాదా ఘాతపు భయమును తొలగింపనై (భవత్పాదా ఘాత భయాపనుత్తై) మేర్వాదులు చేరినవను అభ్యూహలో చిక్కుకున్నది. అవి వచ్చినవి ఊరడించుటకు కాని భయమును తొలగించుటకు కాదు దెబ్బతిని బాధపడుచున్నాడని యే మూలమున నున్నది. మరియొక పాదా ఘాతమునకు కోలాహలుడు వెరచుచుండ (రెండవ సారి కూడా తన్ను నేమోయని భీతిల్లుచుండ) ఆ వెరపును తొలగింపనై అనగా ఇక రెండవ సారి వసురాజు తన్నడు సుమా నీవు భీతిల్ల పని లేదని చెప్పుటకు అవి గుమిగూడిన వను అనిష్టార్థము స్ఫురించుచున్నది. మూల కర్తకు లేని భయము అనువాదకునకు ఏల కలిగినదో తెలియదు అది బహుశః యతికి భంగము వచ్చునను భయమే కావచ్చును "త్వత్పాద ఘాతార్త మివాను నేతుమ్', అని మార్చుట యుక్తమని తోచును.

9 ఉ॥ అక్కట నీయుద్ర చరణాహతి కోరువ లేక యేగతిన్
ప్రుక్కెనొ గట్టురాచ కొమరుండలనాడు కపోత హుంకృతిన్
గ్రిక్కన మూల్గుచుం బిలముఖంబున నేడును గంటె నెత్తురుత్
గ్రక్కెడు ధాతువుల్ చెదరగా నరుణాంబు ఝరీమిషంబునన్.

9 శ్లో॥ త్వత్పాద ఘాతార్త తరస్తదా, సౌ
కపోత నాదార్త రుతక్రమస్య
ఆశ్చర్య మద్యాప్యతి శీర్ణ ధాతోః
బిలాస్యతో రక్తఝరీ ర్వివాస్య.

నీ తీవ్ర చరణా ఘాతము వలన కోలాహలుడు ఇప్పటికిని పావురాల కూతల మూల్గుచు ధాతు రక్తమగు సెల యేర్ల నెపమున గుహయను నోటి నుండి నెత్తురు గ్రక్కుచున్నాడని భావము. అనువాదమున అన్వయమే కుదురుటలేదు షష్ఠ్యంతములను ప్రథమాంతములుగా మార్చి క్రియా పదము చేర్చిన గాని అన్వయ మేర్పడదు. 'క్రమస్య, ను 'క్రమేణ, యని కాని లేక 'రుదన్ కపోతారుత కైతవేన; యని కాని మార్చిన అన్వయ మేర్పడును అనగా" కపోత నాదార్త రవః క్రమేణ; వమత్యహో ऽ ద్యాప్యవ శీర్ణ ధాతుః బిలాస్యతో

రక్త ఝురీ రివాద్రిః; అని మార్చినచో అన్వయమునకు క్లేశము కాని, భావ స్ఫూర్తికి భంగము కాని ఏర్పడదు.

10 మ॥ నను నువ్వెత్తుగ బాలమేటితివి నానా ధైర్య సామగ్రి మ
జ్జనకున్ మున్నె తృణీకరించితి కృపాస్వాంతంబునం బ్రోవు మిం
క నరేంద్రా యని గట్టువేడెడి నినుం గంటే తృణ గ్రాహి నూ
తన నీలాశ్మ దరీ ముఖాగ్ర విచల ద్వాతూల మంద్ర ధ్వనిన్

7. శ్లో॥ క్షిప్తోస్మి తాతః క్షితినాథ ధైర్యాత్
పరాకృతో, మా మధ పాలయేతి
మహా తృణగ్రాహి మణీ గుహాస్య
వాతారవై ర్వాంఛతి వత్సలోఽసౌ.

రాజా నన్ను మును పే అవలీల జిమ్మివైచితివి. నా తండ్రిని ధైర్యముచే సరకు జేయవైతివి. వేరేగతి లేదు నీవే దిక్కని గుహాయను నోటియందు నీలమణులు కరచిన గడ్డి పరకలను వేసికొని ఆ గుహా ముఖమున వెలువడు వాయు ధ్వనియను హీన స్వరముతో వేడుకొనునట్లున్నదని భావము. అనువాదము చక్కగా నున్నది. కాని 'వత్సలోఽసౌ, అనునది కుదురదు. వాత్సల్యము జూపుమని వేడు వాడు కోలాహలుడై నపుడు వత్సలుడు వసు రాజగును కాని కోలాహలుడు కాడు కదా. మరియు 'వాంఛతి, కి కర్మయేది? వాత్సల్యము లేక దయ అగును పాలయేతి అన్నపుడే పాలన రూప కర్మ అభివ్యక్తమగునని అను కొన్నను ప్రథమాంత వత్సల పదము సమన్వయింపదు. అట్లులేని వత్సల అని రాజ సంబోధనగా మార్చవచ్చు. దాని వలన కలిగెడి ప్రయోజన మేమి లేదు "ఔచిత్యా దర్ధ నిర్ణయః అని న్యాయమురీతి వత్సలత్వమ్ అని కాని, లేక సత్కృపాంతే అని కాని మార్చుట యుక్తము. సత్కృపాంతే అని మార్చినచో కవికి పరమ ప్రీతి పాత్రయైన యతికి భంగము కల్గుతుంది.

12 చ॥ కొలకుల పజ్జ సజ్జకపు గొజ్జగె పూబొదరిండ్ల జోరునం
జిలుకు హిమాంబు పూరములు శీత కరోపల పట్టికాతటం
బుల దుముకంబుటం బెగయు భూరి తుషారకణంబు లెల్లెడన్
వలగొన నిన్నగంబు హిమ వన్నగమన్ దనరారు భూవరా.

12 శ్లో॥ సర్వం సహేశ సరసీ సవిధాభిరామ
సేవంతికా సురభి కుంజ సరత్తు షార్త్రైః
చంద్రో పలేషు పతితై స్సహ సోత్సతద్భి
స్సాంద్రో హిమాద్రిరితి సర్వత ఈర్యతే సౌ.

గొజ్జగ పూపొదరిండ్ల నుండి మంచునీళ్ల ధారలు ధారలుగా బోరున గురిసి ఆ కొండ యొక్క చంద్రికాంతపు దరులపైబడి తుంపురు తుంపురులుగా పైకెగయగా అవి సన్నని మంచు చినుకులవలె తోచుచున్నదను భావము చక్కగా అనువాదమున పొందుపరచబడినది. తంద్రిదగు హిమవంతుని కోలాహలుడు బోలియున్నాడని తాత్పర్యము. హిమాద్రి రితి ఈర్యతేఽసౌ అనుమాట సరసముగాలేదు. సాంద్రో హిమాద్రి రివభాతి శిలోచ్చయోఽయమ్. అని మార్చినచో బాగుంటుంది. సాంద్రి పదము వలననే అన్నివైపుల మంచు విరజిమ్మట వ్యక్తమగును, కావున సర్వతః అనునది లేకున్నను తదర్థ స్ఫూర్తికి హానిలేదు.

13 మ॥ అనికేళీ సచివుండు దెల్ప నిజ లీలాహార్య మాసింహసం
హననుం డెక్కి తదీయ నిర్ఝర సమీరాందోళి తైలాసుగం
ధి నికుంజాంతనవేందుకాంత మణివేదిం ద్రోదియై విశ్రమిం
చిన నం దొక్క కలస్వనంబు వినవచ్చెన్ మాధురీధుర్యమై

13 శ్లో॥ ఇతీ (రిత) ప్తేన హితేన ధీమా
నారుహ్య లీలా చల మాప్తయుక్తః
ఏలానికుంజోల్ల సదిందుకాంత
వేద్యాం స్థితో గాన విలోల కర్ణః

నర్మ సచివుడట్లు పల్కుచుండరాజు అతనితో గూడ క్రీడా చలము నధిష్ఠించి ఏలా నికుంజము నందలి చంద్రికాంత వేదికపై కూర్చున్నవాడై గానమందు తగులు కొనిన చెవులు గలవాడైయని అనువాదములోని భావము నర్మ సచివుడట్లు (కోలాహల మహిమ) తెల్పుచుండ ఆ సింహ సంహననుడు ఆ పర్వతము యొక్క సెలయేటి గాలిచే కదలుచున్న ఏలకి తీగలు

పెను గొన్న సువాసితమగు ఒక పొదరింటికడ చంద్ర కాంత శిలా వేదికపై సుఖముగా విశ్రమించుచుండ వింతలో మాధురీ ధురీణమగు ఒక్క కల స్వనము వినవచ్చెనన్న మూల భావము. అనువాదమున స్పష్టముగా లేదు. 'ఒక్క కల స్వనంబు విన వచ్చెన్ మాధురీ ధుర్యమై యనునది 'గాన విలోల కర్ణః, అన్న మాటలలో ప్రతీతము కాదు.

14 క॥ వీనుల విందై యమృతపు, సోనలపొందై యమంద సుమ చల దళిసీ
గానము క్రిందై యారవ, మానందబ్రహ్మ మయిన నధిపతి వల్కెన్.

14 శ్లో॥ సుఖ శ్రవే సాంద్ర సుధానరూపే, సుమాలి లీలా సుదతీ రుతార్యే,
సుజాత నాదే సులభాతిమోదే, సురేంద్ర బంధు స్పృహ్యాదం బభాషే.

సుజాత నాదము సులభాతి మోదము ఇత్యాదులలో అనుప్రాస బలము తప్ప భావ బలము లేదు. శ్రేష్ఠమను అర్థమున నపుంసక లింగములకు సైతము ఆర్య పదము ఇతడెక్కువ ఉపయోగించుచుండును. "సుమాలి లీలా సుదతీ రుతార్యే"=పువ్వు లందలి మగ తుమ్మెదల యొక్క విలాస వతులగు ఆడ తుమ్మెదల యొక్క ధ్వని వలె శ్రేష్ఠమైనదని దీని అర్థము. ఇది అమంద సుమ చల దళిసీ గానముక్రిందై, అనుమూల పదమున కనువాదము. ఆనంద బ్రహ్మమయిన ననునది అనువాదమున లేదు, సులభాతి మోదము మాత్రము న్నది, సుధా సరూపే, కోసం 'సుఖశ్రవే వచ్చినది.

15 శా॥ నాదం బొక్కటి పిక్కటిల్లె దిశలన్ నవ్యామృతా వ్యాహతా
స్వాదం బై వినన య్యెడిం బ్రియవయస్యా వింటివే షట్పదీ
నాదంబో కలకంఠ వాదమొ మరున్నారీ మణీ వల్లకీ
నాదంబో వివరింపరాదు వరమా నందాను సంధానమై.

15 శ్లో॥ నాదో మహా నజని నర్మసఖ శ్రుతః కిం
భృంగీ రవోను పికబీరు శుకీరవోను
వీణా రవోను మధురో విబుధాంగనానా
మానంద బృంద వివశ స్తమహం న జానే.

మిత్రమా! ఏదో ఒక నాదము మిక్కుటముగా నానందము గూర్చుచు దిక్కులందు నిండు కొన్నది. అమృతము వలె అతి భోగ్యముగా వినబడుచున్నది వింటివా, అది భ్రమరీశ్రుతమా, లేక కోకిల నాదమా లేక శివాంగనా విపంచీ మధుర నాదమా, వివరింప రాకున్నది అని భావము. అనువాదమున ఈ భావము ప్రతిబింబించినను "సవ్యామృతా వ్యాహృతా స్వాదంబై" యనునది విశ్లేషింప బడలేదు. మూలమున లేని శుకీరవము మాత్రమున్నది. 'పిక భీరు, పదమునకు పికమునకు వెరచునట్టిదను అర్థము త్వరగా స్ఫురించును కాని పికస్త్రీ యను అర్థము త్వరగా స్ఫురింపదు. అనువాదకుడు పికాంగ నార్థముననే పిక భీరు పదము పయోగించెను. స్త్రీ వాచకమైనపుడు 'భీరూ' అనియే ఉండును కాని' భీరు, యని ఉండదు, ఇతరిక లింగముపై వర్తింపులేదు. పుంలింగ పాణిని, పాణీయని ముద్దుగా ఉపయోగించు కొనును స్త్రీ లింగ 'వల్లీ' ని 'వల్లి' యని వ్యాహరించును. పిక భీరు శుకీరవోను, అన్నచోట 'పర భృన్మధుర స్వరోను' అని సంస్కరించుట యుక్తము.

17 చ॥ అన విని కేళికా సచివు డాస్వన మల్లన యాలకించి తా
జనవర వల్లకీరవము సంగతి జాడెద రెవ్వరో వినూ
తనగతి నిమ్మహాద్రిపయి దన్మృదు పంచమ షడ్జ ళయ్యకొ
య్యన నెలుగించె వించె ప్రమదాకుల కోకిల కేకిలోకముల్.

17 శ్లో॥ ఇత్యూచుషి క్షితిపతౌ తం హిత ఇత్యవాదీత్
కస్యాశ్చిదత్ర కలవేణురవోఽరుణోదయ
అశ్రావి కిం (మన) సపంచమ షడ్జరీతేః
కూజత్యలం కుతికి కోకిల కేకి లోకః.

వసు రాజన్న మాటవిని నర్మ సచివుడు ఆధ్వనిని సూటిగా నాలించి విని రాజా ఎవ్వరో వీణ వాయించుచు మిక్కిలి వింత రీతిని పాడుచున్నారు, ఆ గీత మండలి పంచమ షడ్జ స్వరముల మేళనమున కోయిలలు నెమళ్లను మారు కూయుచున్నవని పలికెనని మూలము. అనువాదమున మూల భావము పొందు పరచబడినది. కాని మూలమునందున్న వీణారవము అనువాదమున వేణురవముగా

మారినది. ఆలించి విని నందున మూలము నందలి నర్మ సచివుడు వీణారవమును వీణారవముగా గమనించ జాలెను. ఆలించి విన నందుననే అనువాదమున నర్మ సచివునకు ఆధ్వని వేణు రవముగా స్ఫురించి ఉండును.

18 క॥ అనపుడు శశికాంత దరీ, జనిత ప్రతి నాద మయిన సంగీతకల
స్వనము మనమున నొకానొక, యనురాగ భరంబు బెనుప నవనిపు
డ నియెన్.

18 శ్లో॥ చంద్రకాంత దరీ గుంభ న్మంద్ర కాంత ప్రతీ రణే
గీతనాదే కృతామోదే జాత రాగో జగాద సః
మూలముకన్న అనువాదము శబ్దార్థ సుందరముగా నున్నది-

19 ఉ॥ ఎచ్చటి వారొ యాదరుల నీబలు గోనల నీనగాళిలో
నెచ్చట నున్నవారొ మదికింపులు నింపు కలస్వనంబుతో
నిచ్చట బాడుచుండ గత మెయ్యది యో వివరించి క్రమ్మఱన్
వచ్చెదవే తదాయతన వాటికి బోవుద మీక్షణంబునన్.

19 శ్లో॥ ఏతద్దరీషు చిరమిద్ధ్రుగ గావలీషు
కావా కుతో లలిత గీతి పరా ఇహేతి
సమ్య గ్వి చార్య సఖివర్య సమా గతశ్చేత్
యాస్యావ ఏవ సహసాఽఽయతనం తదీయమ్

అనువాదము పరమ రమణీయముగా నున్నది. "ఈ బలుగోనల" లేకు వ్నను భావస్ఫురణకు హాని చేకూరదు.

20 చ॥ అని యనుపన్ వినోదసఖు డచ్చటి పూబొదరిండ్లు చూచి కాం
చన మణి కందరా సదన సంతతు లారసి పక్వగోస్తనీ
ఘన తర కాయ మానములు గన్గొని తిన్నని కన్నె మావి గుం
పున బెన గొన్న మల్లియలు పూచిన కోనలు గాంచి యొక్కచోన్.

20 శ్లో॥ ఇతి నృపతి నియోగాదిష్ట బంధు ర్నికుంజాన్
కనక మణి గృహాఢ్యాన్ కందరాన్ రత్నసానూన్
గురు కుతుక మపశ్యత్ గోస్తనీ కాయమానా
న్యపి బిలతల మల్లీ వేల్లితాన్ చూతపోతాన్

అనువాదము మూలానుగుణముగా నున్నది. 'గురు కురుకమ్' అనునది క్రియావిశేషణము. 'కనకమణి గృహాఢ్యాన్' అను పూర్వ మూలానుగుణంగా ఉంటుంది. కనక మణి గృహాఢ్యాన్ కనక మణి గృహాలతో సంపన్నములైన గుహలను అర్థ మూలానుగుణం కాదు.

21. సీ॥ రేలెల్ల నమృత మరీచి నంటున నంట, గరగి నిర్మల పయోఝరుల
దొరగి। బలువిడి పెనులోయబడిన క్రొవ్వెన్నెల జాల, చఱులలో
నిరుగడ దఱచు మెఱచు। పటికంపు బఱకుల పజ్జగొజ్జగెనీటి,
యేటిక్రేవల జలి యిసుకవెట్టు। నేడాకుటనట్టుల నెలమావి
గుమురుల, సురపొన్న కూటాల జొట్టుకొన్నిన

తే॥ బండిగురువెంద తీగ చప్పరము లెనసి, మొడి గొనీవ దాక్షి పందిళ్ల
నడుమ గిన్న। తీవి నాదాళుకారి శారీకుకాది, ఘోషఘుమఘుమితంబైన
కోన గనియె। (తదను నవయా వనసీమని)

21. శ్లో॥ చంద్రాశు సంగతి గళ ఝ్ఝర చంద్రకాంత
సానుస్థలే స్ఫటిక సంయుత పార్శ్వదేశే
సేవంతికా తుహిన సింధు తటే సితాద్రి
రంభాపరాగిణి రసాలన మేరుసాంద్రే

21. శ్లో॥ మృత్యే ద్రాక్షా కాయమానం
మాధవీ మంటపేంచితే
తత్రాపశ్య ద్రమ్యదేశం
శుక శారీర వాకులమ్

రాత్రులందు చంద్ర కిరణ స్పర్శచే చంద్రకాంత శిలలు తుదముట్ట కరగి అచ్ఛమైన నీటి వెల్లువలై ఆ పర్వతపు లోయ యందుబడి అచట మరల శిలలుగా మారెను. ఆ చంద్రకాంత శిలల చేతనే అందు చరియ లేర్పడెను ఆ చరియలలో ఇరు ప్రక్కల తళతళ మెరయు స్ఫటికపు శిలలు పేటులెత్తెను ఆ పేటుల యోరుగా గొజ్జంగ పువ్వుల నుండి స్రవించెడి నీరు ఒక యేరై పారు చుండెను. ఆ యేటి రెండు ప్రక్కల కర్పూరపు టరటులు గున్నమామిడి తోపులు సుర పొన్నచెట్లు మొలిచి యుండెను. ఆ చెట్లను బండి గురివెంద తీగలు పెనగొని చవికలుగా దీరి యుండెను. ఆ చవికెలతో ద్రాక్ష తీగలు అల్లుకొని పందిళ్లుగా నేర్పడెను. ఆ ద్రాక్ష పందిళ్ళనడుమ కిన్నరీ వాద్య ధ్వనితో తులదూగు శారికా శుకాదుల ఝుంఝుమ ధ్వనులతో నిండియున్న ఒక కోనను నర్మ సచివుడు చూచెనని భావము. ఇంతటి విశాల భావము అనువాదమున స్ఫురింపకున్నను తాత్పర్యము సంగ్రహింపబడినది.

22 ఒరగయు వ్రాలిన మేరువుల పుప్పొడుల, సొరువుల వెంట సహకార మిలదేలా ధారముల జాఱుహిమ వారి కృత సారణుల, బైరయిన చెంగలువ యూరి కలలోగా శ్మీరకృత సేతువుల దారిజనుచోనచట, గూరు కలహంస లగదై రొదలు సేయం గొరములు సారె బెలువార లిట చేరిదని. చారణుల జీర వసువీర సఖుఁడంతన్.

22 రాశేర్న మేరు రజసాం రుచిరే రసాల
గైలావ లంబిని హిమాంబుజ హల్లకానామ్
కాశ్మీర సేతు జుషి హంస కఠోర నాదాత్
కీరైః పరాగతి రసూచి హి కిన్నరా దేః.

సురపొన్న పుపొళ్లు రాలి సేతువులుగా నేర్పడెను. ఆ సేతువుల వెంట తియ్య మామిళ్ళతో పెనగొన్న ఏలకి తీగల పొదల నుండి చిన్న కాలువలుగా బారుచున్న మంచు నీటి జలపలన చెంగల్వలు చాల్పులుగా పైరై ఉండెను. అందు కుంకుమ పువ్వులు కట్టలు కట్టలు బడియుండెను. ఆ దారిన బోవునపుడు అచట నిద్రించుచుండిన కలహంసలు బెదిరి కూయుడ జొచ్చెను. అపుడు చిలక

లెవరో వచ్చినారని చారణులను పిలుచుచుండెను. అట్టి దారిన నర్మసచివుడు వెళ్లెనని భావము. అనువాదమున ఈ భావము ఇంచుక విలంబమున స్ఫురించును. షష్ఠ్యంత రాశి పదము వలన అన్వయ క్లేశమేర్పడు చున్నది. కావున దానినిసప్త మ్యంతముగా మార్చుట భావ్యము. అంచల కఠోర నాదము వలన చిలుకలు పరాగతిని సూచించెనసుట యుక్తముగా లేదు. విదూషకుని పద ధ్వని వలన మేల్కొని అంచలు రొద చేయగా దానిని బట్టి చిలుకలు చారణులకు పరుల రాకను సూచించెనని మూలము. పేర్కొనుచున్నది. 'హంస కఠోర నాదాత్, అనుచో పై భావము స్ఫురింపదు కదా, కావున 'పాదహతేః ప్రిబుద్ధైః, అని మార్చిన యెడల విదూషకుని పాద ధ్వనికి చిలుకలు మేల్కొని ఎవడో పరుడు వచ్చుచున్నాడని చారణులకు తెల్పుచుండెనను. భావము కనీసమైన స్ఫురించును ప్రబుద్ధ హింస నాదము లేకున్నను ఉద్దిష్ట భావమునకు భంగము కలుగదు. అను వాదకు డేర్పరచుకొనిన యతికి భంగము కలిగినను, నష్టము లేదు అట్టులే కిన్న రాది పదము" కీరైః అనుచోటికి, కొరకు వచ్చినది. లేకున్నచో 'చారణానా, మనెడివాడే.

23 సీ॥ పగడాల కొణిగల నిగనిగల్ వ్రజంపు, జగతి క్రేవల నెఱజాజు
నించ నీలజాలక జాల జాలోకము లఖండ, కాలాగరుజధూపకాంతిఁ
బెనుప ముత్యాల నవరంగముల రంగు నవరంగ, వల్లీ విభూతి
ముంగిళ్ళనునుప గారుత్మ తద్వార చారు ప్రభాపూర, తోరణంబుల
హరిత్తులు పొసంగ.

తే॥ భర్మ పాంచాలి కాపాణి పద్మరాగ, రాజ నీరాజనోప చారముగ వఱల,
దరళ వైదూర్య వలభికల్ తెరలునెరప, నిరుపమంబైన దివ్య
మందిరముగనియె.

23 వ॥ (తదను) పసుపీర సఖో విద్రుమ వితాన విరచిత గోపాన సీ విభాను
బింబ రంజిత వజ్రవేదికా విశేష భూషితం, నీలమణి జాల జాల
కాలోక కమనీయ కాలాగురు ధూపకాంతి కందళం, ముక్తా ఫల
నవరంగ లలిత కిరణ కలిత రంగవల్లీ మోహ నాంగణం, గరుడ

> మణిమయ ద్వార దేశదారు రమణీయ ఘృణీపూర తోరణ రాజ రాజితా శాఖరం, కాంచన పాంచాలికా కరతల కంజరాగ భాజన రాజ నీరాజ నోపచార రాజమానం, వైడూర్య వలభి శోభాయవనికా భాసమానమ్. అదాృక్షీ, దతిమందరం గతి (సుంద)రం కన దిందిరం మణి మందిర .

నర్మ సచివుడచట ఒక దివ్య మందిరమును జూచెను. అందు పగడాల ముంజార్ల కాంతులు వజ్రమణి మయములైన అరుగులందు ప్రతిఫలించి వానికి ఎఱ్ఱజాజు పట్టెలు పెట్టినట్లు వన్నె గూర్చు చుండెను. పగడాల ముంజార్ల కాంతి ప్రతి బింబముచే భాసిల్లెడి వజ్రవేదికా విశేషములతో విరాజిల్లినదని పేర్కొనినంత మాత్రమున ఆ చమత్కారమురాదు.

కిటికీలలో నీలమణులు పొదగబడి యున్నందును వాని నుండి వెలువడు నల్లని కాంతులు కాలాగురు ధూప ధూమముల కాంతుల నెరపుచున్నవి. ఈ భావమును వెల్లడింప అనువాదమున రూపణ చేయబడినది. రూపణకన్న శంకాభ్రాంతుల నాశ్రయించిన బాగుండును. "కాలాగురు ధూప ధూమ శంకావహ నీల మణిజాల జాలకా లోక కందల కమనీయమ్." అని అన్నచో తతోధిక చమత్కార మేర్పడును. నవరంగములను చవికలు ముత్యాలచే కూర్చబడినవి, కావున ఆ చవికల కాంతులు ముంగిళ్లయందు ప్రసరించి ముత్యాల ముగ్గులు పెట్టినట్లు స్ఫురించుచుండెను. ముక్తాఫల నవరంగ లలిత కిరణ కలితములైనవి కావుననే రంగవల్లీ మోహమును (భ్రాంతిని) కలిగించు అంగణములు కలదని సముచితముగా ననువదింపబడినది. మూలమున 'గారుత్మ తద్వార' యనుచోట రూపణ చేయబడినట్లే 'గరుడ మణిమయ ద్వార' యని అనువాదమున రూపణ చేయబడినది. ఇచట కూడ రూపణకన్న భ్రాంతిని పేర్కొనినచో మూలమునకు వన్నె పెట్టినట్లు అనువాద ముండెడిది, బంగారు బొమ్మల చేత నున్న కెంపుల కాంతి నీరాజనోపచారము సల్పుచున్నట్లు, వైడూర్య మణులు దాపిన వలభుల కాంతులు తెరలు గట్టినట్లుండెను. ఈ రెండు తావులందును రూపణమే చేయబడినది. ఇచట కూడా ఉత్ప్రేక్షా భ్రాంతి వాచకపదములను గూర్చినచో మరింత స్ఫురింపముగా అనువాద ముండెడది. "అతి మంద రంగతి సుందరం కనడిందిరమ్"

అనునవివేకవల మను ప్రాసకు వచ్చిన ఊత పదములు. వీనిలో భావస్పందన కాని చమత్కారము కాని లేదు,

24 క॥ కనుగొని మణిమందిరమున, మునుకొని కల ధౌతభిత్తి ముకురతల
బహిర్జనితాను బింబనమ్ములు, వనితారత్నములు మెలగువల
నెటింగింపన్.

24 శ్లో॥ మణిగేహం రూప్యభిత్తిమహా దర్శ బహిర్భృత్తైః
ప్రతిబింబైః పురైవాసీత్ ప్రమదా స్థితి సూచకమ్.

నిర్మలములగు బంగారు గోడ లద్దమువలె నుండుటచే లోనున్న స్త్రీల రూపములు వానియందు ప్రతిబింబించి వెలుపల దోచుచుండుట వలన తద్ స్త్రీలున్న ప్రదేశమని నర్మసచివుడు భావించెను. కలధౌతభిత్తి, యనుమూలము నకు "రూప్యభిత్తి" యని అనువాదము చేయబడినది, "కలధౌత" పదమునకు బంగారు, వెండియని అర్ధములున్నవి, అద్దములుగా పోల్చుట బంగారు గోడ లకు సంభవింప దనుకొని యేమొ, వెండి గోడలని అనువాదకుడు గ్రహించి యుండును. భిత్తికలందు తాపబడిన నిలువు టద్దములందు స్త్రీల రూపములు ప్రతి బింబించి యుండునని భావించినచో చక్కగ నుండును అద్దములందు వలె స్వర్ణ భిత్తికల యందు ప్రతి బింబము లేర్పడినట్లు వర్ణించుట పలువురు కవు లొనరించిరి. కావున రూప్య భిత్తి యనుట యుక్తము.

25 చ॥ తరువుల పొంత బొంచి వసుధా వర మిత్రుడు గాంచె నచ్చటం
దరుణి దయా విశాలకచ దామరి సోదర సోదర ప్రభా
దరళ విలోచనం దతనితంబ దటిన్నిభ గాత్రి వల్లరిం
దరుణ శశాంక ఫాల నొకదన్వి దరంగ వళిం దలోదరిన్.

25 శ్లో॥ తారానాథముఖీం తమోఘన కచాం తాలస్తనీం పద్మభాం
తామ్రోష్ఠీం తరళేక్షణాం తత గురు శ్రోణీం తటిద్భాసురామ్
తన్వీం మధ్య తనుం తరంగ వలికాం తద్వ్యస్త రేఖా లికాం
తత్రైకాం తరుణీం దదర్శ స తదా తాదృక్త రుచ్ఛాదితః.

అనువాదము చాలా పేలవముగా నున్నది. 'తాలస్తనములు, తామ్రోష్ఠము అంతర్వ్యాప్త రేఖాలిక, అనునవి మూలమున లేవు. తరువుల పొంత బొంచి యను పద్యమున రామరాజ భూషణుని ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు అహమహమికతో పరుగులు పెట్టినవి. ఒక తన్వియనునది, విశేష్యముగా గాని ఏక పదముగా గాని తాత్పర్య గ్రాహకముగా గాని గ్రహించినచో దానికి మిగిలినవి తొమ్మిది విశేషణములగును. ప్రతి విశేషణమునకు మొదట తకారము కూర్చబడినది. తకారము సృష్టి వాచకమే కాదు రత్న వాచకము కూడ. దీనివలన ఆ యువతి నవరత్న మాలికగా నున్నదని, ఆ యువతి ఒక్క బ్రహ్మ సృష్టి కాదు నవ బ్రహ్మల సముదాయ సృష్టి సుమా యని పరమార్థము వెల్లడి చేయబడినది. తకారము దంత్యమగుటచే ఉపభోగార్హత గోచరించు చున్నది. ఇట్టి పరమార్థము స్ఫురింప జేయుటకు తొమ్మిది విశేషణములలో తొమ్మిది 'త' కారములు నిక్షేపము చేయబడినవి. మరియు తరువుల పొంత బొంచి చూచుటకు తగినట్లు పద విన్యాసము కావింపబడినది. మూలమున తకారములున్న వికదాయని శ్లోకమంత తకారములతో పొంగునట్లు నక్కతోక లాగా అనువాదకుడు కూర్చినాడు.

27 సీ॥ తనకప్పు నెఱిగొప్పుననె పూని గౌరీస, మాఖ్యమించ జనించినట్టి
యార్య। తన చాపలము చూపులనె చూపి సిరువెల్ల, కద జల్లి
వచ్చినకమల పాణి। తన పాండిమము నవ్వు లనెయుంచి గాంధర్వ,
మవనిక దెచ్చిన హంసయాన। తన యదృశ్య నడుమనె తాల్చి
సాంగమై, మొనసిన యతను సమ్మోహ విద్య.

తే॥ గావలయు నీవెలది దీని కాంతి గుణకళాభి రూప్యంబు లెఱిగించి
యామహేశు నాన గోద్ధారకుని నా ప్రజాధినాధు, నా జగన్మోహనుని
దెత్తు ననుచు జనియె.

27 శ్లో॥ ఆర్యాஉసౌ కబరార్పితాత్మ సుషమా గౌరీ సమార్వోృదయా
వీక్షారోపిత లోలకాஉంబుజ కరా శ్రీ పూరణాయాగతా
హాస స్థాపిత పాండుతా క్షితిమితా గానాయహం సక్రమా
మధ్య భ్రాజ దదృశ్యతా ధ్రువతను స్స్మోహవిదాஉతనోః

27 సీ॥ తద్భాగుణ కలారూప జ్ఞాపనా దాన యామ్యహమ్
తం మహేశం నగోద్ధారం ప్రజేశం లోకమోహనమ్.

ఈ యువతి తన శరీరము యొక్క నలుపును కొప్పు నందే ఇమిడించు కొని గౌరియై (పార్వతి, గౌర వర్ణము కలదని అర్థద్వయము) పుట్టిన ఆర్య (పార్వతి కులీనురాలని అర్థద్వయము) కాబోలు. తన చాంచల్యమును చూపులయందే నెరపి అన్ని యెడల సంపదలను వెదజల్లు వచ్చిన కమలపాణి (లక్ష్మి, కమలములవంటి హస్తములు కలదనియు అర్థద్వయము) కాబోలు తన తెల్లదనమును నవ్వులందే నిలిపి గాన విద్యను ప్రసరింపజేయనై భూమి యందవతరించిన హంసయాన (సరస్వతి, అంచనడలు గలదనియు అర్థద్వయము) కాబోలు. తన అదృశ్యతను మధ్యమందే (నడుముయందు) నిల్పి ఆకారము దాల్చి వచ్చిన మన్మథుని సమ్మోహ విద్యకాబోలు. కావున ఈ యువతి కాంతి నిశ్చలతా కళా భిరూప్యములను తెల్పి ఆ మహేశుని ఆనగోద్ధారకుని ఆ ప్రజా నాథుని, ఆ జగన్మోహనుని తీసికొని వత్తునని తలంచి వెళ్లెనని భావము. అనువాదము మూలాను గుణముగా నున్నను. "గానాయ హం సక్రమా, ధ్రువతనుః, అనునవి ఝటితి భావ స్ఫూర్తికి కించిత్ప్రతి బంధకములుగా నున్నవి జ్ఞాపనాత్, అనుచోట రూపాణ్యభిధాయా నయామ్యహమ్, అనుట యుక్తము. అను భూతార్థమునకే జ్ఞాప కత్వము సంభవించునుకదా!,

28 చ॥ చని విభుగాంచి పల్కు బలశాసన సన్నిభ సీదుపంపునం
బనివిని తీవ గుంపనక పాండుర సైకత నిర్మ్రితటం
బనక దరీపుటం బనక యన్నియు నారసి యొక్కచో వినూ
తన లవలీల తావళుల తావుల తావల మయిన తావునన్.

గ॥ ఇతి కృతమతి రంతిక మితోహితః క్షితిపతి మవాదీత్.

28 వ॥ స్ఫుతాత్రిమ తుల్య తవ సూక్తి భరైర్వి చార్య
చిత్రా ఝరీ తట దరీ పుట కుంజవాటీః
తత్రాపి కుత్రచన తాదృశ దివ్యగంధ
మిత్రాభి జాత లవలీ మితితే ప్రదేశే.

సూక్తిభరైః విచార్య పదము లుద్దిష్టార్థ ప్రతీతిని కలిగింపవు. 'విచార్య' పదము వెదకియను తర్థము నొసగదు కావున 'భవదుక్తి వశాత్ పరీక్ష్య, యని మార్చుట యుక్తము. "తాదృశ దివ్య గంధ మిత్రాభి జాత, తను చోటి మిత్ర పదము భావ స్ఫూర్తికి శత్రువుగానున్నది. అవి అన్నియు పరికించి చూచి ఒక చో క్రొత్తగా చిగిర్చిన ఏలకి తీగెల వాసనలకు తావల మైన ప్రదేశమని మూలము. తట్టి దివ్య గంధములకు మిత్రమై చక్కగా నున్న ఏలకి లతలతో నమరియున్న పర్దేశమని అనువాదకుని ఉద్దేశము. ప్రాస కొరకు వచ్చిన మితర్ పదము ఆ ఉద్దేశమును స్ఫుటముగా వెల్లడించలేదు. కావున —"పాత్రాభి జాత లవలీల లితే పర్దేశే, అని మార్చినచో కొంత మెరుగుగా నుండును.

29 శా॥ సాలీ కాకర తీర సారకదళీ నారంగీ పూగావళీ
పాళీ వాసిత మయినకోన, గని యా దిక్కోనలో గానలో
లాళీ ప్రేరకి రత్న కోరకమయీ ఖాళీ సమాలీఢ మా
కేళీ ధామము గంటి భూ రమణ యా కేళీ నివాసంబునన్.

29 శ్లో॥ కాసార తీర కదళీ వరపూగాపాలీ
నారంగ సంగ నవగంధ దరీధ రాంతః
లీలాగృహం కన కలీఢ మద్రైక్షి గాన
లోలాలి రోధి మణిలోక మ యూఖ సాంద్రమ్.

అనువాదమునందు ప్రథమ ద్వితీయ చతుర్థ పాదములలో పద సౌంద ర్యము భాసించుచున్నది, కాని, లీఢ మద్రైక్షి అనునది ఆ సౌందర్యమును దహిం చివేయునట్లున్నది. ఆ కోనలో అను మూలమునకు 'దరీధరాంతః' అని అను వాదము, దరీధరాంతః=పర్వతము లోపలయని అర్థము స్ఫురించును గాని; దరీ ప్రదేశము లోపలయను అర్థము వెంటనే భాసింపదు. 'కనక క్రమ మదర్శి' అని మార్చిన చో 'లీఢమద్రైక్షి" యందలి పారుష్యము తొలగును "గాన లోలాలి రోధి మణిలోక" అనుచోట మూలభావము స్ఫురించుట లేదు. "గాన లోలాలి లగ్న మణి కోరక కాంతి కమ్రమ్" అన్నచో మూలభావము చక్కగా ప్రతి బింబించును.

30 సీ॥ వలుద గుబ్బలు ప్రసేవక వృత్తిఁ దగుగుబ్బ, కాయల కపరంజి
చాయ లొసగ। లలితాంగుళీ దళంబులు సమేళములైన, సారెలపై
రాగ సంపదలిడ। బాణి కంకణరుతుల్ ప్రాణాను బంధంబు, గల
తాళగతి కనుగ్రిహములీన। నాలాప భంగి యత్యక్త సంవాదిసమ
స్వ రంబులకు గ్రామంబులను ప

తే॥ బ్రిచుర తానామృతముల మూర్ఛనలచేన, చేత నంబులు చేతన
రీతి దనర జేతనంబు లచేతన భాతి నొనర, వీణ వాయించు నొక
యలివేణి గంటి.

30 గ॥ తదను, తాదృశ కేళీ మణి మందిరే ప్రిసేవ క వృత్తి సముచిత
మహిత కోలంబ కానాం కనత్క మనీయ కనక కాంతి దాన కుశల
కలశస్తనీం, మేలన రాజమాన చిత్రిత దారు ఫల కానాం రాగ
సంపన్నియో జననిపుణ రమ్యాంగుళీ దలాం, ప్రాణాను బంధ
బంధుర తాల గతీనామ్ అనుగ్రహ సమర్పక పాణి కంకణ
రుతామ్, అత్యక్త సంవాద సమ స్వరాణాం గ్రామ ప్రదాన చాతు
రాలాప భంగీం, ప్రచురతా నామృత మూర్ఛనాభి రచే తనాని
సచేతనాని సచేతానాన్య చేతనానిచ సమా కలయంతీం ముదా తదా
స్ఫాలిత తంత్రీ భరాం విద్రావిత ఖేద ముద్రామ్ అద్రాక్ష మేకాం
వీణాధరాం శోణాధరామ్.

ఆమె వట్రువ గుబ్బలు తమను హత్తికొనియున్న వీణ యొక్క గరివె కాయలకు బంగారు చాయ కలిగించుచుండెను. చిగుళ్ల వంటి మెత్తని వ్రేళ్లు సరికట్ల మీద మెలగుచు తమ కాంతిచే వాని నెర్రిగా జేయుచుండెను, చేతి కడియముల ఝుణ ఝుణాత్కారములు తానగతికి సమముగా శ్రుతినిచ్చుచుండెను రాగము లా లాపించు పక్కి సమస్వరములను గుంపులు గొన చెలగించుచుండెను అట్లు ఆమె అమృత ప్రాయములైన తానములచే మరియు మూర్ఛనలచే, అచేతనములు చేతనములవలె గరగునట్లు చేతనములు అచేతనములవలె పరవశించి ప్రమాను పడునట్లు వీణ వాయించుచుండెనని భావము. ఇందు ప్రసేవక

వృత్తి, సమేలములు. అత్యాది పదములకు దాసత్వము కూడికమున్నగు అర్థాంతరముల నేర్పరచి తదను గుణముగా అపరంజి చాయలొసగుట, రాగ సంపద లిచ్చుట మున్నగువానికి దాస ధర్మములకు మెచ్చి అపరంజ ఇచ్చుట అనురాగము నెరపుట మొదలగు అర్థాంతరములను కవిని బంధించెను. అనువాదమున పై భావము చక్కగా పొందుపరచ బడినది. 'విద్రావిత శేవ ముద్రాం, శోణాధరామ్'' అనునవి మూలాధికములు. 'సచేతనాని' అనుచోట సకారము లేకున్నను తదర్థమునకు హానిఉండదు "అనుగ్రహ సమర్పక'' అను చోటి సమర్పక పదము చితముగాలేదు. 'ప్రదాన నిపుణ' అనుట యుక్తము. "ఆస్ఫాలిత తంత్రీభరామ్" అనుచోట ఆస్ఫాలిత" పదము తద నభిజ్ఞతను వెల్లడించు చున్నది. కావున "సముదీరిత తంత్రీభరామనుట సరసముగా నుండును.

31 క॥ నర రాజ కన్యలును గీ, స్సుర రాజ కుమారికలు ఫణాధర విద్యా
ధర వీణాధర శోణా, ధరలును నాతరుణి బోల్ప దగరు నరేంద్రా

32 తే॥ మేటి జమ్మేటి యసట గ్రొమ్మించు మించు, బొదివి మదన ప్రతాపాగ్ని పుటము వెట్టి! తమ్మి గద్దియ దాకట, గ్రమ్మి యట్టి కొమ్మ
గావింపబోలు నెత్తమ్మిచూలి.

32 శ్లో॥ జంబూ నదీ కర్దము జాత మూషాం
సౌదామ నీం సారస భూస్సు మేషా।
తేజోగ్ని తప్తాం దృఢ బీజ కోశే
సంఘట్టయామ్ సాధు ససర్జకింతామ్.

మెరపు తీగయే మిక్కిలి ప్రకాశము కలది, దానిని బంగారు బురదలో పొదివి పుటము వెట్టుటచే దాని కాంతి మిక్కిలి ప్రకాశించును. దానినే బంగారు పసిమి చాయగల తామర దుద్దు మీద కమ్మి సాగించి ఆ యువతిని బ్రహ్మ నిర్మించియుండును. కాబోలని గిరికా సౌందర్యాతిశయమును భంగ్యంతరముగా రామరాజ భూషణుడు వర్ణించెను. జంబూ నదీ కర్దము జాతము మూసగా కల్గిన సౌదామనిని అన్నచో మూలభావము యొక్క స్పష్టతరాదు మరియు మేటి

జమ్మేటి యసటన్ పొదివి, యనియే మూలము. 'జంబూ నదీ కర్దమ జాతమును మూసగా మూలమున పేర్కొనలేదు. అట్టి బంగారు బురదలో ముంచి మన్మథ ప్రతాపాగ్నిలో పుటముబెట్టి తామర దుద్దను దాకటి మీద సాగదీసి ఆమెను సృష్టించి యుండు నని యే భావన, బంగారు బురదను మూసగా రూపణ చేసినచో దానిని రూపక సమానముగా పేర్కొనుట యుక్తము. కాని 'మూషా' పదము స్త్రీ లింగ మగుట వలన 'మూషాయామ్' అని అవ్యక్తమున ఇమడదు ఈ అవస్థ పడుటకన్న మూలాను గుణముగా 'జంబూనదీ శాద-ర సోప లిప్తామ్. అని అనువదించుట యుక్తము.

33 సీ॥ వనిత పాదములు ప్రవాళంబులై మించు, గటి యచలా భోగ కలన
బొదలు పడతి। గుబ్బలు మీఱు భద్రకుంభ నిరూఢి, మజ్జఖ్యాతి
వదల కొనరు। గలికి చెక్కులు చంద్ర ఖండంబులై పొల్చు,
గన్నులు రాజీవ గణన గాంచు। వెలది వేనలి నీల విషధరంబై తోచు,
దనువెల్ల గాంచనం బనగ నెసగు.

33 శ్లో॥ అంఘ్రిద్వంద్వ మతి ప్రచల మచాలా భోగా నితంబస్థలీ
వక్షోజా వరభద్ర కుంభ సదృశౌ వక్త్రం తదబ్జోపమమ్
గండౌ పాండర చంద్ర ఖండగణితౌ శైలీముఖ ప్రేవహా
వీక్షా కంజదృశోఽతి నీల విషభృ ద్వేణీ వపుః కాంచనమ్.

అనువాద మతి సమర్థతతో నిర్వహింపబడినది, కన్నులు రాజీవ గణనగాంచునని మూలము. రాజీవమనగా, కమలము బెడిస చేపయని అర్థము. రాజీవ పదమును గ్రహింపక అనువాదకుడు శిలీ ముఖములతో కనులను పోల్చినాడు, శిలీ ముఖమనగా తుమ్మెద, మరియు బాణము. వీక్షశైలీ ముఖ ప్రేవహమైనది. బాణభ్రమరముల శోభను పొందినదని భావము. మూలకర్త "నానా సూన వితాన వాసనల" అను పద్య రూపమున కన్నులను తుమ్మెదలుగా వర్ణించుట దీనికి ఉపోద్బలము.

33 తే॥ బగడ మిగురాకు నిలజట్టు బనటులుకరి, కుంభముల దమ్మి
నెలనెల కూనగపుర మజ్జముల మీల మొగులు గాలాహి బసిడి,
సంపెంగల గూర్చి నలువ నిర్మింపబోలు,

33 గ॥ విధిః క్రమేణ విద్రుమ పల్లవౌ విపులాచలౌ కనక కలశౌ కరి కుంభౌ కమల శశిబింబౌ చంద్ర ఖండ కర్పూరౌ చంచరీక సాయకౌ నీలాహి నీరదౌ గాంగేయ గంధ ఫలికే పరస్పర మను యోజయన్ తదీయ పాదాది కేశాన్ ప్రచయావాసోరచయా మాస.

ఇది పై సీస గీతమున కనువాదము. సముచితముగా నున్నది. 'బింబో'౽ స్త్రీ మండలం త్రిషు". అను అమరోక్తి ప్రకారము బింబపదము పుంలింగమున ప్రయుక్తము,

34 తే॥ వదన వనజ హృతాంశు సర్వస్వ దగుచు, గుందు విందుని దరహాస కందళమున మనుపుమని పాదముల ప్రాలి చనని విధుని, కొమ్మలన వింతి మృదున ఖాంకురములమరు.

34 శ్లో॥ వక్త్రాంబు జాహృత వసుస్వ మయే కృ శేందుం
మందస్మితేన తవ మాంసల మావహేతి
సంప్రార్థ్య సంతతనతా వనితా ఇవేందోః
పాదార విందనఖరాః ప్రవిభాంతి తస్యాః

అనువాదము చక్కగా నున్నది, అయే అనునది అవ్యయము=దీనికి అయ్యా అని అర్థము 'ఇందు' పదము రెండు పర్యాయములు వచ్చినది. ఇవేందోః అనుచోట "ఇవాస్య" అని మార్చిన మార్చవచ్చునుః

34 ఉ॥ భామ పదద్వయంబడుగు బాయకకొల్చు సరోజ రేఖలన్
శ్రీ మెఱయన్ భరించి మధు జృంభణచే మొన చూపు పల్లవ
స్తోమము సౌకుమార్యమును శోభయుగై కొన బోలు గానిచో
గోమల తారుణత్వములు, గోల్పడునేయవి నాడునాటికన్.

35 శ్లో కాంతాపదే చిరత రాశ్రయ కంజరేఖా
కృత్వా౽ధి కశ్రి మధు జృంభణ పల్లవానామ్

తాదృఙ్మృదుత్వ సుషమే తరసా వ్యహార్ష్టాం
తస్మాత్ క్రమేణ మృదు తారుణ తాకృశాస్తే.

ఆమె పాదములను అడుగుబాయక (ఒక అడుగంత ఎడమైనను ఎడబాయక, అరి కాలిని ఎడ బాయక అనియు) కొల్చెడి సరోజరేఖలు (సేవించెడి పద్మ పంక్తులు, పద్మాకార రేఖలు) శ్రీమెరయన్ భరించి=అడుగులాశ్రయించి కొలిచి నందులకు సంపదలొసగి ప్రకాశించునట్లు వానిని పోషించి (కాంతి విలసిల్ల ధరించివాని పద్మాకార రేఖల పక్షమున) కల్లు కైపుచే ప్రతిఘటించు విట సమూహము యొక్క పడుచుదనపు మిడిసిపాటును అడగ ద్రొక్క (మధు మాస విజృంభణ వలన పొడ సూపు చిగురు జొంపముల మార్దవారుణ్యములను కొల్లగొట్టి) యుండును. లేనిచో ఆ పల్లవములు దినదినము మార్దవారుణ్యములు పొగొట్టు కొనునాయని భావము. 'అడుగు బాయక కొల్చు' అను చోటి సారస్య మనువాదమున రాలేదు, 'చిరతరాశ్రయ' అనుస్థానమున 'చిరతరాశ్రిత' యని మార్చుట యుక్తము. అధికశ్రీ=అధిక శోభా సంపద కల్గునట్లు, అనునది క్రియా విశేషణము 'వ్యహార్ష్టామ్‌లుఙ్, ప్రథమ పురుష ద్వివచన రూపము, ఇది విహారార్థమందే ప్రసిద్ధము. విశేషముగా హరించెనను అర్థమున ప్రయోగింపబడినది. దీనిని, అన్యార్థ దోషమందురు, "రూఢిచ్యుతం పదం యత్తు తద న్యార్థమితి శ్రుతమ్" అని భోజుడు అన్యార్థమునకు స్వరూపము దెల్పి "విభజంతే నయేభూవ పాలభంతే శ్రియమ్" అని ఉదాహరించెను. ఇందు శ్రుతి కటుత్వము కూడా ఉన్నది," తాదృఙ్మృదుత్వ=సుషయే" అనునది అట్టి మార్దవ శోభలు కలవనీ, పదములు విశేషణములను చేసినచో విహరించిన (వ్యహార్ష్టామ్) వను అర్థము స్ఫురించును. కదాయని అనవచ్చు. అట్లైనను మధువుచేజృంభించిన పల్లవావళి సంపద కొల్లగొట్టియను ఉద్దేశము వ్యక్తము కాదు, అదియే చెప్పదగినది కదా. కావున "హృత్వాసుషమ మృదు తారుణతేవ్య భాతామ్" అని మార్చుట యుక్తము.

35 తే॥ కమల గర్భ ఫూత్కార్య కాహ్లాకులం దొరయు
నీతలున్ మోహితలును జూపి యెలమి మకర
లీల లోగొని దొనల కలాళి ముంచి
యబల మృదు జంఘికా ప్రకాశౌఘ మడరు

36 శ్లో॥ కలమ దౌ హృద కాంచన కాహలీః
ప్లవరుతైః ప్రథయన్ మకర శ్రియమ్
అభి సమేత్య నిషంగ మయన్ శరైః
జయతి జాంఘ విభౌఘ ఇభీగతేః

ఆ యువతి పిక్కలు కలమ గర్భములను హిరణ్య కాహళులను మకరములను అమ్ముల పొదలను జయించిన వని శ్లేష మూలమున చమత్కరించుచున్నాడు. ఈత=ఈనుట. మ్రోత=మోయుట ధ్వనిజేయుట, లోగొనుట= లోబరచు కొనుట, లోపల కలిగియుండుట దొన=అమ్ములపొది, రాతి దొనయని అర్ధద్వయము. ఆమె జంఘా ప్రకాశమును ప్రవాహమున వరి పొట్టలకు ఈతలు, స్వర్ణ కాహళులకు మ్రోతలు కల్పించి మకరములను లోగొని దొనలను శరావళితో, ముంచినదని భావము ఈత మ్రోత లోగొని దొనయను పదములకున్న అర్థాంతర స్ఫూర్తి ప్లవరుతాదులలో నంభవింప నందున మూలగత సారస్యము రాలేదు, తదుభయార్థ స్ఫూర్తి గల పదములు సంస్కృతమున లభింపమి అనువాదకుడు సారస్యమును తేజాలక పోయెనని గమనింపవలెను. "జాంఘ విభౌఘ ఇభీగతేః" అనుచోట" ఓఘ. పద వినేశమునకై అనువాదకుడు పడిన పాటు తెలియుచున్నది. "జాంఘ మరీచి మహోఝుల్యః" అనికాని జాంఘ మనోజ్ఞ మహోఝురీ, యనికాని మార్చుట యుక్తము. శరములతో నిషంగమును (అమ్ముల పొదిని) పొంచును అని అర్థము. (నిషంగమయన్ శరైః) వచ్చును, కాని, శరముల నిపుచునను అర్థమురాదు. కావున "అను హరన్ శరైః" అని మార్చినచో కనీస శ్లోకార్థస్ఫూర్తియైన కలుగును.

36 మ॥ సతి యూరుద్యుతి జెందబూని నిజ రుక్ప్రర్మప నోద క్రియా
రతి బాధోలవ పూరితోదరములై రంభేభ హస్తంబు లు
న్న తటిన్ పీడె మరుద్విభూతిఁ గదళి న్ద్వగ్దోష మా చంచలో
ద్ధత శుండాతతి బాయదయ్యె నదె పో తద్వైర మూలంబిలన్.

37 శ్లో॥ రంభా దంతి కరేషు సత్సు రమణీ రమ్యోరు రమ్యాప్తయే
దుశ్చర్మ క్షరణాయ తోయకణికా పూర్ణో దరేషు క్రమాత్
త్వగ్దోషః కదలీం జహౌ వర మరు ద్భూత్యా చలా ముద్ధతాం
శుండాం చేన్న జహౌ తతోను కరిణాం వైరం కదల్యా భువి.

అరటి మరియు ఏనుగు తుండము ఆ యువతి ఊరు సౌందర్యము పొంద వలెనని అభిలషించి ముందుగా తమదుశ్చర్మ దోషములను (చౌదుము కఠిన త్వము) పోగొట్టు కొనుటకై జల లవ మాత్రమును లోగొని తపస్సు జేయగా మరుత్ప్రసాదమున (వాయుదేవతానుగ్రహమున) అరటి యందున్న చర్మ దోషము (చౌదుము) విడిపోయెను. పైకి మిడిసి పడుచు చంచలమైన ఏనుగు తుండమందు ఆ దోషము (కాఠిన్యము) వీడకపోగా ఈర్ష్యచే ఆకరి తుండ ములు అరటి చెట్లపై వైరము వహించి వానిని పెల్లగించుచున్నవి, అనువాదము రమణీయముగా నున్నది. చేత్, అనునది మాత్రమను అర్థమున ఉపయోగించి నట్లు తోచుచున్నది, 'చేత్' అనుచోట 'తత్' పదము చేర్చుట యుక్తమనితోచును.

'సామాన్యే నపుంసకమ్' అన్నట్లు 'తత్' పదమువలన ఆదుశ్చర్మ దోషమను అర్థము సూటిగా బోధపడుతుంది.

37 అతివనితంబ బింబ మఖిలావని భాగము నేలి దీవు లం
చితరుచి నాక్రమించి యరి జృంభణ వారణధుర్యమై సువృ
త్తత బరి పూర్ణ రాజరమ దాల్చి కదా గజమస్తకో పరి
స్థిత మయి కాంచె గాంచిగుణ దీపిత కాంచన పట్ట బంధమున్.

38 శ్లో॥ సర్వోర్వీం సమవన్ సదోరు జఘన ద్వీపాని రుచ్యాలగన్
సంభింద న్నరి జృంభణాని సకల క్ష్మాభృజ్జయం సం వహన్
సద్వృత్తః పరిపూర్ణ రాజ కమల శ్యామాని తంబోదధౌ
కాంచీ కాంచన పట్ట బంధ మిభ రాట్కుంభాగ్రభూమి స్థితః

ఇందు నితంబ పరముగా రాజ పరముగా అర్థద్వయము స్ఫురించునట్లు వర్ణింపబడినది. ఒక రాజు భూ భాగమును పాలించుచు పిదప సప్త ద్వీపముల నాక్రమించి శత్రువుల గర్వమడచి మంచి వర్తనతో సంపూర్ణ రాజలక్ష్మిని పొంది పిదప ఏనుగుపై ఎక్కి బంగారు పట్టమును నొసట గట్టికొని రాజ్యాభిషే కము నొందును. అట్లే ఆ యువతి నితంబ బింబము భూ విస్తారమును లోకువ పరచి ఔన్నత్య సంపదచే ద్వీపములను తిరస్కరించి రథ చక్రపు సమృద్ధిని పోగొట్టి వక్షోజ వదనముచే సంపూర్ణ చంద్ర మండల విస్ఫూర్తిని భరించి

కాంచియను బంగారు పట్టగట్టుకొని ఏనుగు కుంభ స్థలములను క్రిందుపరచి ప్రకాశించెనని భావము. అనువాదమున కొంత మార్పున్నది. దీవులాక్రమించియని మూలమున నుండ ఊరు, (లేక ఉరు) జఘనములను దీవుల నాక్రమించియని మార్చబడినది. భూ భృజ్జయము మూలమున లేదు. ఇది అరి జృంభణ సిరూలన లందే అంతర్భవించును. 'పరిపూర్ణ రాజ కమలః అని యుండవలెను. విసర్గను ముద్రణ కబళించినది. రాజ కమల, అనునపుడు నిండు చంద్రుని శోభయను కవి ఉద్దేశము పాఠకునకు త్వరగా స్ఫురింపదు, నితంబమునకు పర్వత సామ్యము చెప్పుట ప్రసిద్ధముకాదు జఘన ద్వీపము లనుటలో సారస్యములేదు. ఔన్నత్యమున ద్వీపములతో నితంబమును పోల్చుట కవి సమయ సిద్ధము. కావున మార్చుట యుక్తమని తోచుచున్నది 'సర్వోర్వీం సమవన్'' రుచిభరాత్ ద్వీపాధి పత్యంవహన్, నిర్భిందన్నరిజృంభణాని కలయన్ సంపూర్ణ రాజ శ్రియమ్, సామంతేశ్వర వత్సువృత్త గరిమాకాంతా నితంబో దధౌ ఇశ్లే కంఠాగ్ర భూమి'' చోట కూడ 'కుంభాగ్ర భూమిస్థితః, అని మార్చుట యుక్తము. యతికి భంగము నేర్పడునన్నచో ప్రథమ చరణముననే యతి భంగము కలిగినది. ప్రథమ పాదమున లేని యతి నియమము మిగిలిన చరణములలో పాటింప వలసిన నియతి లేదు కదా.

38 చ॥ కలికి ముఖేందు కాంతికర కాంత వయోజల దాంత వేళవ
ర్తుల కుచ గండ శైలములు దోప వళిత్రయ శోష రేఖ లిం
పలరగ మధ్యసీమ బయలై కటి సైకత మొప్ప బాల్యమ
న్పలునది యింకుచో మెలసె నాభి గభీర జలాశయం బనన్.

39 శ్లో॥ వక్త్రేందు కాంతి కర కాంత వయోఘనాంతే
సంశోషి బాల్య సరితి వ్యరు చన్ వరాంగ్యాః
వక్షోజ వర్తుల శిలావళి శోషరేఖా
మధ్యాభ్ర భావ కటి సైకత నాభి గర్తాః

అనువాదము బాగున్నది, ఆ యువతికి యౌవనము శరదృతువలె రాగా ముఖకాంతి చంద్ర కాంతివలె ప్రకాశించినది. బాల్యము నదీ ప్రవాహమువలె

అంకి పోగా వక్షోజములు గుండ్రని గండ శిలలవలె కన్పట్టినవి. వళులు ఎండి పోయిన ఇసుక రేఖల వలె తోచినవి. నడుము ఆనది మధ్య భాగము వలె బయలైనది. (సన్ననైనది) పిరుదులిసుకతిన్నలవలె బలితమైనవి. నాభి లోతైన మడుగువలె గన్పట్టినది "వ్యరుచన్, అని పరస్మై పదిలో వాడబడి నది. రుచ ధాతువు ఆత్మ నే పది. కావున వ్యలసన్ అనుట యుక్తము.

39 చ॥ అలి కులవేణియారు నవ యౌవన మన్ నల రాచ తోటలో
బొలుచు నితంబ వేది కడ బొక్కిలి దిగ్గియ చెంత నీలసం
కలిత నవాంబు యంత్ర మగుగాని యెడన్ రస గుంభ నంబు సం
ధిల బుట ముబ్బునే నడుమ నిల్చి ఘన స్తన నూన గంచ్ఛముల్.

40 శ్లో॥ తద్యౌ వనాతసు విలాసవనే నితంబ
వేద్యంచలే వివృత నాభ్యురువాపి కారాత్
రోమాలి నీలమణి రూఢ వనాంబు యంత్రాత్
సాధూత్ప్లు తౌను సరస స్తనసూన గుచ్ఛౌ.

ఆ యువతి యౌవనము మదనోద్యానమువలె పిదుదు లరుగువలె, నాభి బొడ్డు భావివలె నూగారు నీలమణులు చెక్కన జల యంత్రమువలె కుచములు పూగుత్తుల వలె నున్నవి. శృంగార రసమను నీటి యొక్క కూర్పు ఒనగూడ కున్నచో అవి మధ్యలో ఉబుకక పోయెడివికదా. అనువాదము 'రస గుంభ నము సంధిల్ల, అనుమాట లేదు, రస గుంభనము లేనిచే వానికి ఉబుకుట సంభ వింపదు. మరియు "ఉత్ప్లుతౌ, పదము వలన ఉబుకుటయను అర్థము స్ఫురించుట కష్టము. ఇట్లే 'వివృత' పదములోతైన అను అర్థము నీయదు. కావున 'వివృత నాభి' ని, వినత నాభి, యని పఠించుట యుక్తము. "రోమాలి నీల జల యంత్ర రసైక సేకాత్ సాధూత్పుటౌను" అని మార్చుట యుక్తమని తోచును. నీల పదము నీలమణి బోధకము.

40 మ॥ ఘన నాభీ గుహ చెంత నారుహొగ లే గౌ నాని తా నాయనం
గుని మెప్పించి తదాత్మతం బొరయ గన్గోజాల కుజ్జృంభిత
స్తన యుగ్మం బతనుత్వ మొందె నథ రోష్ఠం బిట్ట దర్పస్థితిం
దనరెం గన్నులు శంబ రాహిత గతిం దాల్చెం బయోజాస్యకున్.

41 శ్లో॥ రోమాలి ధూమ జుషి నాభి గుహే విలగ్న
యోగి న్య నంగ మభి తోష్య తదాత్మతాధ్యే
సేర్ష్యం కుచోష్ఠ దృగగాద తనుత్వ మిత్థ
ధర్మ స్థితిం విజిత శంబరతాంచ తస్యాః

ఇందు నడుము మున్నగు వానికి మన్మథ సాయుజ్య ప్రాప్తి వర్ణింపబడినది. ఆ యువతి నత నాభియను గుహ పొంత నడుమను యోగి నూగారను హవనధూమమును సేవించి మదనుని గూర్చి తపస్సు జేసి, అతని తాదాత్మ్యమును (అదృశ్యతను) జెందగా దాని యందలి ఈర్ష్య చొప్పున వక్షోజములు అధరోష్ఠము కన్నులనునవి కూడ క్రమముగా అతనుత్వమును (మదన భావము, అధిక్యము) ఇక్షు ధర్మ స్థితిని (మన్మధ భావము, చెరకు యొక్క మాధుర్య రీతిని) శంబ రాహిత గతిని (మన్మథ భావము, జింకకు విరోధియగుట) పొందెనవి భావము అనువాద ఖండముగా నున్నది. కాని 'నాభి గుహే, అని స్త్రీ లింగమగు గుహా శబ్దము పుం లింగమున ప్రయోగింపబడినది. నాభియను గుహ గలదని బహువ్రీహి చేయవచ్చు కాని భావ స్ఫూర్తి ఉండదు, కావున "నాభి బిలే" అనుట యుక్తము "తదాత్మతాధ్యే" చోట "అధ్యే" స్థానమున "అప్తే" చేర్చినచో తాదాత్మ్యమును పొందగా, అను అర్థము సూటిగా ఏర్పడును, తదాత్మతో ఒప్పినదనుటకన్న తపస్సుచే మన్మధుని మెప్పించి తదాత్మను పొందిన దనుట యుక్తము కదా. 'కుచోష్ఠదృక్' అనునది సమాహార ద్వంద్వము ద్వంద్వాచ్చుదషహాంతాత్సమాహారే, అను సూత్రముచే చవర్గాంత, దషహాంత పదములకు సమాహారమున అచ్. ప్రత్యయము వచ్చును. 'దృశ్' శకారాంతము కావున అచ్ ప్రత్యయము రాలేదు, కుచోష్ఠ దృక్కులకు సమాసము జేసినపుడు వాని కర్మలగు అతను త్వాదులకు కూడా సమాసము జేసిన బాగుండెడిది, కర్మలు వ్యస్తముగా నిర్దేశింపబడినవి. దీనివలన ఉద్దేశ్య ప్రతీతికి భంగము కలుగదు. కాని అన్వయము క్లిష్టమగు నన్నచో అది అంత దోషముకాదు. వ్యస్తతయే కర్తలకుచిత మన్నచో మార్చవచ్చును. మరియు 'విలగ్న' అని "వి" పొరపాటున దొరలినది దానిని "వ" గా మార్చుట యుక్తము. అపుడు= "రోమాలి ధూమ జుషి నాభిబలే వలగ్న యోగిన్య నంగ మభితోష్య తదాత్మతాప్తే=సేర్ష్యంకు చావ తనుతాము

ధరస్తథేషు ధర్మ స్థితిం దృగపి శంబరవైర మాప'' అని మార్చినచో మదనుడు శంబరాసురుని యెడ పగబెట్టుకొనెను, కనులు శంబరముల యెడ (జింకల యెడ) పగ బెట్టుకొన్నవి కావున మదనోచిత వ్యాపారముతో కనులు ఒప్పుచున్నవని తాత్పర్యము వచ్చును.

41 సీ॥ క్షణ విలాసమె కాని గజనిమ్మ పండులు, సరియెదుర్గాధి వాసమున
మనిన। బైపూత రుచిగా ప్రతియె కిన్నరకాయ, లరిది మేరుపు
తలయంపి నిడిన। ప్రొద్దువన్నెలెగాక యుద్ధియే తమ్మిమొ, గ్గలు
చక్రముల గూడి దళము కొనిన। గాక చాయలె కాక కనక కుం
భము లీడె, శ్రీ కరుల శిరోగ్ర సీమనున్న.

42 శ్లో॥ తుల్యే తత్కుచయోః క్షణాంశులికుచే దుర్గాధివాసేఽపికిం
బాహ్యే లిప్తరుచిః ప్రసేవకయుగీ మేరూత్తమాంగాఽపికిమ్
ప్రాతర్భాంబుజ కుట్మలే పరిదలే చక్రాది రక్త్యేఽపికిం
బర్హిస్తాప విశోభి ధర్మ కలశౌ శ్రీ భాగ్ర వృత్త్యాపి కిమ్.

ఆమె వక్షోజములకు లిచాదులు సరి తూగలేక తమవలెనే ఉపమాన భూతము లగు పర్వతాదుల తోడు నభిలషించినవి, వాని తోడు లభించినను అవి ఆ కుచములకు సరిరాలేక పోయినవి. దుర్గాధి వాసము, మేరువు తలయంపి, చక్రముల కూడిక శ్రీ కరుల శిరోగ్ర సీమయను వానికి ప్రభుత్వ ప్రభావబల సంపదలను విశేషమును అర్థాంతరములతో నలవర్చి అట్టి ప్రకృష్ట సాహాయ్య సంపత్తిని గుదురు పరచినను సాటి రామిని వెల్లడించుటచే చన్నుగవ లోకోత్తర సౌందర్యమది వ్యక్తమగుచున్నది. గజనిమ్మ పండ్లలో క్షణకాలకాంతి, పర్వతములలో కరకుదనము, కిన్నెర పీణ కాయలలో బండొంటి ఎడబాటు, (ఎడకల్గి యుండుట) అగ్నితాప మూలమున కాంచన కలశములలో మెఱుగు చేకూరుట ఏ ప్రొద్దు కాప్రొద్దు తామర మొగ్గలలో వికాస లక్షణము చక్రవాకములలో జోడు వీడుట అను అపలక్షణము లున్నందున నిత్య సింవ ద్యోన్మేషాదులు గల కుచములతో అవి సాటి రావని భావము. ప్రొద్దువన్నెలె, అను దానికి "ప్రాతర్భాంబుజ కుట్మలే' అని అనువాదము. 'శ్రీ కరుల శిరోగ్ర సీమ, అనుదానికి

'శ్రీ భాగ్ర వృత్త్యపి" అని అనువాదము శ్రీ+ఇభ+అగ్ర వృత్త్యాపి అని సామాన్యార్థము చక్కగా స్ఫురించును. శ్రీ భ + అగ్ర వృత్త్యాపి= లక్ష్మీ శోభ గలవారి తల మిన్నగానున్కిచే అను అర్థాంతరము స్ఫురించుట కించిత్కష్ట మగును, మొత్తముమీద శ్లేషను జాగ్రత్తతో నిర్వహించి నాడన వచ్చును.

41 గీ॥ మిశిత ఘన సారమై నున్న మిగిలి కదిసి. యంతరము సూత్రమున
కీకయలరి జోడు। వదల కమిత రస ప్రౌఢి బొదలి మెఱయు,
నన్ను తలమిన్న వలిగుబ్బ చన్ను గవకు.

శ్లో॥ ఘన సారాన్వితౌ శ్లక్ష్ణ శ్లిష్టా వంతర సూత్రితౌ
రాజంతౌ తా సదా యుక్తౌ మితేతర రసౌ విభౌ.

ఇది పై సీస గీతమున కనువాదము. ఇభౌ, అనుచోట 'ఇమౌ' అనుట యుక్తము. అనువాదమున చితముగానున్నది.

42 చ॥ సతిహృదయాల వాలమున జవ్వన పుం బెను గాక జేసి య
య్యతను డు గుబ్బ పొంబనటు లారను లోహ శలాక నెత్తి యూ
ర్జిత రుచి నింపగా దువల జిందిన జా పొడి బాహుమూల జ
ద్యుతి యగు గానిచో నచట దోర్మయ భర్మలతల్ జనించునే.

43 శ్లో॥ తన్వ్యం గాఽఽ హృదయాఽఽవాల నివసత్తారుణ్య తప్త స్తన
ప్రాంచ త్కాంచన కుంభయోః ప్రకటితేకామేన కాంత్యుత్కరే
తద్రో మాలి శలాకి నా నికషజాః కీర్ణా స్సువర్ణాణవో
బాహా మూల విభాః కథన్ను పరధా దోర్భర్మ వల్లీ రుచిః

స్వర్ణ కారుడు కుంపటి యందు నిప్పు రగిల్చి బంగారు సొమ్ములు చేసి వానికి వలయు నంత మెరుగు పెట్టుటకై సాన బట్టునపుడు బంగారు రేణువులు ప్రక్కల దొరగును. అట్లే మన్మధుడను స్వర్ణ కారుడు వక్ష స్థలమను కుంపటి యందు యౌవనమను అగ్నిచే పుటము బెట్టి వక్షోజములను సువర్ణ కలశములను నిర్మించి నూగారను నికషముపై వానికి మెరుగు పెట్టెను. సానపై మెఱుగు

పెట్టినపుడు బంగారు ధూళి తుదల జిందుట చేతనే బాహుమూల ములకు ఆ కాంతి యేర్పడెను. తద్రోమాలి శలాకినా=ఆమె నూగారను సలాక (నికష స్థానీయము) గలవాడైన మదనునిచే కాంత్యుత్కర్షే ప్రకటితే=కాంత్యతిశయము ప్రకటింపబడగా, అను అనువాదము లోహ శలాక, చే వానికి మెరుగు పెట్టగా అని మూలమున్నంత స్ఫుటముగా లేదు. ''రుచి భరేకామేన చోన్మేషితే తద్రోమాలి శలాకయా'' అని మార్చినచో భావ స్పష్టత సమకూరును.

43 చ॥ విలసిత మౌక్తికంబులు సవిభ్రమ రేఖలు నున్కి సాటి రా
దలచి మహోద్ధతిన్ మొరసి తన్మృదు నాద విలాస కౌశలం
బల వడమిన్ ముడింగి దరమై తనలో వివరం బెటింగి యా
వల మురి దా ప్రదక్షిణము వచ్చెనొ యాతని కంఠ లక్ష్మికిన్.

44 శ్లో॥ సన్మౌక్తికో పి సమ విభ్రమ రేఖికో పి
తారస్వరో మధుర తన్మృదు నాదహైన్యాత్
కుబ్జోంత రాప్త వివరః కులసవ్య శంఖః
కామం ప్రదక్షిణ పరః కిము కంఠ లక్ష్మ్యాః.

క్షుద్రుడు ఏదో ఒకటి, రెండు గుణముల సామ్యమును బట్టి విర్రవీగి తన కంటె అధికునితో పోటీ పడి తన కొరత గ్రహించి అతనికి ప్రదక్షిణము చేయుట లోక సహజము, మౌక్తికములు విభ్రమ రేఖలు తనకు ఆ యువతి కంఠమునకు సమానముగా నుండుటచే మిడిసి పడి మొరసి, శంఖము కంఠమునకున్న మాధుర్యాదులు తనయందు లేనందున ముడిగి (ముడిచికొని, నీళ్లలో మునిగి) ఆమె కంఠ లక్ష్మికి అపరాధ క్షమణకై ప్రదక్షిణము జేసినది కాబోలు. శంఖమున కుండు దక్షిణావర్తమును ప్రదక్షిణముగా కవి చమత్కరించినాడు. అనువాదము బాగున్నది. "ముడింగిదరమై, అనువాని సారస్యము మాత్రము తప్పినది. కుబ్జ పదమునకు గూనిపోయి అని అర్థము. సంకోచముజెంది అని భావము గ్రహింపవచ్చుకాని నీట మునిగియని అర్థమురాదు,

నాదహైన్యాత్=అనుచోట నాదలోపాత్ అనుట యుక్తము,

44 సీ॥ కొమ్మవాతెఱతో గుణమ్ము గైకొన వచ్చి, కఠిన విద్రుమముచే
కట్లబడియె। గోమలియధరంబుతో మొనల్ పచరించి, యరుచి
బింబ ఫలంబు లవిసి పడియె। మృగనేత్ర 'పెదవితో సొగసు
బూనగడంగి, కెంపు నీరసము నెక్కించుకొనియె। నతివమోవితో
రస స్థితులు చూపి సుగంధ, వికల బంధూక మూరకయ విరిసె.

45 శ్లో॥ ప్రియోవిద్రుమ బింబ పాటల మణీ బంధూక గుచ్ఛావలీ
తత్కాంతాధర సామ్య లిప్సురివ తత్రైత్యకర్మా దాహతా
పాణీ బంధ విపాత తక్షణ పరిస్ఫోటా నగాత్ప్రాభృశం
కాఠిన్యా దరుచిత్వతో విరసతా కాగాచ్ఛ నైర్గంధ్యతః

ఇది కష్ట ప్రాయమైన అనువాదము, అనువాదమున భావము ప్రతి స్ఫురించుచున్నది. కాని మూలమందలి సొగసు స్ఫురించుటలేదు చేకట్లపడియె మొనల్ పచరించి, అవిసిపడియె నీరసము నెక్కించికొనియె ఊరకయ విరిసె అను నని అచ్చము తెలుగు జాతీయములు, ఈ జాతీయములలో అర్థాంతరము నిగుడించి చమత్కారము రూపొందింప బడినది. ఈ సొగసు పాణీబంధ, విపాత తక్షణ పరిస్ఫోట పదములలో రాదు. తెలుగు జాతీయములకు యధాతధముగా పదములు అనువాద భాషలో లభించుట కష్టము, కావుననే పాణీ బంధాది పదములు గత్యంతరము లేక అనువాదకుడు గ్రహించెను, యువతి అధరోష్ఠముతో (సమాన) గుణము గ్రహింపవచ్చి, కఠినమైన పగడము చేకట్లపడియె (చేతి కట్లపాలైనది. చేతులు కట్టివేయ బడినదని భావము) గుణమనగాదారము కావున దారముత్రచ్చబడి చేతి కట్లనెడి హస్తాభరణములలో చేరిపోయినదని తాత్పర్యము. మోవితో మొనల్ పచరించి, అనగా ఎదిరించి రుచి లేని దొండ పండ్లు అవిసి పడినవి (గుప్పున గూలినవి) మొనల్ అనగా పండ్ల క్రింద నుండు కొనలు. అట్టి కొనలు జూపి కుళ్ళిపోయినవని భావము. పెదవితో సమానముగా సొగసు బూన ప్రయత్నించి కెంపు నీరసమెక్కించుకొనినది (నీరస స్థితిని పోగొట్టుకొనినది) కాంతి కొరకు సానవేయ బడుచున్నదని తాత్పర్యము. అనువాదమున ఇట్టి అర్థాంతర స్ఫూర్తి కృత చమత్కార మొదవదు. మరియు పాణీయని స్త్రీ లింగముగా ఉపయోగింపబడినది. ఇట్లే మణిని, మణీయని పలుచోట్ల లింగ భంగ మొనరించినాడు.

44 తే॥ డాయు పగడంబునకు పగడంబు బింబ, మునకు బింబంబు మెఱయు
కెంపునకు గెంపు బంధు జీవంబునకు దాన బంధుజీవ. మౌరయా
కుందరదన రదాంశు కంబు.

45 శ్లో॥ విద్రుమో విద్రు మస్యా భూత్ బింబో బింబస్య రత్నకః
రత్న స్య బంధు జీవస్య బంధుజీవః ప్రియాధరః

ఇది పై సీస గీతమున కనువాదము. ఆమె అధరము విదుమ్రమునకు విద్రుమము, ఇత్యాది రూపమున సము చితముగా అనువాదము చేయబడినది. పగడంబు మున్నగు వానిలో అర్థాంతరము (పగ యొక్క అతిశయము ఇత్యాది రూపమున) నిగుడింపబడినది. అనువాదమున- రెండవ విదుమ్రమ పదము విశిష్ట వృక్షమును అర్థమున వాడబడినది. పగడములను సృష్టించెడి విశిష్ట వృక్ష మామె, అధరమని తాత్పర్యము, కాని 'రత్నకః' అనుచోట అర్థాంతరస్ఫూర్తి లేదు. కెంపునకు కెంపన్నపుడు కోపప్రయుక్త రాగము గలదని అర్థాంతరము. ఇట్టి స్ఫూర్తి రత్నక పదమున కలుగదు. మరియు 'రత్నకః' అని పుం లింగ ప్రయోగము విరుద్ధము. క, ప్రత్యయము చేరిన మాత్రాన రత్న పద మునకు లింగము మారదు ఇట్లే బింబ పదము పుంలింగమున ప్రసిద్ధి అరుదు. బింబో స్త్రీ అని అమరకారకుడు చెప్పినను పుంలింగ ప్రయోగము విరళము. "బింబంతు ప్రతి బింబేస్యాత్ మండలే బింబికా ఫలే అని హేమ చంద్రుడు నపుంసక లింగమున నుండునని సూచించినాడు. ఇట్లే పలువురు 'విమంటు' కారులు. పేర్కొన్నారు. "రత్నకః రత్నస్య" అనుచోట "రాగకః రాగస్య" అన్న బాగుండునని తోచుచున్నది. రాగ పదమునకు పద్మరాగమని అర్థము. ఆ పద్మ రాగమునకే రాగమును కల్గించునని అర్థాంతర స్ఫూర్తి చేకూరును.

45 ఉ॥ ఇంతి మృదూక్తి మాధురికి నిక్షురసం బెనవోలఁ జాలకా
ద్యంతము నోడి మధ్యమ గుణా శ్రయమై నెఱకాక నెన్నిజ
న్మాంతరముల్ వహించియు దనంత నె ఖండములయ్యెగానియా
వంతయు బూన దెంత్తివొడి యయ్యు నఖండ తదీయ సంపదన్.

46 శ్లో॥ రామా సుధావచన ఇక్షు రసోఽసమత్వాత్
అద్యంత సంతత పరాహతి రాత్త తాపః
బద్ధాతి మధ్యమ గుణో బహుజన్మ నాఽపి
ఖండాప్తి రాప నదరం తద ఖండ భావమ్.

అనువాదము సరసముగా నున్నది. ఎంత పొడియయ్యు అనునది జాతీయము కావున విడువబడినది. చెరకు ఆమె వాక్కుతో పోటీపడి ఆద్యంత మోడి పోయినది. అందు వలన దానికి ఉత్తమ గుణముకాక మధ్యమ గుణమే అబ్బినది. అపుడు నెరకాకబూని ఎన్నియో జన్మ లెత్తియు అది ఖండ ఖండములైనది. ఎంత పొడి యైనను ఆమె వాక్కువలె అఖండ సంపదను పొందలేక పోయినది. ఖండ మగుట యనగా ఖండ శర్కర యగుట, పొడియగుట. శర్కర యగుట, చెరకు తుది మొదల్లు నీరసముగా మధ్య భాగము సరసముగా నుండును. కావున దాని మధ్య మందున్న మాధుర్య గుణమును మధ్యమ గుణముగా కవి కల్పించినాడు. గుడ శర్కరాది రూపములే దాని బహుజన్మలని భావము. చెరకు ముక్కలై పోవునదే కాని అఖండ స్థితిని పొందలేదు. అనువాదమున "ఆద్యంత సంతత పరాహతిః" అని పరాహతి పదము చక్కగా ఉపయోగింపబడినది. ఆద్యంతములు నిరంతరము పరాభవము పాలైనదని తుది మొదళ్లలందు మిక్కిలి అహతి పొందు నది యనియు అర్థద్వయమును పొందు పరచినాడు. 'ఖండాప్తి రాప' అనుచోట 'ఖండత్వమాప' యని అన్నచో ద్రాగర్థ స్ఫూర్తి ఏర్పడుతుంది. ఇట్లే "దరం, చోట" పరం అని మార్చుట యుక్తము. బహుజన్మలెత్తినను అది ఖండత్వమాప= ఖండములగుటనే పొందినది, పరం= కాని తదఖండ భావమ్ దానివలె అఖండ భావమును. న ఆప= పొందకుండెనని అర్థము. తన్మంజు వాఙ్మధురిమాసదృగిక్షుసార స్సాద్యంత భంగ కృశత స్సమవాప్త తాపః బద్ధాతి మధ్మమగుణో బహు జన్మనాపి సిద్దార్థ తోపి చిరమాపన ఖండ భావమ్. అని పై శ్లోకమునకు పాఠాంతరమున్నది

46 శా॥ నానాసూనవితానవాసనల నానందించు సారంగమే
లా నన్నొల్లి, దటంచు గంధ ఫలి బల్కాకం దపం బంది యో
షానా సాకృతి దాల్చి సర్వ సుమన స్సౌరభ్య సంవాసి యై
పూనెం బ్రేక్షణ మాలి కా మధుకరీ పుంజంబు లిర్వంకలన్.

47 శ్లో॥ సారంగ స్సకల ప్రసూన కుతుకీ స్వాత్మ నోపేక్షతే
మామి త్యేవ విచింత్య గంధ ఫలికా మాన్యాతపః స్ఫూర్తితః
నాసాకార ముపేత్య సర్వసుమన స్సౌ రభ్య యోగా ద్వధూ
చంచ ద్వీక్షణ చంచరీక పటలీం సంప్రాప కింపార్శ్వ యోః

అనువాదము రమణీయముగా నున్నది. తపస్సు గ్రీష్మమను అర్థద్వయము వచ్చునట్లు తపః పదము వాడబడినది. కాని బల్కాకన్, అనునది లేదు. మూలమున మాన్య పదం లేదు. తప స్ఫూర్తిచే మాన్యురాలైన దని అనువాదకుని ఉద్దేశమై యుండును, 'విచింత్య' అను పదమువలన బల్కాక, అను అర్థము రాదు. బాగుగా చింతించి తపస్సంభార మూలమున తప్తా=పంచాగ్ని మధ్య తపించినదై అని అర్థము

47 మ॥ తన రాజీవ శరం బెఱుంగదు ని శాతత్వంబు లేగల్వ తూ
పునకుం జాలదు వేగలీల యని యా పూములుక్రొ లెగ్గించి క్రొ
న్నన విల్కాడు నవాంబు జోత్పల వితా నంబీను మీనాక్షిలో
చనముల్ వింట ఘటింప బొల్చెనవి నిస్తంద్రాంబ కఖ్యాతులన్

48 శ్లో॥ ఆసన్ని శాతత్వ మవేగలీల ముత్సృజ్య మారోంబుజ ముత్పలంచ
తదీక్షణే భ్రూధనుషా యుయోజ తదంబక ఖ్యాతి రభూత్తయోఃకిమ్.

తన అరవింద బాణమునకు ని శాతత్వము అనగా తీక్ష్ణత లేదు, (అరవిందము నిశాస్వరూప మెరుగదు, రాత్రి వికసింపదని భావము) అట్లులే కలువ తూపునకు వేగలీల లేదు. అనగా తీవ్ర గమన క్రియలేదు. (కలువకు వేగన్=తెల్లవారగనే వికాసము తొలగుసని భావము) పురాతనములగు ఆ కమలోత్పల బాణములను దూషించి మన్మథుడు నూతన నలినోత్పల బాణములను సృష్టించెడి ఆయువతి నేత్రములను భ్రూ చాపమున సంధింపగా ఆ నేత్రములు నిస్తంద్రాంబక ఖ్యాతులను పొందెను, ని శాతత్వము వేగలీలలు లేక పోవుట కమలోత్పలముల దోషములు అట్టి దోషములు లేనివి కనులు గావున కనులు నిస్తంద్రాంబకములను ఖ్యాతిని బడసినవి. అంబక పదమునకు కనులు, బాణములని అర్థ ద్వయమున్నది. ఆమె నేత్రములు ఉభయార్థక ఖ్యాతిని

పొందెనని చమత్కారము. ఆవేగలీలమ్, అన్నపుడు గమనవేగములేని అను అర్థమే వచ్చును ప్రాతర్వికాసములేనిది అను అర్థమురాదు. మన్మథునకు కావలసినవి అంబుజోత్పలములు. అందులో క్రొత్తవి. క్రొత్తదనమనగా నిస్తంద్రత్వ రూపమే, అట్టి వానిని కోట్లకొలది సృజించు శక్తి నయనముల కున్నపుడే పాత వానియందు రోత, క్రొత్తవాని యందు మోజు ఏర్పడును. 'భ్రూధనుషా' అని చక్కని అనువాదము ఆమె బొమలనే ధనస్సున ఆమె చూపు తూపులను నిగుడించినాడు. కావున వానికి ఉభయధా అంబక ఖ్యాతి చేకూరినది.

49 చ॥ అనయము నీల కంధరము నభ్రము నన్న సమాఖ్య వారితో
నొన రియు నింత వేనలికి నోడి యని శ్చిత రూపధేయమై
చన్వియె మొగుల్ నగావళికి శబ్ద గుణంబులు నూవ్చవాని నె
ట్టిన బురి విచ్చువాని దరి డాయు జడాత్ముల కెవ్వి నిల్కడల్.

50 శ్లో॥ అప్యన్వితోఽభ్ర శితి కంధర సత్సమాఖ్యైః
తద్వేణి నిర్జితతర స్తదకల్పరూపః
అద్రోనగా నగపు దస్తి జడాత్మ నాంకిం
స్థానం సశబ్ద గుణపక్షభిదాం నటానామ్.

అభ్ర నీలకంధర పదములకు క్రమముగా ఆకాశ మయూరములని అర్థము. పై రెండు పదములకు మేఘమని అర్థము కూడాకలదు. ఏక నామము గల ఆరెంటితో (ఆకాశ మయూరములతో) ఆమె వేణికి ఓడి పోయిన మేఘము స్నేహము జేసి వాని సహాయత పొందియు తిరిగి ఓడి పోయి కొండల పాలైనది. శబ్ద గుణములు అనగా అడిన మాటలే ఆడెడి వారితో (శబ్దము గుణముగా గలది ఆకాశము, అట్టి ఆకాశముతో) పురి విచ్చు వారితో అనగా ఎప్పుడు పురులు విచ్చుచు కూర్చొనువారితో (పురి కొనని వారని భావము) (నెమిలి పురి విప్పునది కావున దానితో) చెలిమి జేసినచో జడాత్ములకు అనగా మందమతులకు విలిక్కడ లుండవుకదా లకారడ కారములకు భేదములేనందున జలాత్ములు మేఘ

ములు వానికి నిలుకడ ఉండకపోవుట సహజము, మేఘములకు వాని చెలిమి మూలమున గెల్పు మాట అటుంచి కొండల పాలయ్యే దుస్థితి ఏర్పడి నదని చమత్కారము. "సశబ్ద గుణ పక్షభి దాం నటానామ్" అనుచోట సమన్వయము క్లిష్టముగా నున్నది, సశబ్ద గుణము ఆకాశము, పక్షభిత్తు నెమలి యని అర్థము. లేక నట పదమునకే నెమలియని అర్థము గ్రహింతుమేని. పక్షభిత్ పదము నట పదమున అన్వయింపదు ఏలనన సశబ్ద గుణ అను పదముతో సమసించిన పక్షభిత్ పదము తరువాతి దానితో సంబంధింపదు "సశబ్ద గుణ, పక్షభిత్" అను రెండును మయూరార్థక నట పదమునకే విశేషణమన్నచో. ఆపుడు అభ్ర పద్ధమునకు ప్రయోజన ముండక పోవలసి వచ్చును. నట పదమునకు అనుకరించు వాడని కదా సామాన్యార్థము ఏదో వేషము వేసి అనుకరింపబూని నదని కవి ఉద్దేశమైయుండునన్నచో అపుడు శబ్ద గుణము ఆకాశము. పక్షభిత్తు నెమలి ఈ రెంటితో కూడి ఆమె వేనలిని అనుకరింప బూని చిట్ట చివరకు కొండల పాలైనదని భావము స్ఫురించుట అతి క్లిష్టము కదా.

50 సీ॥ కన్నె పాదము లజుగన్న మేటికి నైన. బాల జంఘలు వరశాలికైన
బాలోడి యనుబడు భూరివేది కినైన, బాలతి పొక్కిలి సరసులకునైన
సతి కౌను సర్వజ్ఞ మతికైన నతివచ, నవ ప్రసన్నాదిత్య కవులకైన
రమణి నెమ్మోము పూర్ణ కళానిధికి నైన, వనిత వేనలి ఫణి స్వామికైన

51 శ్లో॥ అంఘ్రీ బ్రహ్మ నిదాన వస్తు వర శాల్యాశ్చర్య జంఘే కటిం
స్తోతుం నార్హతి భూరి వేద్యనుపమాం నాభిం సరస్యావలిః
సర్వజ్ఞ ప్రతి భాచ మధ్య సరణిం భాస్వత్కవీంద్రాః స్తనౌ
వక్త్రం పూర్ణ కలానిధిః ఫణి వరో వేణీం తదేణీ దృశః

తా॥ ఆ కన్య పాదములు, పిక్కలు, కటి, పొక్కిలి, నడుము, చన్నుంగవ, నెమ్మోము, కొప్పు, అనువాని యందొక్క దానికింగల గుణములన్నియు వాని ఉపమానములయిన తంమ్మర, వరిపొట్టి, బంగరు తిన్నె, సరస్సు ఆకాశము, చక్రవాకములు, చంద్రుడు,

సర్వము అనువాని కొక్కొనికిని వరుసగా నెంత మాత్రమును గలుగజాలవు, వానిని వర్ణించుట విష్ణువు, శివుడు, శేషుడు మొదల యిన వారికే శక్యముగాదనగా నిక మా బోంట్లకు బొగడ శక్య మగునా! రాజా! నీవు కన్నార జూచితి వేని యా సుందరీ మణి చక్కదనము నీ మనస్సు నందచ్చొత్తినట్లే యగునేమో.

అజగన్న మేటి మున్నగు పదములలో అర్థద్వయము పొందుపరచబడినది అజగన్న మేటి=పద్మము, విష్ణువు, వరశాలి=వరిపొట్ట, పరప్రసాది, భూరి వేది=బంగారు గద్దె. అభిజ్ఞుడు; సరసులు=కొలకులు, రసికులు; సర్వజ్ఞమతి= ఆకాశము, శివుని ప్రజ్ఞ, ప్రసన్నాదిత్య కవులు= సూర్య ప్రసాదముగల చక్రవాకములు, దేవతా ప్రసాదముగల కవులు; సంపూర్ణ కళానిధి=పండితుడు, చంద్రుడు, వీరిలో నెవరైనను ఆమె పాదాదులను వర్ణింపలేరని భావము. అను వాదము బాగున్నది, కాని పూర్వము వలెనే 'సరసాశ్యవలిః' అని ప్రయోగింప బడినది "మనోజ్ఞాశయాః" అని మార్చిన ఉభయార్థ స్ఫూర్తి కలుగును. మనోజ్ఞములగు ఆశయము గలవారు రసికులని, మనోజ్ఞములైన ఆశయములు అని అర్థద్వయము. ఆశయ పదమునకు హృదయము సరస్సని అర్థద్వయము కలదు 'నాభిమ్' అని హ్రస్వం చేసినను గణ భంగము కలుగదు. 'అంఘ్రీ' చోట 'పాదౌ' అన్నచో సారళ్య ముండును.

50 తే॥ గుణము లన్నియును గ్రహింప గోచరింప, వనిన మముబోంట్లకును
తింప నలవియగు। కువలయాధీశ నీవు గన్గొంటి వేని, చెలువ చెలు
వాత్మ బాయక నిలుచునె మో.

51 గీ॥ లబ్ధ వర్ణ సమా కర్ణయ భవత ఈ దృశోవినా, మాదృశాం కథం
తాదృ శాంగవర్ణనే నిపుణతా జ్ఞాతతావా.

ఇది పై సీస గీతమున కనువాదము. గీతము యొక్క ఉత్తరార్థ భావ మనువదింపబడలేదు.

52 తే॥ చిత్తజా కారయాచెల్వ చెలుల చెల్వ, మలవియె మతింపవారు వామాక్షివలన। గలికి చూపులు ననవద్య గతులు బొరయ, గదిసిన సురాహి రాజన్య కన్య లొక్కొ.

శ్లో॥ కథం తథాలీః కథయే స్మరాథ వామేక్షణాయా వరటా గతాయాః
విలాస వీక్షా విల సద్గతాప్త్యై శ్రితా బుధాహీశసుతా నుతాః కిమ్.

తా॥ దేవతా కన్యలు ఱెప్పపాటు లేని చూపులుగలవారు. నాగకన్యలు పాద ప్రాచారము లేనివారు కనుక రెప్ప ల్లార్చెడు (కులుకు) జూపులను పాదములచే నడచెడు (మురిపెపు) నడలను ఆ పడతివలన నేర్చు కొన వలయునని వచ్చిన నాక నాగ కన్యలు గాని, సాధారణ మానవ కన్యలు గారు సుమా యని తాత్పర్యము.

వరటా గతాయః యను నది యతి పూరణకు వచ్చినది. అద హంస నడక గలదవి అర్థము. నాకకన్యలు రెప్పపాటులేని చూపులు గలవారు నాగ కన్యలు పాద ప్రచారము లేని వారు. కలికి చూపులను, మురిపెపు నడకలను ఆ యువతి వలన నేర్చుకొన వచ్చిన నాక, నాగకన్యలేగాని, నరలోక కన్యలు కారు సుమా! ఆమె చెలి కత్తెలని భావము. అనువాదము మూలానుగుణముగా నున్నది.

53 శ్లో॥ ఆ లావణ్యవతీ మణుల్ గొలువగా నాలేమ యా కోనలో
నాలీలాళవనంబులో ననఘకంఠాలప్తి సౌభాగ్యముల్
వ్యాలోలాంగుళి సంజ్ఞచే గఱపు తేవన్ వీణ బల్కించునా
యాలాపంబె గిరిన్ దరీముఖరయై యాలింపగా నయ్యెడిన్.

54 శ్లో॥ తాసాం నిజా లాప విధాం తయాలం
సం శిక్ష యంత్యాంగులి సంజ్ఞయైవ
ఆ స్ఫాలి తాయా మతులం విపంచ్యా
మాలాప మ ప్రౌష మమంధ మ్మోదమ్.

తా॥ ఆ చెలువ యా సుందరీ మణులు గొలుచుచుండగా మునుపు చెప్పిన యా కోనయందా క్రీడా భవనమున నిర్దుష్టమయిన తన కంఠ స్వరపు రాగ సౌభాగ్యములను శ్లాఘించి సైగలు చేసి వీణకు జెప్పించుచున్నదోయన్నట్లుగా వాయింపగా నారాగ సంచారమే యీ కొండయందు గుహలలో ప్రతిధ్వనించుచు మనకు విన వచ్చుచున్నది.

తయా వివక్ష్యామ్ అస్ఖలితయామ్ సత్యామ్ ఆలాపమ్ ఆశ్లేషమ్, అని సమన్వయము ఆమె చెలికత్తెలకు నిజాలాప విధానమును గరపుచు వీణ వాయించుచుండి ఆ ఆలాపమును వినిపించినది. అర్థము గ్రహింపవలసి యున్నది. "సమీర యంత్యా విహితం విపంచీమ్" అన్నచో శబ్దించి యుండదు. విపంచిని వాయించుచున్న ఆమెచే నొనరించబడిన ఆలాపమునది అర్థబోధ తేలికగా కలుగును. శిక్ష ధాతువు ద్వికర్మక మన్నచో "సఖీర్నిజాలాప విధాంతయాలమ్, అనియు మార్చవచ్చును.

54 ఉ॥ స్వైరవిహార ధీరలగు సారసలోచన లున్న చోటికిన్
బోరన లాతి వారు చొరబూనినచో రసభంగ మంచునే
జేరక పువ్వు దీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు క
న్నారగ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకు దెల్పగన్.

55 శ్లో॥ స్వేచ్ఛా విహార వనితా జనతా సమక్షం
సద్యోగతిర్న సరసాఽన్యజనస్య హీతి
వీక్ష్యైతి పుష్పితలతా వివరాత్ తదీయా
రూపం వివక్ష రసు రూప తవాగతోఽస్మి.

తా॥ 'ఆ సుందరీ మణులు' దిట్టలై విచ్చల విడిని గ్రీడించుచుందురు వారు. అట్లువారు క్రీడించుచున్న చోటికి మొదలె పోరాదు; మఱి ముందెరుక చేయక తటాలునను బోరాదు, అట్లితరులు చొచ్చినచో సారస్యము చెడిపోవును, అని నేను వారి యెదుటికి బోవక పువ్వు

తా॥ ఇట్లా చెలికాడు విన్నవింపగా గాన ధ్వనికంటె నతని ప్రియ వాక్యమే యా చెలువ యున్న కోనకు బోవునట్లు త్వర పుట్టించెను తుమ్మెదలు ఝంకృతులు చేయగా నపుడవి యా ప్రియ వాక్యము కంటె మఱింత మరులు నింపెను-

పూర్వము విన్న సంగీత నాదా నందము కంటె సుందరీ మణియున్న తావును చూచి వచ్చి వర్ణించెడి చెలికాని సరసోక్తి అమె యున్న చోటికి పోవ త్వర పెట్టెను. మదన శింజారవ రూపములైన భ్రమర ఝంకారములు నర్మ సచివుని మాట కంటె మరింత మరులు నించెనని మూలము. ఉత్తరార్ధమున సహోక్తి పేర్కొనబడినది. అదియు మూలమున లేదు. ఆ చెలికాని మాట కంటె భ్రమర ఝంకారము అధికోత్సుకవి జేసెనని ఉత్తరోత్తరోత్కర్ష మూలమున చేయబడినది. ఆప్త వాక్కుతో గూడ భ్రమర ఝంకారము అను రాగము కలిగించినది, అని అనువాదము చేయబడినది. పూర్వార్ధమున అలి లారవము కంటె రమ్యమై నర్మసచివుని మాట గమనత్వర కలిగించెనని పేర్కొని తిరిగి ఆప్తుని మాటతో గూడ భ్రమర ఝంకారము అనురాగము కలిగించెనని పేర్కొనుటలోను సారస్య మగుపడదు.

పూర్వం శ్రితాదపి తదుక్తి ర పూర్వ గీతాత్ కన్యా దరీజిగమిషాం రుచిమాచకార, అనంగ చాప గుణ టంకృతి రాప్త సూక్తే రప్యాతనోన్నర పతే రధికానురాగమ్, అని మార్చిన మూల భావము స్పష్టముగా బోధపడును. కాని అనువాదకుని యతి భంగపడును.

56 తే॥ కిన్నర విహంగ యుగళిచే మున్ను విన్న, సన్నుతాసన్న శుభద ప్రసన్న ఫణితి। మదికి సరిదాక ముదమున బొదలిమేది నీపతి హితాగ్రణివి ద్రోవ సూపుమనుడు.

57 శ్లో॥ పూర్వ శ్రుతేన పురత శ్శుభ సూచకేన
విస్రంభి కిన్నర విహంగయుగీరుతేన
ఆనందినా క్షితి భృతాఽధికమా దృతస్తా
మా దర్శయ త్సరణి మాప్త కులా వతంసః

తా॥ మునుపు కిన్నర పక్షుల జత వలన దనకు దోడనే యొక శుభముగలు గునని విన్న పలుకుబడి యపుడా మంత్రి చెప్పిన దానివలన దన మన సునకు సరిపోయినదని తోపగా, సంతోషముచే మురిప్పొంగి యా వసురాజు తన మేటి హితుని దారిచూపుమని చెప్పెనని భావము.

మునుపు కిన్నర పక్షులవలన తనకు తోడనే శుభము కలుగుననని విన్న మాట నర్మ సచివుడు చూచి వచ్చిన దానికి సరిపోయినదని సంతోషించినవాడై రాజు దారి చూపుమని తన చెలికానడిగెను. అనువాదమున, ఆహ్లానందపడి రాజు ఆదరింపగా నర్మ సచివుడు త్రోవ జూపెను. ఆదరించుట యనగా గౌరవించి అడిగినాడని గ్రహింపవలెను. 'యుగీరుత్తేన' అనుచోట 'యుగోదితేన' అన్న సరసము గా నుండును, అట్లులే 'పూర్వ శ్రుతేన' చోటకూడా 'పూర్వం శ్రుతేన' అని మార్చుట యుక్తము. ఉదితేన=ఉక్తిచే అని అర్థము.

57 సీ॥ ఈ రాల బోరాదు హేరాళము జవాది, యీరాల నడు చక్కనేగ వలయు। నాకాననేకాల మదరు దేసియవాన, లాకాన నేర్పున నరుగ వలయు। నీవంక నేవంక నెనసిన తుహినాంబు, లీవంక బూదెప్ప నీద వలయు. నా మూలసును మూల తా మొత్తములచ ఖు, లా మూలముగ దీవ లంట వలయు.

తే॥ నధిప యిది మాని కపు గోన యది లతాంత, తజము సాదువయిది కప్పూరం పుటనటి। చప్పురం బిల్లపాది కాంత సదన మనుచు, నర పతికి దెల్పె నరుగుచో నర్మ సఖుడు.

58 గ॥ అమీప శిలాతలేషు విపులేషు సంకుమద పంక సంకులేషు గమన మను ప పన్నం,। వంజుల తాతి మంజులే సుమపుంజ రంజిత నికుంజ యుగలాంతరాల పద్యయా నయా। గంతవ్య మ్, తద్వనం సతత మధువర్ష మోరాసార సాంద్రతరం తేన దలకులావరణ సాధన వహన తాళశలేన యాతవ్యం, ఇవా సర్వతో గభీర ఘుర భూమా వహార తుషార పూర వారః, తేన పితత్రేన సచేన సుమప్లవేన జవేన తరణీయః, తత్ర శత కోటి సదృశ శిత కోటి విలస

దష్టాంగ వజ్రోపల పటల సాను వలయం తదా మూలం అతా జాల మవలంబ నీయం, రాజ శిరోమణే విలోక్య తామిదం మాణిక్య కందరమ్. ఇయం పరాగా రోహ భూమిః, ఏతద్ఘన సార కదలికా తను కాయ మానమ్, ఏష సుధారా విశేషః, ఏషాజ్యోతిర్లతా సంతతిః, ఇదం సిద్ధౌషధీ మహా స్థానమ్, "అదో" దివ్య సిద్ధాంజన రస ఘుటికా ఘటిత మందిరమ్, అయం సకలజన వశీకరణ నిపుణ మణిరాశిః, అసౌ అనల్ప లతికామంటప స్తదేవ రమణీ మణి రమణీయ లీలా సదన మితి రాజ్ఞే సఖా చిరం ప్రజ్ఞాపరావాసో విజ్ఞాపయా మాస ఆ మూలనున్నట్టి వజ్రమణుల చరియలున్నవి. వాని మీద వెళ్ల నపుడు జారుట కవకాశమున్నది. కావున తీగలను బట్టుకొని దిగవ లయునని మూలము. "శత కోటి సదృ శశిత కోటి విలస దష్టాంగ వజ్రోపల పటల సాను వలయమ్" అనుచోటి "శతకోటి" పదము పై భావమును వెల్లడింపదు. కుర్రిచ్చుటను మాత్రమే ఆ పదము సూచించు కాని నునుపును తెలుపదు. శతకోటి సాదృశ్యము కొరకు శతకోటి పదము వచ్చినది. ఇవి రెండు నునుపును బోధింపవు కావున అతి విమల దర్పణ సదృశ మసృణతర కులిశ శిలాతలలలితం సాను వలయమ్. అనుట యుక్తము.

59 క॥ కుతుకమున, నచల సుతయగు, సతి గన జనురాజమౌళి చాడ్పున నపుడా, క్షితిపతి సతి జూచుతమిన్, హిత సూచిత సరణి గాన కేతెంచు నెడన్.

60 శ్లో॥ సతీ మ చల సంజాతాం సహర్షం రాజమౌళి వత్
సఖీ రిత సరణ్యా తాం సతీం ద్రష్టుం యయౌవిభుః

తా॥ పర్వత పుత్రిక యైన పార్వతిని జూడబోవు శివునివలె నా వసురాజు పర్వత పుత్రిక యైన యా పడతిని జూచుటకు ప్రియ సఖుడు జూపన దారిని బోవునపుడు.

ఇది ప్రక్షిప్తమని కొందరందురు నాయిక కుల గోత్రాదులు రాజునకు తెలియనపుడు అచల సుతాత్వము చెప్పుట విరుద్ధముకదా అనివారి విప్రతిపత్తి వాస్తవముగా ఇందు విప్రతిపత్తి పాదింప తగిన అంశము లేదు. అచల సంజాతయగు పార్వతిని పరమేశ్వరుడు చూడబోయినట్లు, రాజు ఆ కన్యకను చూడబో యెనని సామాన్యార్థము. ఇందలి పదములు అనుకోకుండ అర్థాంతరము నొసగు చున్నవి. ఈ పద్ధతి పలుకావ్యములలో కన్పట్టును దీనినే సూచ్యార్థ సూచన మందురు మరియు ఈ మాట రాజు నోటి నుండి వెలువడలేదు. ఇది కవి వాక్యము కాబట్టి ఉభయథా విప్రతి పన్నుల శంక పొసగదు. ఇట్లే తరువాతి పద్యమున గూడ అనుకోకుండ అర్థాంతరము స్ఫురించుచున్నది.

60 సీ॥ ప్రకటి తోన్మేషకీ పద్మిని కినకర, కౌతు కావాప్తి వేగనె ఘటించు
దతవయో విభవ కీలత కూన కాసన్న, పున్నాగ విహృతి గొబ్బునసె
యబ్బు. విలసితా మోద కీ కలికి కొమ్మకు రాజ, సారంగయోగ
మీక్షణమ కల్గు. భువ నాభి వంద్య కీ నవరస సరసికి, మానస
ప్రియ లీలతోవ ద్దొరకు.

తే॥ ననుచు దమలోన లేదోట లరయు మగువ, లాడు నుడువులు విన
నయ్యె నదియెటింగి, నృప యుపశ్రుతివింటివేయిచటననుచు,
నాప్తుదెరిగింప నధిపుడపుడు.

59 గ॥ పంకజ లోచనే ప్రీథితోన్మేష శాలిన్యా ఏ తత్పద్మిన్యా ఇనకర కౌతు కావాప్తి రిదానీ మేద భవేత్, మంజు వాణి విహిత తర వయో విభవాయా మహిలా లతాయా। ఘనాసన్న పున్నాగ విహారో ఘటి తాతి జవేన, లలనా శిరోమణీ లలితా యోద మేదురాయా ఏ తల్ల సత్పలవ పంచ శాఖాయా రాజ సారంగ యోగోలభేదతి రయేణ, భువన సుందరి భువ నాభి నంద్యాయా ఏ తన్నుతరుచి సరస్యుత్ర మాయా మానస ప్రియలీలా మహా వేగేన లగే దితి పరస్పరం భాషమాణ నవ పాలికా పుష్ప లావికా వచనామృతావి నమాకలయ్యే వరోప శ్రుతి పరం పరా కిమ శ్రావీతి నర్మ సఖేన బోధితో మహానందపూరితో నికామం సరాజా రరాజ.

గద్యమున కుండదగిన కాంతి లేదు. వేగనే ఘటించు అనిమూలము. వేగనె పదము త్వరగానే, ప్రాతః కాలముకాగానే, అని అర్థద్వయమును బోధించును. తామర తీగకు సూర్య కిరణ ప్రాప్తి తెల్లవారగనే చేకూరునని సామాన్యార్థము పద్మినీ జాతీయయగు-గిరికకు రాజ పాణి గ్రహణము అచిర కాలముననే సిద్ధించునని ఉపస్కృతత్వర్థము ఈ సొగసు "ఇదానీ మేవ", అను మాటలో లేదు, "ఇదానీమ్, కన్న" సద్యః, పదము సముచితముగా నుండును. అతి జవేన వేగేన అనునవి తెలుగు మాటల ప్రభావమున వచ్చినవి సంస్కృతము నందు త్వరార్థమున వీని ఉపయోగ మరుదుగా నగుపడును 'మహిలాయాః, అన్నచాలు 'లతా' పదము అర్థాంతరమున సమన్వయింపదు 'పల్లవ పంచ శాఖాయాః' అనునప్పుడు పల్లవముల వంటి పంచ శాఖలు (వేళ్లు) కలదను అర్థము అతి కష్టముగా స్ఫురించును. శాఖా పక్షమున పంచ పదమునకు ప్రయోజనము లేదు. విస్తృతమను అర్థమును సాధించినను ప్రయోజనము శూన్యమే యగును 'పల్లవ శ్రీకర శాఖాయాః" అన్న సరిపోవును, పల్లవములకు శోభ కలిగించు శాఖయని కాని, పల్లవ శోభాంచువులు గల శాఖయని కాని అర్థము సిద్ధించును. శాఖావలంబము వలననే పల్లవములకు శోభ కలుగును. శాఖను విడినచో పల్లవములకు శోభ ఉండదు కదా. అట్టులే పల్లవ శ్రీగల కర శాఖలు గల యువతి యని అర్థాంతరము గూఢ నిర్బాధముగా స్ఫురించును, 'లభేత్' అని లభ ధాతువు పరస్మై పదిలో నుండదు. ఇది ఆత్మనే పదికి జెందినది. 'లభేత' అని మార్చుట యుక్తము. కనీసము దీనినైన సంపాదకులు మార్చ లేదు ఇట్లు మాట్లాడుచు వారు ఉద్యానమును పరిశీలించుచుండిరనియే మూలము. పుష్పలావికా వన పాలికలకలిమ వారిని అనువాదకుడు మార్చినాడు. మూలమందలి సరసి పదమునకు సరస్సనియే అర్థము. స్త్రీలింగ సారస్యము వలన సర ముఠాలని అర్థము ఆక్షిప్తమగు నని గమనింపవలయును సృ, ధాతువునకు 'అసున్' రాగా 'సరస్' అని యగును. దీనికే మహా సరస్సను అర్థమున జీప్ రాగా సరసీయను రూపమేర్పడును. కావున 'సరసీ'యను పదమునకు మహా స్సరస్సనియే అర్థము. సరసురులని కాదు. స్త్రీ లింగ సాదృశ్యమును బట్టి పరసురాలను నది ఆక్షిప్తమగును (ఈకారమునకు ఆకారము శ్లేషలో రావచ్చు).

60 తె॥ తొలుదొలుత భద్ర కుంభముల్ దోప బిదప
బచ్చు టామానికపు నిచ్చ పచ్చ తోర
ణంబు వొడ సూప వరుస గన్యా గృహంబు
నరపతి కమూల్య కళ్యాణ గరిమ దెలిపె.

61 శా॥ ఆలో గాంచన మందిరంబు నవరత్నా లోక ముల్లోకమై
యాలోకోత్సవ మాచరింప బతి డాయం బోయి ప్రాచీన పుం
జా లిందీవల చాటునన్ నిలిచి వాచాలాళి పక్షినిలా
లోల త్పల్లవ జాల మార్గముల నాలో లాక్షివీక్షించినన్.

తా॥ ఆ బంగారు గృహమందు దాపియున్న తొమ్మిదవ గల రతనముల కాంతులు। లోకాతీతమై కనుల పండువులు సేయుచుండగా రాజు సమీపించిపోయి చుట్టును। జాలుపులుగా నున్న తీగలచేనయిన కంచె కోట మఱుగున బొందుండి తమ్మెదల తెక్కల గాలిచే నందలి చిగుళ్ల జొంపములు తెఱపులియ్యగా నాసందుల నుండి యా పడతిని జూచెను (ముందరి పద్యముతో నన్వయము).

62 శ్లో॥ కన్యామణిం కనకరత్న కనన్ని శాంత
ప్రాంతావనౌ స నివసన్ ప్రభు రాదదర్శ
ప్రా చీన వల్లి, పిహిత ప్రరుతాళి పాలి
పక్ష నిలాతి చల పల్లవ జాల మార్గైః

"ఆలోకాంచన మందిరంబు........ పతి డాయంబోయి''. అను మూల మునకు "ప్రాంతా వనౌ సనివసన్ ప్రభుః" అని మాత్రము సంగ్రహముగా అనువాదము చేయబడినది "ప్రాచీన వల్లి పి హితః. అని వ్యస్తముగా రాజునకు విశేషణము జేసిన అర్ధక్లేశ ముండదు.

63 మ॥ జన నాథోత్తము డింతి జూడ ననిమేషత్వంబు గాంక్షించున
య్యనిమేషత్వము కాంత కాంతముఖ చంద్రాసేవ నానందవా
సన బ్రాపించిన గోరు నప్పు డనిమేష స్వామి భావంబుగ
న్గొన నెందున్ నృపులుత్తరోత్తర పదా నూనస్పృహా చంచలల్.

63 శ్లో॥ ఆ దౌ సమీక్షితు మిమా మనిమేష తాళః
పశ్చాత్త దాన నని శాపతి దర్శనేన
ఏషోఽ నిమేష భావ మియేష, భూపాః
కామ్యోత్తరోత్తర పదాధిక కాంక్షిణోహి.

కాంత ముఖ చంద్రా సేవనా నంద వాసన బ్రాపించినగాని అని మేష స్వామి భావము గోరుటకు వీలుపడదు. ఇది అనువదింపబడలేదు. ఆమెను దర్శించుటకై మొదట అనిమేషత్వము గోరినాడు. ఆ అనిమేషత్వము ఆమె ముఖ చంద్ర కళామృత సేవనానంద సంస్కారము వలన సిద్ధింపగా అపుడు అనిమేష స్వామి భావమును గోరెనని భావ నాక్రమము చెప్పబడినది. "అవిమేష తాళః తదాన నని శాపతి దర్శనేన", అన్నంత మాత్రమున ఆ భావనకాని ఆ భావముకాని అభి 'వ్యక్తముకాదు' 'ఆదౌ విలోకితు మిమామని మేషభావం' తస్మింశ్చ తన్ముఖ సుధాకర సేవనేన సిద్ధేఽనిమేషపతి భావ మియేష భూపః, అవి మార్చిన కొంత స్ఫూర్తి కలుగుతుంది.

తే॥ కాంత పదమొంది యట యూరు గ్రమ్మి కాంచి, సీమనెనసి పయోధర శిఖరిదుర్గ సంగతికి లాచు నృపదృష్టి చక్రశాన, నోన్నతస్థాన మపుడుగా యొదవు దనకు.

65 శ్లో తస్యాః పదం ప్రథమత స్తద నూరు సీమాం
కాంచీ మథేత్య కమనీయ మహీశ వీక్షా
పశ్చాత్ పయోధర సుదుర్గ పరాయణాఽఽసీత్
చక్రాతి శాసన పణోచ్చ పదంహి కామ్యమ్.

రాజు దృష్టి ముందుగా పాదములందు ప్రసరించి తర్వాత తొడల నాక్రమించి ఆమీద కాంచీ ప్రదేశ (కటిని) మును జేరి అక్కడి నుండి దుర్గమ మగు కుచములతో కూడుటకు పెనుగులాడు చుండెను. కాంచీ ప్రదేశము వరకు ఒకలాగున వచ్చి అక్కడి వక్ష స్థలము దాటి పోజాల కుండెను. ఆ దుర్గమ కుచ సంగతి మొదవి నపుడు గాని తనకు (దృష్టికి) చక్రవాకములను నిర

సించెడి కుచోన్నత స్థితియబ్బాదు. నిరాశ్రయుడైన వ్యక్తి ఒక చిన్నపాటి పద విని సంపాదించికొని ఆ పిమ్మట గ్రామము నాక్రమించి పిదప ఒక సీమను వశపరచుకొని అక్కడి నుండి పర్వత దుర్గముల సంపాదించు కొనుటకు ప్రయత్నించును 'అపుడుకాని అతనికి రాష్ట్ర పాలకత్వము ఒనగూడదని అప్రస్తుత విషయము సమాసోక్తి మూలమున వ్యక్తపరచ బడినది. కాంత పదము కాంత యొక్క కాంతమగు పదమని అర్థము ఊరు అనునది సంస్కృతమైన పుడు, తొడయని తెలుగైనపుడు గ్రామమని సంస్కృతాంధ్ర శ్లేష. ఇది సంస్కృతమున రాదు. కాని కాళహస్తి కవి ఊరు సీమ ఊరు సీమ యని సంధి కృతముగా అర్థద్వయమును స్ఫురింప జేసినాడు కాంచీమ్, అనునపుడు మొల నూలు (తదాశ్రయ మగుకటి) కాంచీ నగరమని. అర్థద్వయమును సంధించినాడు. అనువాదము చక్కగానున్నది. 'చక్రాతి శాసన చణోచ్చ' అనుచోట 'చక్రైక శాసన మహోచ్చ' అనుట యుక్తము.

65 మ॥ నిరతిన్ నాభి సురంగ మీగియు వళీనిశ్రేణికన్ హత్తియు
స్వర రోమావలి వల్లరీగ■ము నంటం బ్రాకియుం దత్పయో
ధర దుర్గంబుల నాక్రమించె నచలేంద్ర ద్వేషి చూ పౌర సం
గర సామోద వినిద్రవృత్తికి నశక్యం బెద్దియుం గల్గునే.

66 శ్లో॥ నాభీ సురంగక వలిత్రయనా మహేమ
నిశ్రేణి రోమలతి కా గుణతస్త దీక్ష
ఆక్రాంత భీరు కుచ దుర్గ భరాఽఽఽన కింవా
సాధ్యంన సంగర సమోద వి నిద్ర వృత్తేః

రాజు దృష్టి నాభి బిలములో దూరి వలిత్రయమును హత్తుకొని రోమావలి వెంట బ్రాకి కుచలముల మీద ప్రసరించెను. ఎవడేని శూరుడు సొరంగము ద్వారా దూరి పోయిగాని నిచ్చెనల తోడ్పాడు చేగావి త్రాళ్ల వెంట ఎగబ్రాకి కాని దుర్గమును సాధించునను అప్రస్తుత విషయము స్ఫురించుచున్నది. అను వాదము మూలాను గుణముగానన్నది. కాని నామ హేమ పదములు పాద పూర ణార్థకములుగా నున్నవి. కాంతా వాచకమైనపుడు భీరూయని ఉండును, భీరు అని

యుండదు! భీరువుల యొక్క దుర్గములను అర్థమున భీరు పదము ముపయోగ పడ వచ్చును. కాని కాంతార్థమున భీరూ అని యుండదు. భీరూ కుచాక్రమణము ప్రకృతము, ప్రకృతార్థముననే భీరూ అని ఉండవలెను. అప్రకృతార్థమున దీర్ఘము హ్రస్వముగా జేసికొనవచ్చును శ్లేష స్థలమున దోషము కాదనునది అప్రకృతార్థమున (దీర్ఘము హ్రస్వము జేయుట) సమన్విత మగును. "తస్యాశ్చనాభి బిల తస్త్రివలీ మయోరు నిశ్రేణి రోమ లతికా గుణస్తదీక్షా" ఆ క్రాంత క్రమ కుచ దుర్గ భరాఽఽన" అని మార్చుట యుక్తము.

సంగ+రస మోదయని, సంగర+సమోదయని, ఉభయార్థ ద్యోతన చేయబడినది.

66 ఉ॥ ఆమనుజేంద్రు చూపు తిల కాంచితమై నెఱదావి చల్లునా
రామ ముఖంబునన్ నెఱయ వ్రాలుచు హాస మరంద చిక్కణం
బై మెఱుగారు గండపుల కామృత భాను శిలా తలంబుల
న్వేమఱు జాఱి యూతగొను నిద్దపు బెన్నెఱి తీవ జొంపముల్.

68 శ్లో॥ దష్టి ర్విభో స్స్ఫుర భిలే తిల కాంచితే సా
రామాననే స్మిత సుమాంచత లంబమానా
గండ స్థలా ద్విధు శిలా మసృణాత్ గలంతీ
వ్యాలంబ తేస్మ కచ భార లతా వితానమ్.

తా॥ వసు రాజు యొక్క చూపు, కస్తూరీ తిలకము చేత శోభిల్లుచున్న నాయిక ముఖము సౌందర్యము నంతయు గ్రహించుచు, నవ్వు చేత దట్టమైన తళతళ మెఱయుచును జంద్ర కాంత మణి శలకములవలె నున్న చెక్కిళ్ళ యందు నిబ్బరముగా నిలువలేక జెనికి పోవుచును నిగారమయి సొగలైయున్న తల వెంట్రుకలపయి వ్యాపించి నిలి చెను తుమ్మెద తిలక వృక్షముచే నొప్పారు పుష్ప వాసనలు గుబా ళించుచున్న యుద్యానము నంతటను వ్రాలుచు మకరందము చేత నునుపువాఱి యున్న చంద్రకాంత శిలల యందు వ్రాలి యచ్చోట నిలువ నవకాశము లేక తీగ గుంపులను నవలంబించి యుండుట యుక్తమని యర్థాంతరము నందలి భావము.

రాజు దృష్టి కస్తూరీ తిలకాంచితమై సువాసన లోలుడు ఆ కాంత ముఖ సౌందర్యమును సేవింప వ్రాలి చంద్రకాంత మణులవలె నున్నవై తళతళ మెరయుచున్న ఆమె చెక్కిళ్ల యందు నిబ్బరముగా నిలువలేక జెనికి పోవుచు అందమైన ఆమె సోగ వెండ్రుకలపై ప్రసరించి నిలిచెను తుమ్మెద తిలక కుసుమ విరాజితమై సువాసితమైయున్న ఆ రామాగ్రమున విహరించుచు పూదేనియచేనునుపువారి యున్న చంద్ర కాంత శిలలందు వ్రాలి అచ్చోట నిలువ లేక అవలంబించునని రెంటికి రూపణ చేయబడినది. 'సారామాననే' అనుచోట సా+ఆ రామాననే, అని సా+రామా అననేయని సభంగ శ్లేష సంధి కృతము. హాస మరంద చిక్కణంబై "గండ ఫలకామృత భాను శిలా తలంబులన్" వేమరు జారునని మూలము. మొదలే నున్ననిది, అందులో హాస మరంద చిక్కణములైనవి కావున నే వే మారు జారుచున్నదని మూల భావము. స్మిత సుమాంచితమగు ఆరామాననమున లంబ మానమై. దృష్టి విధు శిలవలె నున్నగా నున్న గండ స్థలమున నిలువలేక జారుచున్నదని అనువాదమున కొద్ది మార్పు చేయబడినది. తిలకాంచితే సుమాంచతి లంబమానా వ్యాలంబతే యని పునరుక్తి చేయబడినది. స్మిత మందు మరంద త్వారోపణ మూలమున చేయబడగా అను వాదమున స్మిత మందు సుమత్వారోపణ చేయబడినది. "స్మిత మరందరసై స్ఫురంతీ॰ స్నిగ్ధాత్ కపోల శశికాంత తలా ద్గలంతీ" అని మార్చినచో మూలానుగుణముగా నుండును. మరియ పునరుక్తి కూడా తొలగును.

69 సీ॥ ఘన లక్ష్మి నెసగు నంగన ముంగురులపేర, భ్రమరకంబులు
ధాత్రి బ్రిబలబోలు। గమలావళి నదల్చు విమలాంగి మోముతో,
నొనగూడి సన్మిత్రుదొవర బోలు॥ నమృత సంగతమైన యతివ
చక్కెర మోవి, నీడయ్యె బింబంబు నెగడబోలు। మేల్మిగట్టు లొ
మెలత చన్నుల కనుం, గ్నై గోత్రి వర్గ మింపలరబోలు.

తా॥ ఈ స్త్రీ ముంగురులు మేఘ కాంతిచే నొప్పుచు దుమ్మెదల వలె వెల యుచున్నవి. మొగము తామరల ధిక్కరించి చంద్రుని వలె వెలయుచున్నది. చిక్కెర మోవి యమృతముతో గూడినట్లు తీయనై దొండ పండు వలెనున్నది. చన్నుదోయి బంగారు కొండలవలె

వెలుగుచున్నది. చేతులు హారములవలెను, గటి చక్రము బండి కల్లు వలెను, అడుగులు తామరలవలెను, గోళ్లు పుష్పముల వలెను విలసిల్లు చున్నవని భావము.

70 శ్లో॥ ఖ్యాతావాఽలక నామతో భ్రమరకా స్స్ఫీతా ఘన శ్రీకరాత్
కంజా తారి ముఖాదరా ద్వి ధుర భూత్కింజాత సన్మిత్రకః
ఛాయాత్మా స్మధురా ధర స్య యువతే రాయ్యాన్ను బింబం ప్రథాం
తుంగో లోజ సనాభి తాను సరణాత్కిం గోత్ర వర్గా ధరాః

తుమ్మెదలు ముంగురులు వానికి భ్రమర కాది నామ సార్థకత నిరూపింప బడినది. ఘనలక్ష్మి నెసగా అనుదానికి ఘన శ్రీకరాత్ అని అనువాదము గొ... వారి పేరు పెట్టుకొనుట లోకమున సహజము అట్టులే తుమ్మెదలు భ్రమరక నామమును ధరించినవి. ఘనలక్ష్మి తమ కంటె వానియందుండుటయే కారణము ముంగురులు ఘనలక్ష్మిని అనగా మేఘకాంతి నెగ్గునవియు, తుమ్మెదలకు ముంగురులకును సమముగా భ్రమరకములను పేరు కలదని భావము. జాత సన్మిత్రకః. అనునది "సన్మిత్రుణ్ణి నర బోలు" అను మూలమునకు అను వాదము చనుల్లు మేఖిమి గట్టు లైనవి కావున తద్గోత్రఖ్యాతిని గిరులు బడసి నవని మూలము. మేలిమి గట్టులను నది అనువాదమున లేదు. మరియు గోత్ర వర్గా ధరాః అనుచోట సమన్వయము కుదురుట లేదు అలక నామతః ఘన శ్రీకరాత్ః అనుచోట ఘన శ్రీని కల్గించు అలకలు అను నామము గలవాని నుండి అని అర్థము గ్రహించవలసి యుంటుంది.

ఖ్యాతాః కించికుర వ్రజాత్ భ్రమరకాః స్ఫీతా ఘన శ్రీవహాత్ అని మార్చుట యుక్తము. కింజాత సన్మిత్రకః అనుచోట "కింజాతవాన్ సతసఖ". అని మార్చిన బాగుంటుంది. అట్టులే "తుంగ గోరోజ సుమేరు బంధు విభవాత్ కిందోత్ప వర్గాః శ్రుతాః" అని మార్చినచో మూలభావ స్పష్టత ఏర్పడుతుంది.

69 తే॥ సాటి రాబోలు సతులు భుజాలతలకు, జక్ర మేల్పడి గాబోలు జఘ
నరమకు। దమ్మిలుపదాను జన్మ లై తనరబోల్చు భ్రమ సవములు
గాళ్ల నిసువులై యెసగబోలు.

70 శ్లో॥ ప్రసజ స్సమానా హి గుణైర్భు జాభ్యాం
చక్రం స్వ రక్ష్యం ను నితంబలక్ష్మ్యాః
సరో వరాణ్యం ఘ్రి సమోద రాణి
నఖాభి జాతా ప్రసవాలి రస్యాః.

ఇది పై సీస గీతానువాదము. సరులన్నది సరి పదమునకు బహువచనము హారములు సమానములని అర్థద్వయము చమత్కార మనువాదమున స్ఫురింపదు తమ్ములు పదానుజన్ములై తినరబోలు ననుటకు సరోవరాణ్యం ఘ్రి సమోద రాణి, అని అనువాదము సరస్సులో శ్రేష్ఠములైనవి (కమలములు) అంఘ్రి సమోదరములని దీని అర్థము 'పదాను జానీవ రసాసు జానీ, అన్న బాగుండు నని తోచును.

71 చ॥ బలితపు గుబ్బ గుబ్బలులపై......

72 శ్లో॥ తస్యాః కుచాచల తటాగ్ర తలాశ్రయస్య
విద్యుల్ల తాభరణ దీప్తి విభాసు రస్య
ఆరావ మూకిత పికస్య హృ తాబ్జపూగ
కాంతే ర్గలస్య నకి మర్హతి కంధరాంకః,

72 క॥ కంధర పదమునకు మేఘము కంఠము అని అర్థము. మేఘమువలె కంఠము పిత్రములకు మూకత్వము, అబ్జములకు కళా రాహిత్యము కల్గించును, కావున కంఠ రాహయము కంఠమునకు చెల్లుట యుక్త మని భావము అనువాదము సరసముగా నున్నది.

72 మ॥ సమదా భంగమ నోజ సామజ మురోజ గ్రావ లీలాధి క
క్లమమై నాభి సరోంతరంబున మునుంగం బొంగు నుద్వేలభం
గము లయ్యేన్ వలంత రాలమున ధర్గం ధాను బంధంబు చే
న మరుందుమ్మెద చాలు నా నొనరె నూ గా రింతిలేగౌనునన్.

73 శ్లో॥ కందర్ప మత్త కరిణీ పృన శైల వప్రి క్రీడా శ్రమేణ కృత నాభి సరోవగాహే, ఉద్వేల వీచి వలయోల్ల భవద్ధంత రాలే తద్గంధ సంస్యూలితతిర్మ్యాను రోమరాజిః.

భావము చక్కగా గ్రహింపబడినది. వీచి వలయో భవత్. అనుచోట ఆ భవత్, అనునది. సంపాదకులచే పూరింపబడినది. వలయః అనునది ఏక వచనమని భ్రమించి 'అభవత్' అని పూరించి యుందురు, వలయః అనునది వలి-శబ్దము యొక్క బహు వచన రూపముకాని, స మూహ వాచక వలయు శబ్దము కాదు. మరియు అన్నిచోట్ల ఉపమేయములు ముందు పేర్కొనబడినవి కాని, వీచి వలయః అనుచోట ఉపమేయమగు వలి పదము ఉత్తర పదముగా కూర్చబడినది. ఇట్టి చోట ఉప మిత సమాసమారూపక సమాసమా అను శంక కలుగక పోదు (మన్మథుడను మత్తకరితునియా లేక మత్తకరివంటి మన్మథుదనియా ఏది చేప్పవలెనను శంక కలుగును) ఉపమిత సమాన మాశ్రయించినచో మత్తకరి, అప్రధానము, మన్మథుడు, ప్రధాన మగును. అపుడు మన్మథునకు వప్రక్రీడ సంభవింపదు కావున కందర్పుడను మత్తకరియని రూపక సమాసము నాశ్రయించినచో మత్త కరియను ఉత్తర పదార్థమునకు ప్రాధాన్యము వచ్చును. ఆ మత్త కరికి వప్ర క్రీడా యోగ్యత సంపన్న మగును. కావున వప్రక్రీడా శ్రమయనునది. ఉపమితి సమాసమునకు బాధకమై రూపక సమసమునకు సాధకమై యున్నది. కావున వీచి వలయః అనుచోట వలి పదముగా పూర్వపదముగా నుండటమే యుక్తమని తెలినది. వత్యార్మ యస్స మభ వన్ను తదంతరాతే అని మార్చిన పై దోషములు తొలుగును. (వలయః అను కర్త బహు వచనమున అభవత్ అను క్రియ ఏక వచనమున నున్నది, కావున దోషము తొలగును. వలయ పదమునపుంసక లింగము).

73 చ॥ వనితకు చాదుర్లింం బొడమి వాటపు బొక్కిలి నిండి యుబ్బజా
ల్గాన కటి చక్ర మాని మెఱుగుందొడలై విరవాసి వచ్చునూ
తన కిరణా మృతౌ మముల దండ హలాం కపదోత్థి తంబులై
మను నుడి వోని గర్భకల మంబులు గావె లతాంగి జంఘికల్.

74 నారీ కుచాచల భవై ర్నత నాభి పూర్ణైః
తచ్ఛ్రోణి చక్ర నిహతే స్త రసోరు భిన్నైః
అక్రాంత గర్భ కల మౌ నవ భామృ తౌఘైః
జం ఘేహి దండహల చిహ్న పదాగ్ర జాతౌ,

జల ప్రవాహము కొండలందు పుట్టి నేల వాటముగా నున్న గుంత నిండి దాని నుండి ఉప్పొంగి వెల్లువయై దేశమును జుట్టి రెండు పాయలై ప్రవహించుచు అంత నాగేటిచే దున్నబడి విత్తు చల్లియున్న ప్రదేశమున పారగా నాచోట వరి పైరు సమృద్ధి జెందుచు పిక్కలను వరి పొట్టలనుగా నిరూపించినాడు. నాయికా కాంతి ప్రవాహము కుచగిరులందు పుట్టి పారుచు నాభి గర్తమున నిండి అందుండి కటి ప్రదేశమున ప్రవహించి రెండు తొడల రూపమున రెండు పాయలుగా జీరి పారుచు హల రేఖాంకితమైన పాదములనే కేదారములను తడుపుటచే అందు మొలిచిన పిక్కలనే వరి పొట్టలు వృద్ధి జెందెనవి భావము. ఊరు ద్వయ రూపమున రెండు పాయలైనదని మూలమున నున్నది. కటి చక్రము నిండి ఊరువు లందుపడి ఉరు భేదము నందియని అనువాదమున మార్చబడినది. కాంతి ప్రవాహము కుచగిరులందు పొడిమి నాభి బిలమున పడి కటి చక్రము నాక్రమించి అచటి నుండి ఊరువులందు పడి హలాంకితములైన పదములందు ప్రసరించుట చేతనే జంఘలనే వరి పొట్టలు పెంపొందినవనుట యుక్తముగా నున్నది, మెరుగుందొడలై, అను మూలము కన్న అనువాదమే ఉచితముగా నున్నది. కాని చెంత అను అర్థమున వాడబడిన దండ అనునది సంస్కృతముగా భ్రమపడి దండ హలయని అనువదింపబడినది. జాల్వోనియను నది లేకున్నను భావ స్ఫూర్తికి విఘ్నము కలుగదు.

80 తే॥ గంధ గజ యాన గీత ప్రబంధ కలన, నలరి యతి లియ్యమైవచ్చు
నరిది మగువ। లార కనుగొంటిరేయను నాశి వాక్య. మొకటి
వినసై విదె పేళ యొుదవె వనుచు.

81 గ॥ కుహ నా యోగి సమాగమన మ విజ్ఞాయైవ కుతుకేన స్వేచ్ఛా విహార
సల్లపనాసు సఖీషు కాచి దూచే.

81 శ్లో అస్మత్స ఖీ మణి స్వమంచిత గీతి రీతే
రాయాన్యా తీహ సహసాథు ముదాయతీతి
ఇత్యాలి వాగవ (హితం) హితమా కలయ్య
తత్కుంజగః కపట తాపస ఏవ మూచే.

మన చెలి గీత ప్రబంధ కలన నలరి యతి లీనమై వచ్చును ఎంత ఆశ్చర్యము. అనగా గీతములలో విశ్రమాక్షరము తనంత తానే వచ్చిపడునని సామాన్యార్థము. మన చెలి గీతాలాప మాధుర్యమున కలరి పరవశుడై యతీశ్వరుడు వచ్చునని అర్థాంతరము. ఇది తెలియకయే చెలికత్తె పలికినది. దీనినే ముద్రియందురు. తరచుగా రూపకములందు ఇది ఉపయోగింపబడును, రామరాజ భూషణుడు వసు చరిత్రలో నాటకీయతను ప్రవేశపెట్టి శ్రావ్య దృశ్య కావ్యముగా రూపొందించినాడు. ఇట్టి ఉక్తి వక్రతలు పలుచోట్ల మన కగుపడును, చెలి పలికిన మాటకు సంతసించి ఇదే సమయమని విదూషకుడు ప్రవేశింప ప్రయత్నించును. 'తత్కుంజగః, అనునది మూలమున లేదు. అనువాదకుడు సందర్భ శుద్ధికి ఉపయోగించినాడు.

'ఆయాస్య తీహ సహనాధు ముదాయ తీతి' అనుచోట 'యతీతి' అనునది క్రియతో నన్వయింపదు. క్రియతో నన్వ యింపవలయునన్న 'యతిరితి యని వ్యస్తముగా ఉండవలెను. మరియు ఇతి ఆమ్రేడితమైనది. "ఆయాతి చన్వయమి హై వ యతిర్ని లీయ" అని మార్చినచో సముచితముగా నుండును. (ముని పరముగా యతి పదము ఇ కారాంతముగానున్నది. విశ్రాంత్యర్థమున ఇకారాంతమే కావున 'యతిరితి' యనియే యుండవలయును).

81 ఉ॥ మేలు లితాంగి నీ పలుకు మెచ్చితినే యతి వచ్చు జాడయే
లీల నెఱింగితమ్మ బహు లీకృత చాతురి మించునీ విపం
చీలలితారవామృతము చిత్తము సోకిన వార లీకలా
శాలిని జూచి దీవెన లొసంగక పోవరు సుమ్ము నాపుడున్.

82 శ్లో॥ సాధూ త్వ లాక్షి తవ సారగి రాస్మి హృష్టః
యత్యాగతిః కథమబోధి 'య ఈ దృశోఽస్యాః
వీణా రవామృత వికాసమనాస్యదృష్ట్వా

కాంతా శిషం న కలయన్నహి యాస్య తీతి.

యః ఈదృశః అస్యాః పీణారవామృత మనాః భవతి సః దృష్ట్వా అని అన్వయించుకొన వలెను. కాని కాంతాయై ఆ శిషమ్ అనుచోట తచ్ఛబ్దార్థమునను సంధించుకొన వలసి వచ్చును. 'ఇది కష్టమె ఎట్లో సరి పుచ్చుకోవాలి' వితాసి చోట విలీన అనుట భావ్యము.

82 ఉ॥ అచ్చట నున్న యిందు ముఖు లంద ఱు నాపలు కాలకించి 'తా
నెచ్చట నుండి యో యొక యతీంద్రుడు వచ్చెగదమ్మ' యంచులో
నచ్చెరు పాటు సంభ్రమము నందు చు గద్దియడి గ్గి రంతలో
వచ్చెద పోధనుండు జన వల్లభుడున్ మదిమెచ్చె నెచ్చెలిన్.

గ॥ తదా తత్ర త్యా స్సర్వా శ్చ శుశ్రువు స్త ద్వచనం, కుహనా తపస్వీ చ। కుంజాన్ని రగాత్.

83 శ్లో॥ తపస్వి వర్యా గమ నంత దాత్వే
విజ్ఞాయ తద్వి స్మయ సంభ్రమాభిః
ముక్తా సనాభిః ముని రైక్షి తాభి
ర్నై నంద రాజా హృది నర్మ మిత్రమ్.

తా॥ ఇట్లా కపట ముని చాటున నుండి చెప్పగానే యా నాయిక గృహ మందుండిన స్త్రీ లందఱును విని 'యెవడో యొక ముని శ్రేష్ఠుడె చ్చటి నుండి యో వచ్చెగదమ్మా, యంచు నాశ్చర్యమును తొట్రుపాటును మీఱ గద్దె పీటల నుండి దిగిరి. వారు లేచినంతలో నా మునియు వచ్చెను. అతడు చేసిన నేర్పునకు రాజు మనసు నందు మెచ్చుకొనెను (ముని చాటున నుండి తన రాక ముందు తెలుపుట యేకాంత మందున్న యా స్త్రీలు తన సన్నిధానమునకు రాబట్టు కొనుటకు దగిన యాయిత పాటునను మెలపునకు నుండుటకని తెలియునది.) ననంద రాజా హృది నర్మ మిత్రమే, అట్టి చాకచక్యము చూపిన నర్మ సచివుని చూచి రాజు హృదయములో సంతి

సించెనని అర్థమును, గ్రహించవలెను. తానెచ్చట నుండి యో యతీంద్రుడు వచ్చె గదమ్మ యంచులో నచ్చెరు పాటు సంభ్రమము. అనునది సంక్షిప్తం చేయబడినది.

83 చ॥ మునియట రాఁ దటాలున సమున్నత పీఠము డిగ్గి నిల్చునం
గననిఱు పేదకౌను కుచ గౌరవ మోర్వక కంప మొందగా
జనపతి చూడ్కి తోడనె సంభ్రమ సంభరితాను కంపమై
యెనసి వలగ్నముం బొదిపె సీశులు దీన దయాలు దర్శనుల్.
తదానీమేవ —

84 శ్లో॥ ఆయాతి యోగిని హఠాదవ రూఢ పీఠ
కాంతాకుచాద్రి భర కంపి కృశావ లగ్నమ్
దృష్ట్వా ననా (హ) నృపతి స్సదృఢాను కంపం
దేశాధిపాజగతి దీన దయా దృశోహి.

అనువాదమున చక్కని భావ స్ఫూర్తియున్నది. కాని, ఒక విశేషము కలదు. జనపతి చూడ్కి తోడనే అని మూలము రాజు యొక్క దృష్టి వెంటనే అని అర్థము. తటాలున లేచినపుడు కుచ గౌరవము వలన ఆమె నడుము అల్లల్లనాడు చుండగా రాజు దృష్టి ఆమె నడుము పడిపోకుండ పొదివి పట్టుకొనె నని భావము. అనువాదకుడు రాజేదృష్టితో వెంటనే ఆమె నడుమును పొదివి పట్టుకొన్నాడని అనువదించినాడు. అనువాదకుని వాక్యమే సరియనరాదా అన్నచో 'ససంభ్రమ సంభరి. తాను కంపమై. అను ముప్రత్య యాంత విశేషణము రాజు దృష్టికి సమన్వయించును కాని రాజుకు సమన్వయింపదు. కావున అనువాదకుని అభ్యూహకు ఇది బాధకమగుచున్నది. ఇంత మాత్రమున భావమునకు ఎట్టి కొరత కలుగదు జనపతి చూడ్కి యనుచోట మూలమున 'చూడ్కి' కర్త్రి కాగా అనువాదమున జనపతియే కర్తయై నాడు. 'దేశాధి పా జగతి దీన దయా దృశోహి అను అర్థాంతన్యాసము అనువాదకుని భావమునే పోషించుచున్నది. అనగా రాజులు దీనుల పట్ల దయాదృష్టి కలవారు కావుననే రాజైన వసువు తన చూపుతో పడిపోకుండ ఆమె నడుమును పట్టుకొనెను అని సమన్వయము

అనువాదముననే చక్కగా నున్నది. మూలమున జనపతి యొక్క చూపు అని అర్థము చెప్పినచో అర్థాంతన్యాస సమన్వయము రాజు దృష్టి యందు సంభవింపదు.

84 తే॥ ఇంతియును నంత నంతంత నెదిగి పొదలు, నిబ్బరపు గబ్బి
గుబ్బల యుబ్బు కతన। నొరగా బాణి కంజంబు లూది మ్రొక్కె,
మక్కువ సఖీమణులు దాను మౌనిమణికి

85 శ్లో॥ అత్యున్నత స్తన భారా (ద్భా)వ నాదే కపార్శ్వ తః
అనమ త్సాదరం సాక మాలీభి ర్మునయేఽధసా,

అనువాదమున మూలభావ స్ఫూర్తి లేదు. చావనాత్ అనునది సమన్వ యించుట లేదు 'చ' అనునది సంపాదకులు ఏ ఉద్దేశమున పూరించిరో తెలియుటలేదు 'స్తన భరాచ్య వనాత్' అని అనువాదకుని ప్రయోగమైయుండు నను కొందును. అత్యున్నతమైన వక్షోజములందు చేతులు జారిపోవుట వలన ఒక ప్రక్క చేతులు జోడించి సఖు రాండ్రతో కూడ ఆ యతికి నమస్క రించెనని మన మూహించవలసి యున్నది ఇది ఊహా మాత్రమే.

85 వ॥ అప్పు డప్పతి నవ తపో నిధి యొప్పులకుప్ప యగు నప్పూబోడి యనల్ప విలాసకల్పనంబులకు మెచ్చి 'యోయనన్య కన్యా సామాన్య లావణ్య ప్రభావసు వల్లి కుం। బెండ్లి యాడు, మని దీవించి తదీయ వివిధ పూజా విధానంబులం బ్రమోద మాన మాన సుండై యాముద్దియ లిడు పసిండి గద్దియ నధివసించె నయ్యెడం దొయ్యలులు నయ్యతిపనుపునం దమ తమ యుచితాస నంబుల నలంకరించి రంత నాకంజ నయన యమునుంగుంజెలులతో సమంజస వచన చాతురీ రంజిత యగు మంజువాణి యంజలి పట్టి యతి కుంజరునితో నిట్లనియె.

86 గ॥ అథ తదాపి మప్రతిమ నవ తపో ధనం రమణీరచిత వివిధ వినయ పూజా విజృంభమాణం తరుణీ మణి సమర్పిత తపనీయ పీఠ మధి

వసంతం నవ వసంతమ్ అనన్య కన్యా సామాన్య లావణ్య భాసురే
లలిత విభవ సువల్లభ కలిత కరగ్రిహా భవేతి ధర సుతాయై విరచితా
శిషం తాప సానుజ్ఞా సమలం కృత మణిఖచిత సముచితా సనా
(సీనా) సు కంజలోచనాసు నమంజస వచన వైఖరీ రంజితా ఖంజన
మద భంజన లోచనా ఘనాంజన నీలవేణీ మంజువాణీ సాంజలిరితి
సంజగాద మనుపంజరం ముని కుంజరమ్.

అనన్య కన్యా లావణ్య పరిభావ సువల్లభుం బెండ్లి యాడు మను మూలమునకు, అనన్య కన్య సామాన్య లావణ్య భాసురే లలిత విభవసు వల్లభ కలిత కరగ్రిహా భవయని అనువాదము. లలిత విభవ+సు వల్లభ, యని సామాన్యార్థము, లలిత విభ వసు వల్లభ యవి ఉద్దిష్టార్థము, ఇవి రెండర్థములు చక్కగా పొందు పరచబడినవి. ఉప్పొంగి యనుటకు జృంభమాణమ్. అనుట కన్న 'సముల్లసిత మానసమ్ అనుట యుక్తము.' నవ వసంతమ్. అనునది ఆమౌలికము ఇది నాటకములలోని వసంతకుని గుర్తు చేయుచున్నది. రాజ మన్మథ సమాగమమునకు పూర్వము వసంతాగమమును తలపింపజేయ నుద్దేశించి యై అనువాదకుడు పదమునుపయోగించి ఉండునేమో.' సుముచితాసనాసీనాసు, చోటి (సీనా) పదమును సంపాదకులు పూరించిరి కాని దీనితో ప్రయోజనమే లేదు. పైన సమలంకృత అను పదము చే తదర్థము స్ఫురించుచున్నది.

87 మ॥ అంబరుహాప్త తేజ భవదం ఘ్రిల వ్రాలగ గల్గు నుత్తమాం
గం బది యుత్త మాంగము జగన్మహ నీయ భవత్కథావిశే
షంబు నుతింపగా గల రసజ్ఞ రసజ్ఞ భవ ద్విభావనా
ప్తిం బరి పూర్ణమై జరుగు దిష్టము దిష్టము శిష్టకోటికిన్.

తా॥ మహాత్మా! మీ పాదములకు మ్రొక్క గలిగిన శిరస్సు శిరస్సే నీ చరిత్రములను గొనియాడు నాలుకయే నాలుక. నిన్ను ధ్యానము జేయుటచే జరుగునట్టి కాలమే కాలము సుమా.

88 శ్లో॥ ఉత్కృష్టతే పదనతం శిర ఉత్త మాంగమ్
రాజ ద్భ వన్నుతి పరా రసనా రసజ్ఞా
యు ష్మత్స మర్చన విభావన యోగ్య కాలః
దిష్టోత్తమో భవతి శిష్ట జన స్య లోకే.

భావము ప్రతి బింబించినను లాటాను ప్రాసదెబ్బతిన్నది. లాటాను ప్రాస వలననే పద్యమునకు అందము చేకూరును. అది లోపించినది. నీ పాద ములపై వ్రాలు తల యే తల, నిన్ను స్తుతించు రసన యే రసన యని ఉండవల యును. ఆ పదములతోనే నిర్వాహ మున్నపుడు వాక్యమునకు విచ్ఛిత్తికలుగును మూలమున నిట్టు అనూద్దేశము చేయబడినది. 'యత్తేమునే పదనతం చ తదుత్త మాంగం, యాచస్తు తౌ తవపరా ననుసా ర సజ్ఞా, దిష్టం తదేవ భవదర్చన సంభృతం య, స్నితం ముదాభవతి శిష్ట జనస్యలోకే అని మార్చుట యుక్తము. (నీతమ్ గడుపబడునది).

సీ॥ కావున నుద్యానగతుడైన మత్ స్వామి। తోనమేరు సమే ధమాన మంజు। లచ్ఛాయల గరంబలరుచు నీల గ్రీవనిల యాభి రామ సీమల దె లియుచు। సుమ నో మనోజ్ఞ ధామములు మెచ్చుచు। బుష్కర సరో వరోర్మి సంభ్రమము గనుచు। రంభాది లాస్య సంరంభముల్ దిల కించు। కొనుచు గిన్నర మృదు ధ్వనులు విన్నుచు।

తే॥ శిశిర శిఖరి స్థలంబు లీక్షించుకొనుచు, జంప కారణ్య మరయుచు జగతి నద్భు। తంబయిన పుండరీక కే। దార సేతువైఖరికి నిచ్చ గించుచు వచ్చి వచ్చి।

తేనోద్యాననతేన మేరులలితచ్ఛాయోజ్జ్వల స్వామినా
నిత్యా లోకిత నీల కంఠ సుమనో భూమాభి రామాలయః
రాజ త్పు ష్కర తీర్థ సంభ్రమ పరో రంభాది లాస్యాదరో
మాద్యత్కిన్నర మంజు గాన కుతుక శ్శైతాద్రి సీమా మగామ్॥
శ్రీ పుండరీ క కేదార సేతు దర్శన విస్మితః
విశిష్య చంప కారణ్యం విలోక్యైవ మిహాగతః॥

అనువాద మతి రమణీయముగా నున్నది. యతి నర్మసచివుల పరముగా అర్థద్వయము నిగుడింపబడినది. ఉద్యానగతుడైన ......... కరంబల రుచు=ఆకాశమున పయనించునట్టి నా స్వామియగు సూర్య భగవానునితో గూడ మేరు పర్వతమందు అభివృద్ధి జెందుచు మనోజ్ఞమగు కాంతులచే మిక్కిలి సంతసించుచు అని యతి పరము. ఉద్యానమున కరుదెంచిన మా ప్రభువగు వసురాజుతో పాటు పొన్నచెట్ల యొక్క పెంపొందు శిశిర మనోజ్ఞములైన నీడల యందు రంజిల్లుచు అని నర్మసచివ పరము. నీలగ్రీవ.................. దెలియుచు=శివునకు నిలయమైన కైలాస మందలి విలసిత ప్రదేశములను కను గొనుచని యతి పరము నెమళ్లకు ఆట పట్టైన సీమలను తిలకించుచు అని నర్మసచివ పరము. సుమనో ...... మెచ్చుచు=దేవతల యొక్క మనోజ్ఞా వాసముల జూచి ప్రశంసించుచు అని యతి పరము, పూలతో మనస్సు నాకట్టెడి పొదరిండ్ల నీక్షించి కొనియాడుచు అని నర్మ సచివ పరము. పుష్కర సరో......గనుచు=పుష్కర తీర్థ తరంగ విభ్రమముల వీక్షించుచు అని. యతి పరము, తామర కొలకుల కెరటాల సొరుసు పరికించుచు అని నర్మ సచివ పరము. రంభాది ........ కొనుచు=రంభాది అప్సరసల నృత్యముల నవలోకించుచు అని యతి పరము, అరటి చెట్లు మున్నగు వాటి సంచలన సౌభా గ్యము నీక్షించుచు అని నర్మ సచివ పరము. కిన్నర........ వినుచు=అశ్వము ఖుల మధుర గీతములను ఆలకించుచు అని యతి పరము. కిన్నర పక్షుల మధుర కూజితములవినుచు అని నర్మ సచివ పరము శిశిర............ కొనుచు=హిమా లయముల పరిసరములను చూచుచు అని యతి పరము, శీతల తరువాటికలను తిలకించుచు అని నర్మ సచివ పరము.

చంపకారణ్య పుణ్య భూమిని అని యతి పరము, సంపెంగ వనములని నర్మ సచివ పరము. పుండరీక క్షేత్రము కే దారము సేతువు అని యతి పరము తెల్ల దామర పొలాల పొందికలని నర్మ సచివ పరముగా అర్థద్వయమును గ్రహించవలెను.

96 చ॥ అనుపమ భాగ్య లక్షణ సమన్విత యీ రమణీ లలామ యీ
మన నిజరాజ రాజ్యరమ మానస వీధి దలంప సింధు నం
దన య చలేంద్ర నందన యనం గననయ్యెడి నీలతాంగి పా
వనకుల గోత్ర భూతి చెలువా చెలువారగ డెల్పవేయనన్.

97 శ్లో॥ సౌభాగ్య లక్షణవతీ స్మర రాజ్య లక్ష్మీః
కాంతామణీయ మచలాధిప కన్యకేతి
సంలక్ష్యతే మనసి సింధుకుమారికేతి
గోత్రోన్నతిం సఖీ వదేతి నతామ వాదీత్.

సింధు కన్యక అచలాధిప కన్యక యనుటకు తగినట్లు పావన కుల గోత్ర భూతియని మూలమున వాడబడినది. ఆమె పావనకుల నామములను తెల్పుమని సామాన్యార్థము. పావన మనగా నీరు (శుక్తి మతియని) కుల గోత్రమనగా, కుల పర్వతము (కోలాహలుడని) శుక్తి మతియందు కోలాహలుని వలన జన్మించిన విధానమును జెప్పుమని అర్థాంతరము. కావుననే సింధు కన్యక అచలాధిప కన్యక యనుచోట క్రమముగా సాగర కన్యక శుక్తిమతీ కన్యక యని హిమ వత్కన్యక కోలాహల కన్యక యని ఉభయార్థ స్ఫోరకముగా వాని నుపయోగించినాడు. అనువాదమున పావన పదము తప్ప మిగిలినది హృద్యముగా పొందు పరచబడినది. 'కాంతా మువాద వద పావన గోత్ర భూతిమ్, అని మార్చిన మూల భావమును సంపూర్ణముగా చెప్పినట్లుండును. నః అనునది 'అధ్యాహారము

98 ఉ॥ అయ్యెడ మంజు వాణి.............నెఱుంగా తెలుంగు చోద్యమే.

99 శ్లో॥ మా నీశ మాహ మహిలాస్వ ధ మంజు వాణీ
భక్త్యైః ఉర్వ్య లోకభరణా భరణేన భూమ్నా
సర్వజ్ఞతా మధిజుష స్సకలోన్నతస్య
కిం చిత్ర మిత్య ఖిలలోక కథోపలబ్ధా.

అనువాదము బాగున్నది. లోక భరణాభరణైక భూమ్నా యనుట యుక్తము.

100 క॥ కావున నీ వన జానన, పావన జనన క్రమంబు భవదీయదయా
శ్రీవలన విన్న వించెద, నే వినుమని యవ్విలాసినీమణి పలికెన్.

101 శ్లో॥ తతస్త్వదీయ దయయా తరుణీ జన్మవర్ణయే
తచ్ఛ్రూయతాం తాపసేతి తత్ప్రతీతు జగాద సా

'శ్రూయతాం ముని చందేౕతి సుందరీ నిజగాద సా, అని మార్చిన తచ్ఛ్రూయతా మిత్యాదులలోని పారుష్యము తొలగును. కథయేతే ప్రసాదేన కాంతాయాః పావనో దయమ్, అని పూర్వార్థము మార్చినచో పావన జనన మను మూల భావము చక్కగా అతుకును.

101 మ॥ కలదు శ్లోక మహో.......................పాల చంద్రుండిలన్.

102 శ్లో॥ అస్తిక్షోణి తలే వసు క్షితిపతిః ప్రౌఢ ప్రతాపా నల
జ్వాలాలీ మరు భూత సింధు విచల న్మైనాక పక్షచ్ఛిదా
నానా దిక్తట భేదిదుందుభి మహా నాదేన సమ్మూర్ఛతా
సా నందేన నగారిణా నుతయశా స్సర్వజ్ఞ చూడామణేః.

అనువాదము యథా మూలముగానున్నది.

103 తే॥ రత్న భూషితమైన యా రాధాని, య బుత సురు తరముక్తా ఫలాభి
రామ। దామకం బనజాలి సిద్ధం పుజవుల, బరగు శుక్తిమతీ నామ
భవ్యతటిని.

104 శ్లో॥ ఉపకంఠం పురమణే రురుమౌక్తి కదా మవత్
ఉద్దామరుచిరా భాతి హృద్యా శుక్తిమతీ నదీ.

అధిష్ఠాన పురియను అంగన యొక్క కంఠమందు ప్రకాశించు ముత్యాల హారమా యన్నట్లు మధుర జలముచే ముక్తారుచుల చేతను విలసిల్లుచు శుక్తిమతీ నది ఆ పట్టణము ప్రక్కన ప్రవహించుచున్నదని భావము. అనువాదమున రత్న భూషితయను నది లేదు. రాజ ధానియందు రమణీత్వారోపము మూల మున ఆక్షిప్తముకాగా అనువాదమున పురమణి యందు పురుష మణిత్వారోపము

ఆక్షిప్తమగును. కాంతులు ముత్తెములు నను అర్థద్వయమిచ్చు చవులు అను పదము మూలమున నుపయోగింపబడినది. అనువాదమున – ఉద్దామరుచిరా = మిక్కిలి స్వాదుత్వము కలది, ఉత్కృష్టములగు దామములచే ప్రకాశించునదియు అని అర్థద్వయము పొందు పరచబడినది. దామ పదమునకు దామ గతములగు మౌక్తికములని అర్థము గ్రహించవలెను.

104 ఉ॥ జీవనమెల్ల సత్కవి నిషేవిత......నుతింప శక్యమే.

105 శ్లో॥ యజ్జీవనం కవి వినోది యదంత రంగ
మచ్ఛంగ ఖేర మతి పావన మర్థ దాయి
ధా త్రీ త్రికాల ఫలదా గత యో యదీయా
ముక్తా లివి భ్రమపరాహి యదజ్జలీలాం

పరమ రమణీయమైన అనువాదము. శ్లేష కృత సౌందర్యము పరాకాష్ఠ నంది నది. అర్థదాయి యనునది మూలమున లేకున్నను అనర్థదాయి మాత్రము కాదు.

105 సీ॥ అను కూల ఖేలనాయత్త జీవన మైత్రి, నడరి నర్మద బోటి
యైభజింప। నూర్మి కా కంకణ ద్యుతి కలాపము దోప, బాహుద కై
దండ బరిఢ వింప। సముది తారా వసంభ్రమ సాంద్రియై సారె,
సారె వేత్రవతి హెచ్చరిక దెల్ప। గంభీర రస గుంభ సంభృత
ప్రౌఢిమ. తో సంస్కృతి పలుక్కు దోడు గాగ.

106 శ్లో॥ శ్లిష్టా నర్మదయాఽను కూల విహృతి శ్రీ జీవన స్నిగ్ధయా
కల్యాణోర్మిక కంక ణాంకిత కరాలంబోల్ల సద్బాహుదా
తాదృ క్సంభ్రమ రమ్య రావఘనయా (త) ద్వేత్ర వత్యానుతా
తద్గంభీర రసాబి గుంభిత సరస్వ త్యుక్తి సాధూత్తరా.

కల్యాణోర్మిక కంకణాంకితకరా అనుచోట కల్యాణోర్మికము కంక ణాంకితమునగు కరమని సమన్వయము జలబిందు సముంచిత కాంతియని నదీ పక్షమున అర్థము స్త్రీ పక్షము సుగమము.

106 తే॥ కులములో బెద్దయు నమూల్య గుణమణి ప్ర, కాండ పరిపూర్ణయును
గాన గారవము నఖిల నదులను దను గొల్వ ననుది నంబు, నలువ
కొలువున కేగునన్నది యతీంద్రి.

106 వంశ రూప గుణోత్కర్షా వాహి నీ బృంద వందితా
వన జాతాసన సభాం వనితా కృతి రాప సా.

ఇది సీస గీతాను వాదము. మూలము వలె సుందరముగా నున్నది.

107 సీ॥ సుమనోధి వాస భాసుర శిఖోన్నతి వాడు, ఘన సార తిలక వాసనల
వాడు। ఘనంకు మద సాంద్ర గండ భాగమువాడు, నవపద్మ రాగ
దంతముల వాడు। కలితోప కంఠన క్షత్ర మాలిక వాడు, హరి
చందన చ్ఛాయ నమరువాడు। తపనీయ మేఖలా ధాళ ధళ్యమువాడు
మణిపాద వలయ ధామంబు వాడ.

తే॥ నర్ఘ రత్నావళీ వి చిత్రాంబరాభి, రామ శృంగార ములవాడు
హైమగర్భ గేహమున కేగువాడు కోలాహలాఖ్యు, డొక ధరాధీశు
డెదురయ్యె నువిదకపుడు.

గ॥ తద్ధానీ మేవ ధాత్ర సేవావసర మవధాయ తత్పాని నందిషయా)

108 శ్లో॥ రారాజ త్సుమనో మనోహర శిఖో రత్నా (లి) చిత్రాంబరః
శృంగారాభియుత స్సితా భ తిలక శ్శో ణా శ్మ దంతోజ్జ్వలః
విద్యో స్యో మహితోప కంఠ విలసన్న క్షత్రి మాలాంచితః
భాస్వ త్సంకుమ దార్ద్రి గండ ఫలకో భర్మోల్ల సన్మేఖలః

శ్లేష చక్కగా కూర్చబడినది. పుష్పములచే మనోజ్ఞముగా శిఖ గలవాడని
దేవతల మనస్సును కూడా హరించెడి శిఖరములు గలవాడని మొదటి విశేష
ణము నకర్థద్వయము. 'రత్నాలి చిత్రాంబరః' అనుచోట లివర్ణమును సంపా
దకులు పూరించినారు. 'రత్నాలి' అనుటకన్న 'రత్నాళు' అన్న రమ్యముగా

నుండును. రత్నాంశువుల వంటి అంశువులచే (దారములోని సూక్ష్మాంశములకు అంశువులని పేరు) చిత్రమైన అంబరము గలవాడు. అనగా జరీ వస్త్రములను దాల్చినవాడని తాత్పర్యము. రత్నాంశువులచే చిత్రమైన (పలు వన్నెలుగల) ఆకాశము కలదని పర్వత పరమైన అర్థము. ఇట్టులే అన్ని విశేషణములలో అర్థద్వయమును పొందు పరచినాడు. కాని 'విధ్వాస్యః' అను పదమున సమన్వయము కుదుటలేదు. చంద్రుని వంటి ముఖము కలవాడని రాజకుమార పరమగు అర్థము వచ్చును కాని పర్వత పరమగు అర్థము పొసగకున్నది. విధు=చంద్రుడు నకు, ఆస్యః=విశ్రాంతి స్థానముకలది అనికాని విధు మండలము వరకు వ్యాపించిన శిఖర గుహలు కలదని కాని సమన్వయము చేసినను సారస్య మేర్పడుటలేదు. మఱియు రెండు చరణములందు సంపూర్ణముగా యతిని పాటించి, ద్వితీయ చరణమున హల్మైత్రిని పాటించినవాడు తృతీయ చరణమున యతిని పాటించకుండునా? అను సందేహము కలుగుచున్నది.

కోలాహల ధరాధీశః కుతుకీ హరిచన్దనీ
మాణిక్య పాద వలయః మానిన్యభి ముఖోభవత్.

'హై మగర్భగేహమున కేగువాడు, అను మాటను పద్యమునకు పూర్వమే గద్య రూపమున అనువదించెను.

108 చ॥ అనుపమ భాగ్యశాలి కచలాధిప మౌళికి బుత్త్రిడై జగ
జ్జనని కనుంగు దమ్ముడయి శంకరు పుద్దు మఱంది కుఱ్ఱయై
మను తన భాగధేయ మహిమంబున మిన్నులు ముట్టి వచ్చుధ
న్యుని నతసిన్ భజించి నదియున్ వినయంబున నొంచియై చనన్,

109 శ్లో॥ శైలాధి రాజ తనయస్య శివాను జస్య
శూలాధిప ప్రియతమస్య శుభోన్న తస్య
కోలాహలా వని భృతః కుచ శైల లీలా
బాలాఽను కూల వినయాఽ జనిపార్శ్యలోలా.

అనువాదమున 'శంకరు మద్దమరంది కుర్రయై, మిన్నులు ముట్టివచ్చు మున్నగు మాటల పొగసులేదు. 'కుచ శైలలీలా' అనునది మూలమున లేదు. ఓరయై చనన్ అను మూలమునకు 'పార్శ్వలోలా' యన్నది అనువాదము.

109 సీ॥ బాలకూర్మ విలాస పదములు కాంతరం, భా ప్రతి బింబోరు
భవ్యరుచులు। సరస సైకత సార జఘన సౌభాగ్యంబు. నత నాభి
రూప వన భ్రమంబు। బెడగారు దరుల యొప్పిదమును, నామీద
జనుజక్క వలనిక్కు చక్కదనము। కమల కోమల ముఖ కామనీయ
కమును, మంజులా లోక విలస నంబు.

కూర్మాంఘ్రి ర్నిజకూల రూఢకదలీ చ్ఛాయోరు కా సైకత
శ్రోణ్యంబు భ్రమనాభి రూర్మివలికా శైవాల రోమా వళిః
చక్రోరోజయుగీ సరోరుహాముఖీ చారూత్పలాక్షీ నదీ
తన్వీ భృంగకచా బభూవ లలితైస్తద్ధర్మ దర్మా సహా.

మూలమందలి శ్లేష సౌందర్యము అనువాదమున పోషింపబడలేదు. చిన్న తాబేళ్ల యొక్క విలాస స్థానములని నదీ సామాన్యార్థము. బాలకూర్మ విలాసముగల మీగాళ్లని స్త్రీ పరము. మనోజ్ఞములైన అరటుల యొక్క ప్రతిచ్ఛాయల కాంతులు అని నదీ పరము. అరటి కాండములకు ప్రతిబింబములైన ఊరు కాంతులని స్త్రీ పరము. జలముతో గూడి చక్కగనున్న ఇసుక దిన్నెల యందు పొడమిన (సరస సైకత సార+జఘన సౌభాగ్యములు) అధిక సౌభాగ్యములని నదీ పరము. సుందరమై ఇసుక దిన్నెల వలె నున్న జఘన సౌభాగ్యమని స్త్రీ పరము నతలోతైన+అబి రూప=ప్రతి కూలములైన (చొరరాని) వన సంభ్రమంబు=నీటి సుడియని, నదీ పరము. నీటి సుడివలెలోతైన నాభియని స్త్రీ పరము. బెడగారు దరుల యొప్పిదము=అధికమైన తీరముల చక్కదనమని నదీ పరము, విలాసముగులుకుచున్న వళుల చక్కదనమని స్త్రీ పరము. అమీదజను=ఆ తీరములపై సంచరించు, జక్కవల నిక్కు చక్కదనమని స్త్రీ పరము. కమల కోమల ముఖ కామనీయకమును=పద్మముల యొక్క మృదు దళాగ్రముల సౌందర్యమని నదీ పరము. కమలములవలె లేతనైన మోము

యొక్క అందమవి స్త్రీ పరము ఉత్పల మంజులాలోక విలసనంబు=నల్లకలు వల యొక్క కమ్రి కాంతుల విలాసమని నదీ పరము, నల్లకలువల వలె సుందరముగానున్న కనుల విలాసమని స్త్రీ పరము. ఇట్లు తటినీ, తరుణీ మణుల పరముగా అర్థములను విబంధించి కవి రూపణ జేసెను. అనువాదము న పై సొరాగసు లేదు తన ఒడ్డున మొలిచిన కదలుల ఛాయచే గొప్పనైన నది. కదలుల ఛాయగల ఊరువులు గలది అని ఇత్యాది రూపమున అనువాదము సాగినది. సత్య నిర్మలాకార కాంత ధార దారున నెదిరినంతనే నగేంద్రదుగాఢ తరధైర్యము నువ్వెత్తుగా హరించెనను మూలమునకు లలితస్త ద్ధైర్య వర్మా పహా అని మాత్ర అనువాదము. చేయబడినది. మూలమున సీసము యొక్క తృతీయ పాదమునందు ఉభయార్థకములగు తెలుగు పదములకు సమానముగా సంస్కృతమున పదములు లభించమివానిని విడిచిపెట్టినాడనుటలో సబబుండును కాని మిగిలిన పాదముల సొగసైన తీసికొని రావలసి యుండెను. అది జరుగలేదు. మరియు 'ఘనఘటా నీల వేణియు' ననుటకు భృంగకచాయని అనువాదము చేయబడినది. వేణీ శబ్దమునకు ప్రవాహము కొప్పు అని అర్థద్వయ మున్నట్లు కచ పదమునకు లేదు. లీలా కూర్మ పదాభికా కదలికాచ్ఛాయోరు కా సైకత శ్రోణీకా భ్రమినాభి కోర్మివలికా శైవాల రోమాలికా, చకోరీరోజ విజృంభికాఽబ్జవదన శ్రీకోత్పలాభాక్షికా సాహర్షీత్ ఘన వేణికా సర సయా తస్యాంత రంగం శ్రియా యనికాని స్వమృత రూపా ఫేన త ద్ధీ రతామ్ అనికాని మార్చిన బాగుండునని తోచును (సు+అమృత=స్వమృత).

110 క॥ ఆ కరణి దరంగిణి నగ, లోకేశ్వరుధైర్య మెల్ల లో గొనిరా నీ
రాకరగభీర యాసు, శ్లోకుడు, నా చెలువ చెలువు లో గొని
చనియెన్.

111 శ్లో॥ తద్ధైర్యం సర్వ మా హృత్య తటినీ మణి రాగతా
సోపి సింధు గభీరోంతస్త ద్విలాసం వహన్ య్యా.

మొదటి 'లోగొని,కి' 'సమాహృత్య' యని, రెండవ 'లోగొనికి, అంతః వహన్, అని అనువాదము ఒకొక్కక భాషలో ఒక్కొక్క వైశిష్ట్య

ముండును. ఆవైశిష్ట్యమును అనువాద భాషలో ప్రవేశపెట్టుట కష్టము. కావున లో గాని, అనుటకు గత్యంతరము లేనందున 'అంతర్వహన్' అని అనువదించి నాడు. ఇట్టి చోటు లందు ఎంత ప్రతిభావంతుడైన చేయునది ఏమి ఉండదు.

111 మ॥ అలఘు శ్రీనిధి యానగేంద్ర తనయం డాసైకత శ్రోణి యొ
ప్పులు తెప్పార్పక చూచి చన్న మొదలుం బొంగారి పై పైరసం
బులు జృంభించు భ్రమించు నాశయము కూర్ముల్ మించ దీపించుసు
త్కలి కా చాపలముల్ మనో నిబిడ చింతా తన్మయత్వంబునన్.

112 శ్లో॥ శ్రీ శోభిత శిఖరి రాజ సుత స్తదాది
తాదృ జ్మనోజ్ఞ తటినీ స్మృతి తన్మయస్సన్
ఉద్య ద్రసో భ్రమ భృదు త్కలి కాతి లోలః
కా మోజ్జ్వల స్సమ భవ త్కమలాభిపూర్ణః

మూలమున వివిధ మనోవృత్తుల విజృంభణ విశ్లేషింపబడినది. అను వాదమున తత్ప్రయత్నము చేయబడినది. ఆసైకత శ్రోణి యొప్పులు రెప్పా ర్పక చూచి చన్న మొదలు మనో నిబిడ చింతా తన్మయత్వంబునన్ అను మొత్తమునకు తదాది 'తాదృ జ్మనోజ్ఞ తటినీ స్మృతి తన్మయస్సన్, అని అనువాదము. చేయబడినది అనువాదమున ఆశయము లేదు కూర్మలు లెవు కామోజ్జ్వలత మాత్ర మున్నది. ఏలననగా సంస్కృతమునె ఆశయమున్నది. కాని కూర్మలు లేకపోవుటకు కారణ మున్నది. ఇది తెలుగైనపుడు ప్రేమయని (కూర్మ పదము యొక్క బహువచన రూపము కూర్ములు) సంస్కృ తమైనపుడు ఆడతా బేళ్లని (కూర్మ పదము యొక్క బహు వచన రూపము కూర్మలు) అర్ధద్వయము. దీనికి సరియైన పదము లేనందున అనువాదకుడు దానిని విడిచి కామోజ్జ్వలః అనివాడవలసి వచ్చినది. కామముచే విలసిల్లువాడు, మిక్కిలి ప్రకాశించువాడు అని అర్ధద్వయము. కమల పదమునకు ఎన్ని అర్థములున్నను ప్రకృతమునకు అది ఉపయోగింపదు 'శ్రీశోభితః, అని ముందే పేర్కొనబడినది. గురుత్వ శోభ గొప్ప సంపదయను అర్థద్వయ

స్ఫోరకముగా మూలమున అలఘు శ్రీపదముపయోగింప బడినది. అనువాదమున ఆ అలఘుత్వము లేదు 'శ్రీ' మాత్రమున్నది.

112 సీ॥ తన కూటముల త్రోవ దాల్చు రంభాదులు, సరస భావము దప్పి
శిరము వంప। దనలోలతల బెంవుగను కలకంఠులు, చేరిపై
త్రాలక చెదరి పలుక। దనవంక నలరు పద్మిను లెల్ల దమిగాన,
కయ వాడి మోము లగ్గలముముడుప। దన మహా భోగంబుల నెనంగు
భోగినుల్,। దెరలి నిట్టూరుపు దెరలు నెరప.

తే॥ నకట కట మంచు మల పట్టియతను తాప, వహ్ని పాలయ్యె ఝుర
బాష్ప వారియగుచు- నిత్య శుక్తిమతీ ధ్యాన నిశ్చలాత్ముడగుచు
నంచిత గహనరోమాంచు డగుచు.

133 శ్లో॥ అ సీన్ని తాంత మహహాఽతను తాప కీలా
తప్తో హిమాద్రి తన యో ఝర బాష్ప పూర్ణః
తద్ధ్యాన నిశ్చల తరో గహనాభి రామ
రోమాంచ కంచుక విశేష సమంచితాంగః

శ్లేష చక్కగా నిర్వహింపబడినది. తాను మంచు మల పట్టియయ్యు అతను తాపము పాలైనాడని చమత్కారము దావాగ్నిని కామాగ్నిగా రూపించినాడు. అట్టి అతను తాపము పాలై ఝర రూప బాష్పధారలొలుకుచు (కార్చిచ్చు వలన ప్రవాహ మందు ఊష్మ మేర్పడినదని భావము) శుక్తిమతీ ధ్యాన పారవశ్యము వలన నిశ్చలుడై అనగా స్తబ్ధత ఏర్పడిన వాడై (పర్వతము కావున నిశ్చలమైనదనుట) సాంద్రగహన రోమాంచుడై—అరణ్య రూపమైన గగుర్పాటుగల వాడై ఉండెనని భావము. అనువాదము చక్కగా నున్నది.

113 రంభాద్యా ఘన కూటగా రహిత సారస్యా నమన్మస్త కాః
శ్లిష్యంతః కల కంఠ్య ఇద్ధ కుతుకా శ్శీర్ణా విశీర్ణారవాః
పద్మి న్యోఽహార పుల్ల పత్రని చయా దైన్యాతి ఖిన్నాననా
భోగి న్యో స్య బభూవు రంచిత మహా భోగా వ్యధోచ్ఛ్వాసితాః

రామరాజ భూషణుని కల్పనకీ పద్యము కూడా ఒక గీటురాయి వంటిది. శక్తి మతిని చూచి చన్నది మొదలు కోలాహలుడు తదేక చిత్తుడై అతను తాపముపాలై తన రంభాది కామినులకు దూరమై బాధపడుచుండెను. కార్చిచ్చు నందు కామానలత్వ మారోపించి తత్కృత వ్యాపారములను శ్లేషతో వర్ణించినాడు. తన కలయికలచే పెంపుగాంచు రంభాది దివ్య భామినులు తల వంచుకున్నారని రాజ పరము, తన శిఖరము లందు పెంపుగాంచు అరటులు కార్చిచ్చు వలన నీరుడిగి కమలి అగ్ర భాగములు వంగినవని పర్వత పరము తన ఆ సక్తులచే ఘనత నందుచున్న మధుర కంఠముగల కాంతలు దగ్గరకు వచ్చి పైకొనక దూర దూరముగా నిల్చి మాట్లాడిరని రాజ పరము. తన యందున్న తీగలలో పెంపు వహించుచున్న ఆడ కోవెలలు కార్చిచ్చు మూల మున తనపై వ్రాలక పైకి లేచిపోయి ఆక్రోశించిన వని పర్వత పరము. తనవైపు సంతసము జూపు పద్మినీ జాతి స్త్రీలు తన వలని మోహమును ఎంత మాత్రము గాంచక యే వికాస ముడిగి మూతి ముడిచి కొనిరని రాజ పరము సెలయేటి యందు వికసించు తామర తీగలు రాత్రి కాకున్నను కార్చిచ్చు మూలమున వాడిపోయి అగ్రభాగములు ముడిచిన వని పర్వత పరము. తన గొప్ప భోగములతో ఆనందించి అన్య కాంతలు (పట్టపురాని కంటె వేరైన కాంతలు) పెడ మొగమై ఊర్పులు నింపిరని రాజ పరము, తన పరపు బండలందు ఎసగెడు ఆడు పాములు కార్చిచ్చు వలన పూత్కృతములావరిం చిన వని పర్వత పరము. ఇట్లు అతి జాగరూకతతో రామ రాజ భూషణుడు ఉభయ వ్యాపారములను పొందుపరచి వానికి రూపణ యొనరించి కోలాహల ఘనో వ్యధను వెల్లడించెను కూటముల=కూటమి పదము యొక్క బహు వచన రూపము. ఇది తెలుగు పదము కలయిక యని అర్థము సంస్కృత పదమైనచో శిఖరమని అర్థము. కూటము బహు వచనము కూటములగును తన+లోలతల, తనలో+లతల అని విభాగము తమి తెలుగైనచో మోహమని సంస్కృతమైనచో రాత్రియని సంస్కృతాంధ్ర శ్లేషలు చేయబడినవి, అట్లులే పంకయను తెలుగు పదమునకు పైపు, ప్రవాహమని అర్థద్వయము ఇవి అను వాదమున సాధ్యపడవు. ఐన సాధ్యమైనంత శ్లేషను పొందుపరచి భావమును పోషించినాడు.

113 చ॥ కులగిరి రాజ నందనుడు కూరిమి నాభువనాభి నవోదితం
దళప దలంపులోపలనె దర్పక కేతన వల్గనంబు లం
చల మెల గోలు నంబుజ విశాల శిలీముఖ తాండవంబు లు
త్పల దళ మండ లాగ్రములు పైకొను నెట్టివొ తత్ప్రభావముల్

114 శ్లో॥ భూభృత్సు తస్య భువనాభినుతా స్మృతే ర్ద్రాగ్
గంతః (స్మ) ర ధ్వజ వివల్గన హంసధాట్యః
పద్మోత్పల చ్ఛద శిలీము ఖ మండ లాగ్రైః
సాంద్రా స్స్ఫు హైవ మహిమా సహి మాన నీయః

ఆక్రమింప పై నెత్తి వచ్చువాని ధ్వజము మొట్ట మొదట పిదప సైన్యము. ఆ పిమ్మట వాని సాధనములు చూపట్టుట సహజము ఇచట కోలాహలుని పైకి మీన కేతనము హంస సైన్యము అంబుజ బాణములు మిశింద శింజలు కలువ రేకుల మెరుగు బాకులు మున్నగు వానితో మదనుడు పై కొన వచ్చినాడని చమత్కరించినాడు, మీన వల్గ నది నదీ ధర్మములను మదన కేతన చలనాది రూపమున ఆరోపించినాడు. అనువాదముచితగా నున్నది. కాని పై కొను మాట లేదు. ఎట్టివొ తత్ప్రభావముల్ అను మూలమునకు మహిమా సహి మాన నీయః అనుమాట అతుకుటలేదు. సాంద్రా స్ఫురంతినను తన్మహి మా విచిత్రమ్ అని మార్చుట మేలు.

114 తే॥ మరుని నాళీక సాయ కోత్కరము కరము
ధరము దరమిడి మెఱయు పే యరిది సొరిది
ను రిది నవి మెల్లు తెగగోయు నురునదీరు
రంబుల జనింపవో శతారములు గావ.

115 తట ఛిఝ్ఝరి జాతానాం శతారాణాం కి మద్భుతమ్
స్మరసార సబాణానాం ధర సార విదారణే.

మన్మథుని నళిన శిలీ ముఖములు కోలాహలుని మర్మములను గ్రుచ్చి యటు నటు మెదిల్చుట ఆశ్చర్య కరముకాదు, ఆ బాణములుర వఃచే మెల్లు

(పర్వతములను) తెగ గోయుచు పారెడి ప్రవాహమున బుట్టినవి కావా పర్వత ములను భేదించెడి నూరంచుల వజ్రాయుధము గావా అని చమత్కారము. శతారమనగా నూరురేకుల తామర, నూరంచులుగల వజ్రాయుధము మెట్లు గోయు నదీఖురమున బుట్టినవి మరియు మెట్లు తమంతనే తెగనరకు వజ్రములై నవి కావున మెట్టగు కోలాహలుని మెరయుట వానికి వింత కాదని భావము అనువాదము శబ్దార్థభావ సుందరముగా నున్నది. తట పదమునకు నదీతట గిరి తటములని అర్థము ఖురిని ఖురగా మార్చుట యుక్తము.

115 చ॥ + కపురపు గమ్మ తావి.........దక్కగాన్

116 శ్లో॥ నాన్యైశ్చ శామనయ శాలి ఘనాలి నీత
నదయం చి తామృత భరా న్నగ తాప వహ్నిః
పాటీర నీర ఘన సార తుషార సార
తారాలి దార మణి వార ఝ రాది పూరైః

అనువాదము రమణీయముగా నున్నది, శబ్దార్థ భావములు పరవళ్లు తొక్కినవి.

116 ఉ॥ శైలకులేంద్రుడిట్లు..........నిశ్చితాత్ముడై

117 శ్లో॥ మాద్యద్ధ్వనీ శుక పికాలి శిఖావలాలీ
మంజు స్వనా సహమనా మద నాస్త్ర దూనః
అంచన్నదీ రస భరా ప్లవనా ద్ర తేత
త్సౌఖ్యం కథం ను భవితేతి స నిశ్చలాత్మా.

'మదనాస్త్ర దూనః అను పదము వలన' కంతు శరవేదనదీర, అనునది అభివ్యక్తమగును. కావున ప్రత్యేకించి నిర్దేశించలేదు. అనువాదము చక్కగా నున్నది.

117 క॥ రుచి రాజిత మణిభూషా, రుచిరాజ వెలుంగ దివ్య రూపోజ్జ్వలుడై
యచలాధీశ్వరు డొకనా, డచలామణి హార మగుమహా నది జెరెన్.

118 శ్లో॥ ధరా ధర సుతో దీప్తి కరా భరణ భాసురః
ధరా వర మణీ మా లాం చిరాదర మగాన్న దీమ్.

అచలా ధీశ్వరుడు చలింపని వారిలో పేరెన్నిక గాంచినవాడు కూడ చలించి పోయినాడని అంతరార్థము అచలామణిహారము చిత్త చాంచల్యములేని స్త్రీలకు మణిహారమైనది ఆ తరంగిణీ రమణియని చమత్కారము. ఇది అనువాదమున రాలేదు. చిరాదరమ్ అనునది ప్రాస కొరకు వచ్చినది. చిర కాలము నుండి ఆదరము కలుగుచుండ అని అర్థము ఎంతో కాలము నుండి ప్రేమ పెరుగుచున్నందున అనే అర్థమును భావించుకొన్నపుడు దాని సార్థకత ఏర్పడుతుంది.

118 శా॥ చేరన్ రా నదియుం దటోద్గత ఝరీ సీమాధికోదగ్రినం
చార శ్రీ నెదురేగి యూర్మిమయ హస్తన్యస్త రాజీవరా
జీ రాజన్మణి భాజనంబుల రజ శ్శ్రీగంధ కింజల్క రే
ఖారక్తాక్షతముల్ వహించి వరుసం గావించె బూజా విధుల్.

119 శ్లో॥ పద్మాభిరామ మణి పాత్రి లసత్పరాగ
శ్రీగంధ కేసర శుభాక్షత వీచిపాణిః
ఆ తీర పూర కన దుత్కలి కాభియానా
తస్మై తతాన తటినీ తరుణీ సపర్యామ్

పద్మములనే పద్మ రాగమణి పాత్రలందు ప్రకాశించు పరాగమను శ్రీగంధము కింజల్కములను అక్షతలుగల వీచి హస్తములు గలదైయని పూర్వార్థము యొక్క అర్థము. పరాగ శ్రీగంధ కేసరాక్షత నిండి పద్మమయ మణి పాత్రలను వీచీ హస్తమున దాల్చియని దీని భావము. తృతీయ పాద ముచితము గాలేదు. తీరాభ్యు పాగత ఝరాకృతి సత్ప్రచారాయని మార్చుట యుక్తము. తీరమందు ద్వార త్వారోప మాక్షిప్తమగును. తీరమను ద్వారము వద్ద ఝరా కృతితో ఎదుర్కొనిన సత్ప్రచారము గలదైయను అర్థము వచ్చును. సత్ప్ర చార పదము శ్లిష్టము. మంచినడక చక్కని ప్రవాహ గతియని అర్థద్వయము.

119 తె॥ గిరియును దదంతి కోత్తుంగ తరచిరత్న, రత్న తట పీఠిజెందెగా
రవము వలల వరలలిత వాహినీ వైభవంబుగాంచి, కాంచె
బహు పద్మ నిధి లాభ కౌతు కంబు.

120 శ్లో॥ తట రత్నాసనా సీన స్తతో గిరి రగాన్ముదమ్
శ్రిత తద్వాహినీ భూతిః శ్రీ పద్మ నిధి (లాభ) తః

కోలాహలుడు గౌరవము మీర రత్నమయ మగు ఉత్తుంగ తటాసనమున గూర్చొనిన వాడై ఆ శుక్తిమతీ వైభవముగాంచి అనేక పద్మ నిధులు లభించి నంత సంతోషము జెందినాడు. వాహినీ వైభవంబుగాంచి కాంచె బహు పద్మ నిధిలాభ కౌతుకంబు అనుమూలమునకు 'శ్రి తతద్వాహినీ భూతిః శ్రీ పద్మ నిధి లాభతః అని అనువాదము. పద్మ నిధులు లభించుట వలన ఆశ్రయింప బడిన వాహినీ భూతిగలవాడై అని దీని అర్థము ఆమె సౌందర్య వైభవమును జూడగానే పెక్కు పద్మ నిధులు దొరికినంత సంతోషమును పొందెనని పద్య భావము అనువాదమున స్పష్టముగా వ్యక్త పడుటలేదు. భావ దృష్టి కన్న యతి దృష్టి మన అనువాదకునకు ప్రధానము కదా.

120 వ॥ అప్పు డప్పుణ్య తరంగిణి యన్న గా గ్రిణితో నిట్లని యె.

121 గ॥ తదానీం పుణ్య తరంగిణీ మణిః శిఖరిణ మభాణీత్.

121 సీ॥ అతుల శైవల వతీశతము లీనెడు మీకు, నాయిచ్చు విమలార్ఘ్య
తోయ మెంత। ప్రాలేయనిలయ సంభవము గాంచిన మీకు,
బన్నీట నొనరించు పాద్య మెంత। సరస మందార మంజరుల
రంజిలు మీకు, బెనచి పూదండ లర్పించుటెంత। గోరత్న
దోహన గురులక్ష్మి గలమీకు, నుపదగా మణి వస్త్ర మొసగు టెంత

127 శ్లో॥ నద్యాలీ జనకస్యతే నగమణే నవ్యార్ఘ్య తోయం కియ
న్నీహా రాచల జన్మన స్సురభిలం నీహార పాద్యం కియత్
మందార స్త బకోజ్జ్వలస్య మహతో మాల్యార్పణం వా కియత్
రత్నా ధార గురుశ్రియ స్స్వకలి (తోర) త్నోపహారః కియాన్

ఈ పద్యము పైకి స్తుతిగా నగుపడినను పర్యవసానమున నింద స్ఫురించును. కోలాహలుని చూచిన తోడనే ఆమెకు అనాదరము కలిగినది. అతని వెర్రి నవ్వు వెకిలి చేష్టలు ఉద్ధత వేషము చూచిన తోడనే ఆ అనాదరము పరిణతి జెందినది. పెద్ద యింటివాడు హద్దులు లేక పెరిగిన వాడు. బండ వంటివాడు సౌకుమార్యమన్నది అతడెరుగడు. తాను సరసురాలు పైగా శుక్తిమతి. అతడు నామమును బట్టియే కాదు స్వరూపతః స్వభావతః కోలాహలుడు. నూర్లనదులు గల మీకు నేనిచ్చు నీరెంతయని సామాన్యముగా స్తుతి, నీవద్ద నున్నవి నాచుగల నీళ్లు, నేనిచ్చు నది విమలజలము. స్వచ్ఛ జలమును చూచియైన యెరుగని వాడవని సారము. ఇట్టులే ప్రతి చోట నిందార్థ మభివ్యక్తమగునట్లు పద్యమును నిర్మించినాడు అనువాదము బాగున్నది కాని. 'నద్యాలీ జన కస్య' అని అనువాదము శైవలినీ శతములీను. అను మూలమునకు సరిపోదు. 'స్యాత్తే శైవలినీ శతోద్గమ భువ స్స్వచ్ఛార్ఘ్యే తోయం కియత్' అని మార్చుట యుక్తమనితోచును.

121 గీ॥ యనఘ యెవ్వారలైన గొండంతవారి, కవని గొండంత పూజ
సేయంగ గలరె। భక్తినే నిచ్చు నీ పుష్ప పత్రతోయ, మాత్ర
ములు గైకొనుటె కాక గోత్ర తిలక,

122 శ్లో॥ పూర్యతే నహి కే నాపి పూజాఽద్రి మహతాం తథా
పుష్ప పత్రోదకై ర్భక్తి పూర్వం దత్తైః ప్రసీదమే.

ఇది పై సీస గీతమున కనువాదము. కొండంత వారికి కొండంత పూజ అనునది జాతీయము. సంస్కృతమున తత్సదృశ జాతీయము లభింపదు కావున అద్రిమహతాం తథాయని అనువాదము చేయబడినది.

122 చ॥ విలసిత రత్న కూటములు వేలుపు గన్నెల కూటముల్ సుధా
కలిత సరః కృపీటములు కామిత నూతన వస్తు జాలదో
హల సుర భూజ వాటము లొకప్పుడు బాయక కల్గునీకున
వ్వల నొక యర్ఘ్య మీయ మగు వస్తువు గల్గునె ముజ్జగంబులన్.

123 శ్లో॥ రత్నకూట సుర రాజ కన్యకా కల్ప భూరుహ సుధాకర ప్రహ్వైః
భాసుర స్య భవతో జగత్త్ర యే కామ్య వస్తు కమనీయ మస్తి కిమ్

కూటములు కూటములవంటి పదవైచిత్ర్యము లేకున్నను భావము చక్కగా అనువాదమున సంగ్రహించి నాడు.

123 క॥ ఏతాదృశ గుణ గరిమన, మేతాత్ములు మీర లిచటికే తెంచుటయో
శీ తాద్రి తనయ మధుపరి, జాతాభి నవానురాగ సంపత్తిగదా.

124 శ్లో॥ ఏ తాదృశ గుణోపేత శీతా చల సుతాఽఽగతిః
స్ఫీతా మితాను రాగ జాతాతి శయతో మయి.

అనువాదమున ప్రాస సౌందర్యములో భావ స్ఫూర్తి కొరవడినది. తవ పదమ ధ్యాహార్యము నాయందు అమితానురాగం వల్ల కల్గిన అతి శయంవల్ల నీ రాక ఏర్పడిన దన్నది. అనువాదమున కర్థము. అనురాగము యొక్క అతి శయం వల్లనే నీ రాక సంభవించినది. జాతా పదం ఆగతిః అనుదానికి విధేయ విశేషణంగా ఉండాలి ప్రాస దృష్టి వల్ల వాక్యార్థభంగం వాటిల్లుతుంది.

124 చ॥ అనవిని గట్టురా కొమరు డానన గహ్వర రోచమాననూ
తన తర దంత హీర రుచి ధారలు పెల్వడ నొక్కలేతన
వ్వు నగి నిజంబ పల్కితి వచున్ భువనాశయ సన్నివేశవే
దిని సర సాగ్రగణ్యపు గదేయని యన్నది బల్కు వెండియన్.

125 శ్లో॥ ఇత్యాదృత స్స తరుణీ మణి మేవమూ చే
స్మేరాననో రదన హీర రుచి ప్రచారః
విజ్ఞాత విశ్వ భువ నాశయ సన్ని వేశే!
సమ్యగ్య దార్థ మవద స్సర సాగ్ర గణ్యే!

ఆనన గహ్వర పదము లేదు. స్మేరానన పదము రాజకుమార పరార్థము మాత్రమే ఇచ్చును కాని, కోలాహల పరమగు అర్థమునీయదు.

125 మ॥ పరమా మోదముతో న శేష తటి నీ పద్మా స్యలం గూడి నీ
వర విం దోద్భవు గొల్చి యేగుత టి నీయ చ్ఛా చ్ఛ భావంబు నీ
పర సత్వంబును నీగభీరతయు నీ సర్వం కష ప్రౌఢి నీ
పరిపూర్ణత్వము గాంచి మెచ్చి మదిలో భావింతు నిన్నెప్పుడున్.

126 శ్లో॥ సామోద మబ్జజ సభాగమనే యుతాలీం
త్వాం వీక్ష్య చింతన పరోస్మి తి తాను రా (గాత్)
(అచ్ఛా చ్ఛ తా సరస) తాతి గభీర భావాం
సర్వం కషత్వ పరిపూర్ణ తరత్వ రమ్యామ్.

'కాంచి మెచ్చి మదిలో భావింతు నిన్నెప్పుడున్, అను మూలమునకు', త్వాం వీక్ష్య చింతన పరోస్మి తతాను రాగాత్, అని అనువాదము సరసముగా లేదు. కోలాహలుడు రాజ కుమారుడు. అట్టి తరి నాతడు నెమ్మది నెమ్మది తన భావమును వెల్లడించును కాని నిన్ను జూచిన తోడనే నాకు ప్రేమ కలిగినది. అందువలన చాల చింతకు గురియైనానని అనాగరికునిగా భాషింపడు కదా. ఈ లక్షణము మూలమున గుప్త పరచబడినది. అనువాదమున బట్టబయలు చేయబడినది తన భావమును వెల్లడించుటకు తగిన విధముగా నుపక్రమించు పద్ధతి మూలమున పోషింపబడినది తరువాతి పద్యములో మరియొక మెట్టెక్కినట్లు వక్రోక్తి గర్భితముగా మూలమున కోలాహలుడు వాక్చాతుర్యము చూపును అనువాదమున ఆ సర్వం కష ప్రౌఢి లేదు

126 శా॥ ఆ పద్మో ద్భవు నోల గంబునకు దివ్య స్త్రీ పిసుల్ నిచ్చ రా
రో పోరో మ టి యెంద ఱే నియును వారున్ మేము సంధింపమో
యే పద్మా ననం జూచినం జెలియని న్నీక్షించిన ట్లుండ దే
లా పల్మాటలు పూర్వజన్మ కృతముల్ గాబోలు నీ నెయ్యముల్.

127 శ్లో॥ తత్ప ద్మ భూ సదసి త్వా ద్భశ సింధు కాంతాః
కిన్నో గతా గత పరాః కి మదృష్ట పూర్వాః
తద్వీ క్ష ణాత్ త్వద వలోకనజో న మోదః
ప్రాగ్జన్మ హార్దమయి కిం బహునా మయాదమ్

త్వాదృశ అనుచోట వకార భంగము కావించినచో ఉద్దేశభంగ మేర్పడుతుంది. వకారభంగము కావించనిచో గణభంగ మౌతుంది. తత్పద్మ ఘూసదసి చోట 'తస్మిన్ పిధేస్పదసి' అనుట యుక్తము. చతుర్థ పాదమున సమన్వయము క్లిష్టముగా నున్నది. తృతీయ పాదమున ప్రతి పాదన సముచితముగా లేదు. త్వద్దర్శనే ముదపి యా నతదీక్షణే, ప్రాగ్-జన్మాను బంధి సఖిహార్ద మిదం ఖలూక్త్వా అని మార్చిన కొంత భావ స్ఫురణ కలుగును.

127 ఉ॥ నావలనం బ్రియం బెఱిగి నన్నొక మా అను బల్కరింప కీ
వె వెస నోర సేసి కొని యేగుదు గాని సరిల్లలామ ని
న్నే వగ జేరవత్తు మది కిం పగునీదు నవోదితామృతం
బే వగ గ్రోల గాంతు నని యే నెప్పుడుం దలపోయు చుండుదున్.

128 శ్లో॥ మత్తోఽనవేక్ష్య కుతుకం మధురం న చేష
దా భాష్య కేవల మరాల గతా త్వమాసీః
ఆరాద్వ సేయ మథ వా గమృతం పి బేయం
గత్వా కయాఽహమితి నిత్య మనోరథోఽస్మి.

నా వలనం బ్రియం బెరిగి అన్న మూలమునకు మత్తోఽనవేక్ష్యకుతుకమ్, అనునది సరియైన అనువాదము కాదు. నీయందు నాకేర్పడిన ప్రేమని కనీసము నావలనైన గుర్తెరిగి నాతో ఒక సరియైన మాటాడక నను జూచిన వెంటనే టరజేసికొని వెళ్ళుదువు. నీవు నాకు దూరముగా తొలగి పోయినను నిన్నెట్లు డాయుదును? నీన వోదితామృతము(వాక్సుధార సమును, నీయందలి క్రొత్త నీటిని) ఆస్వాదింతునని నిరంతరము తలపోయుదును. నా మీద నీకు మక్కువ లేదు కానీ నీ మీద నాకెల్లపుడు మక్కువ ఉన్నదని భావము. ఇందు కాము కోక్తి చాతుర్యము సరసముగా చిత్రించబడినది. నానుండి మధురమగు కుతూహలమును జూడకయే నాతో కొంచెము మాటాడకయే కేవలము నీవరాళగతి నవలంబింతువు, మరియు నేను దూరము నుండు వాడను ఏగతి నీ వాగమృతము గ్రోల్దునని నిరంతరము కోరికలు కలిగి యున్నాను. అని అనువాదము. ఆరాద్వ సేయమ్ అన్నపుడు దగ్గర నుండు వాడను దూరము నుండువాడను అని అర్థముచెప్పకోవచ్చు. ఏను గమన ప్రయాస కోర్చి వచ్చినానని తర్వాత కోలాహలుడనుసు,

కావున నేను దూరమున నివసింతుననియే దాని అర్థము అనువాదమున గాంభీ ర్యము లేదు కోలాహల పాత్ర చిత్రణలో మూల కవి చూపిన నైపుణ్యము అనువాదమున కనపడదు. నావేడుకను చూడకయే వాగమృతమును త్రాగెదను మున్నగు మాటలు విరసముగా నున్నవి 'నైవావగమ్య హృదయం మధురంమ మేత, దా బాష్య పార్శ్వ గతయేవ గ తాత్వ మాసీః, కేనా శ్రయామి విధి నాప్యదితామృతం తే, సిద్ధ్యే న్న యేతి నితరాం సముదేతి చింతా. అని మార్చిన బాగుండునని తోచుచున్నది.

128 తే॥ విమల మధుర మనోహర వృత్తి వెలయు, వారి గొనియాడ బుధు లెంత దూరమైన; బోవుదురుగాన యేను నీ పొందుగోరి, దవ్వు నక వచ్చితి నశేష తాపశమని.

129 శ్లో॥ అమల మధుర చేతో హారి గుంభ ద్రిసాఢ్యాన్
స్తుత మతి రతి దూరం స్తోత్రి గత్వా బుధాలిః
ఇతి విదిత విశేషో హేలయై వాగ తోహం
విదలిత గతిఖేదో విశ్వ తాపాప హంత్రి.

స్వచ్ఛమై మధురమై ఎదుటి వారి మనస్సు నాకర్షించు ప్రవృత్తితో విలసిల్లు వారలను (నిష్కల్మషమై మాధుర్య భరితమై ఒప్పుచున్న నీటి నని అర్థాంతరము) పొగడుటకై ఎంత దూరమైన విజ్ఞులు వెళ్లుదురని భావము. మూలాను గుణముగా నను వాదము చేయబడినది. కావి స్త్రీ పురుషులకు సమాన ముగా నన్వయించునట్లు వెలయు వారినని తెలుగులో నుపయోగింపబడినది. రసా ఢ్యాన్ అనునది పురుషులకే అన్వయించును కాని స్త్రీల కన్వయింపరు కోలా హలుడు శుక్తిమతి దగ్గరకు వచ్చుటను లోకో దాహరణముతో సమర్థించు కొన్నపుడు తత్ప్రతీతికి పుంలింగ నిర్దేశము భంగకరమగునవి తలంతును.

పరమ మధుర చంచత్పావనాచ్ఛాశ యానాం
గుణవిచయ ముపైతి స్తోతుమా రాద్బుధోఽపి.
అని మార్చిన బాగుండునని తోచును.

129 ఉ॥ చెప్పెడి దేమి నాకు గల జీవన మంతయు నీక కూర్చి యె
ల్లప్పుడు నిన్ను బాయక ప్రియా చరణం బొనరింప నేర్తు నీ
చొప్పున కీవు నియ్యకొని చొక్కపు జక్కవ గుబ్బలాడి మేల్
దప్పక యంత రంగమున దారిచి నన్ను నదీను జేయవే.

130 శ్లో॥ మజ్జీవనం తవని యోజ్య మహాం తరంగ
మంచ త్ప్రియా చరణ మాకల యే కి ముక్త్యా
చక్ర స్తని భ్రమరవేణి చకోర నేత్రే
నాలీక సన్ముఖి నదీన మముం విధేహి.

నాకు గల జీవన మంతయు నీ గూర్చియనుటకు మజ్జీవనం తవని యోజ్యయని, ప్రియా చరణంబొన రింప నేర్తుననుటకు, అంచత్ప్రియా చరణ మా కలయే యని అనువాదము మహాంతరంగమ్ అను పదమునకు సమన్వయము లేదు. ఈ చొప్పున కీవు నియ్యకొని మేల్ దప్పక యంత రంగము దారిచి అను మాటల జోలికే పోలేదు కాని వీనితో నేమి యనుకొని మూలమున లేని చక్రస్తనాదులతో తృతీయ పాదము నింపి నాడు. న+దీనం+నదీనమ్= అని శ్లిష్టత్వమును మాత్రము కాపాడి నాడు. కమలేందీ వర షండ మండిత యను శ్రీనాథుని శృంగార నైషధ పద్యము గుర్తు రాక మానదు.

మజ్జీవనం త్వయి నిధాయ సదాఽవిహాయ, సేవేచ దాస వదహం లలితో పచారైః, స్వీ కృత్యమా మిహ రసేన నిజాంతరంగే, నాళీక సన్ముఖి నదీన మముం విధేహి, అని మార్చిన మూల భావము ప్రస్ఫుటించును. ప్రియోపచార పదము రాలేదన్నచో ద్వితీయ పాదమున సేవే ప్రియోప చరణై ర్లలితై స్సఖి త్వామ్, అని మార్చవచ్చును.

130 క॥ అనవిని నగ రాజు ఘన, ధ్వని గరిమకు గలగి ముకులిత
కరాంబుజయై। వినయమునయంబు భయమును, మనమున
బెనగొనగ శుక్తిమతి యిట్లని యెన్.

131 శ్లో॥ తదావ దంత మూచే సాతం ఘన స్వ నితా విలా
ముకుళీకృత హస్తాబ్జా ముద్భృతి విలయా న్వితా.

నగరాజు మాటకు వినయము నయము, భయము మనమున బెనగొన శుక్తిమతి యిట్లనియె నను మూలమునకు అనువాదము దగ్గరగానున్నను ముత్ప దను సారస్య భంజకముగా నున్నది, తన మాటకు తప్పు డర్థము చేసికొని, వెకిలి మాటలు నగరాజు పలుకునకు అందు కంగీకరింపని శుక్తిమతికి మోదము కలుగుననుట విరుద్ధము కావున "సంపుటీకృత హస్తాబ్జ సంత్రాస వినయాన్వితా" అని మార్చుట యుక్తము.

131 సీ॥ నిలువెల్ల నీ చాతి నీ చోప సరణంబు, ప్రకృతి యెల్లను జాడ్య
పరిణతంబు। పెంపెల్ల నియత గాంభీర్యమాన విహీన, మంతరం
బెల్ల బంకా విలంబు। జీవనం బెల్ల నంచిత బుద్బుదప్రాయ,
ముదయమెల్లను దుర్దినోన్ముఖంబు। గతులెల్ల గుటిల ప్రకార
కారణములు, త్సేకంబులెల్ల భంగా కులములు.

133 శ్లో॥ యానం నీ చాతి నీ చాను సరణ మఖిలం జాడ్య కృత్తో నిసర్గో
గాంభీర్య వ్యాప్తి హీనా సతతముపచితిః పంక భాగా శయో మే
అత్యంతం దుర్దినోత్థో నిరవధి హృదయో జీవనం బుద్బుదాంచత్
కౌటిల్యా ధార సీమా గతి రధి కతరోత్సేక సంగోతి భంగః.

అనువాదము మూలాను గుణముగా నున్నది 'జాడ్యకృత్తో నిసర్గః అను చోటి 'జాడ్య క్లప్త స్వభావః, నిరవధిః, చోట 'హతగతిః, బుద్బుదాంచత్, అనుచోట 'బుద్బు దాభమ్', 'కౌటిల్యాధార సీమా' అనుచోట "కౌటిల్య ప్రాయభూమా" అని మార్చిన సరసముగా నుండునని లోచుచు.

131 తే॥ నిలుకడ హుంశిక్కి తావులు పొలసు వల్చు, నిట్టి మాబోంట్లతో
జెల్మి యెట్లు పొసగు। నచలి తోత్తుంగ ధైర్యన కలఘుమతికి,
ననఘుతికి నభంగ శీలున కు నీకు.

132 శ్లో॥ అచలితోన్నత ధైర్య మహామతేః, నఘగతే సదభంగగ
నిసర్గతే॥ అహవా సంగతి రర్హతి మాదృశై రనియత స్థితి
గంధ గుణైః కథమ్.

ఇది పై సీస గీతానువాదము. అనువాదమున తావులు, పొలసువల్చు అనునవి లేవు. కేవల గంధము కలదు. 'నిలకడ హుళక్కి' అనుటకు 'అని యత స్థితి, అని చక్కని అనువాదము. 'మాదృశైః, అనునది సమన్వయిం చుటకు 'జనైః, అనునది అధ్యాహరించుకొన వలయును.

132 క॥ పుడమి నచలేంద్రు లెచ్చట, జడ వాహిను లెచటనెచటి
సఖ్యము విన జొ౹ వ్పడదు పొడవడరు మీయెడ, నెడపక
మారసములె చటికెక్కు మహాత్మా!

133 శ్లో॥ క్వాఽచలా, వాహిన్యః క్వవాథ జగతీదృశామ్
క్వ సఖ్య మున్న తాలోహః క్వ మహాత్మన్ రసశ్చనః.

'పొడవరు మీ యెడ నెడపక మార సములెచటికెక్కు, అను మూలము నకు 'ఉన్నతారోహః. క్వ మహాత్మన్ రస శ్చనః, అను అనువాదమున మూల భావము సరిగా ప్రతిబింబింపలేదు.

133 ఉ॥ నావిని గట్టుతేడు వదనంబున విన్నదనంబు దోప నో
శైవలినీ శిఖామణి నిజంబు భవత్కమనీయ కాంతి ధా
రావళిలో మునింగితి దయామతి ద్రోవక సుళ్ల బెట్టె దో
నీవిక గ్రుచ్చియెత్తి ఘన నిర్వృతి దెప్పల దేల్చెదో యనన్.

134 శ్లో॥ ఆకర్ణ్య తద్వచన మద్రి రువాచ సింధుం
మగ్నోఽస్మి తే తటిని మంజుల కాంతిపూరే
కిం మాంభ్రమై స్తుదసి కిన్ను దృఢోప గూఢం
హర్ష ప్లవం నయసి హార్ద దయాధి యేతి.

'సుళ్లబెట్టెదో, తెప్పల దేల్చెదో. అను జాతీయములను నదద్యర్థమున నిమిడించి రామ రాజ భూషణుడు చాకచక్యమును ప్రదర్శించినాడు తెలుగు సాహిత్యమున జాతీయములను సందర్భమునకు స్వాభావికముగా అతుకునట్లు

ప్రయోగించిన వారరుడు. వీనిని సంస్కృతమున పొందుపరచుట ఎంతటి ప్రతిభావంతునకైన దుష్కరము. కావున 'సుళ్లబెట్టెదో' యనుటకు 'భ్రమైస్తుదసి' యని, 'ఘన నిర్వృతి దెప్పల దేల్చెదో' యనుటకు 'హర్ష ప్లవం నయసి' యని అనువాదము చేయబడినది. 'ఆకర్ణ్య తద్వచన మద్రిచోట 'శ్రుత్వా వివర్ణవదనో౽ద్రి' యనుట యుక్తమని తోచును. యతికన్న భావము ప్రధానముగదా.

134 చ॥ వెలవెలబాఱ్చి శక్తమతి వెండియు గొండల రేని బల్కొన
గ్గల మగు పంచ సాయ కవి కారమునన్ నిజ గౌర వోన్నతు
ల్దలపవు గాని మాదృశ జడ స్థితి దెప్పల దేలుచున్న మీ
కులగిరి కోటిలో గడుల, ఘుత్వము గాదె తలంచు చూడు మా.

గ॥ తదా కర్ణ్య సాపి సదాశయా వివర్ణ వన నా౽జని.

135 శ్లో॥ తం ప్రాహ సా౽థ నను తా మరసాస్త్రఖిన్నః
కిం నాత్మనః స్మరసి గౌరవ తుంగ భావౌ
(మా) దృగ్జల స్థితి మహో ప్లవ ఖేలనం తే
కిం లాఘవాయ న కులాద్రి కులే స్మరేతి.

అనువాదము సరళముగా సరసముగా నున్నది. 'ఖిన్నః' అనుచోట 'దూనః, అన్న బాగుండును.

135 మ॥ మతికీర్తి డారతి గల్గెనేని సకల క్ష్మా పుణ్యదే శాలిఁగాం
చి తప స్స్ఫూర్తి మెయిం కృశించి వన రాశిం జెందు మాబోంట్లను
ద్ధతిచే గ్రమ్మగ నేల నీకు గ అవే తారుణ్య లావణ్య జృం
భితరం భాదిని లింప భామలన భూభృన్మౌళి రాగాంధుడై.

136 శ్లో॥ కీర్తి డా మతి ర్యది వృథా కృత పుణ్య దేశ
వాసే తపః స్థితి కృశే వన రాశి భాజి
హా హంత మాదృశి హ తాక్రమణం కిమర్హం
రంభాద యో జగతి రమ్యతరా న కింతే.

జనే అని అధ్యాహారము. అనువాదమున శ్లేష చక్కగా పోషింపబడినది.

గ॥ ఇతి వదంతీం స్రవంతీం రసాధరపతీ రాగాంధ లోచన స్పన్నీరయా
మాస గీరయా వాసః

136 సీ॥ అతనుభూతి ఘటింప దయ్యోనే చదలేఱు, సిక దాల్చు నిందాన
చిత్రకునకు। వరవంశ వైఖరి వదలెనే రవి సుతా,పతి యైన దై
తేయ భంజనునకు। వసులాభ సంపత్తి మసలెనే జాహ్నవి, జే
కొన్న శంతను క్షితిపమణికి। గమలోదయఖ్యాతి దెమలెనే
నానాన, దీకాంతు డయిన రత్నాకరునకు.

137 శ్లో॥ జాతావాఽతను భూతయః కిము జటా స్స్యాతాభ్ర సింధో
ర్విభోః। యాతా కిం యమునా పతే ర్యదుపతేః స్వీతాత్మ వంశ
ప్రధా। హా నాకిం వసు పూర్తి రచ్యుత పదీ దీనాత్మన
శ్శంతనోః। న్యా నాకిం కమలోద యాప్తి రుద ధేర్ నానా
స్రవంతీ పతేః.

'వాతను భూతయః' అనుచోట వాస్థానమున 'నా' చేర్చవలయును లేనిచో విపరీతార్థ మేర్పడును. శ్లేష చక్కగా నిర్వాహింపబడినది, ప్రాస కొరకు 'దీనాత్మ' (పదము) యేర్పడినది.

136 తే॥ వారి కేలా మవము వచ్చె వనిత యెంత, మాఱుమనలెదు
వట్టి నేమములు చాలు। నేలు నన్నని సతి కమలాలి పట్టు, ప్రబల
తర దీర్ఘ భుజ శాఖ బట్టుటయును.

137 శ్లో॥ తేషాం యల్లా ఘవం తస్మే తే వృథా నియమై రలమ్
విలంబసే కియద్వేతి వివశో జగృహే సతామ్.

ఎంత మారు మనలెదు అని మూలము. ఎంతగా ప్రాతి కూల్యము వహింతువని దీని అర్థము. మారు మసలెదు అన్నదానికి జాప్యముచేసెదవేమని

భ్రమించి 'విలంబసే కియ ద్వేతి' యని అనువదించి నాడు. 'విముఖాసి ఈతోవేత్తి, యని మార్చుట యుక్తము.

137 గ॥ తదానీం పర్వతాధీశ్వరః ప్రబల తర దీర్ఘ శాఖాభుజాగ్రహీత కమలాలి వాసస్థితే స్మ సంభ్రమాయాః తటిన్యాః (వాసః-వస్త్రము, నివాసము).

137 ఉ॥ వేణి చలింప గంపిత నవీన మృణాల భుజాగ్ర కంకణ
శ్రేణి నటింప లోల శఫరీని బిరీ సకటాక్ష కాంతి వి
స్నాణము చూప హంసక గణ క్వణనంబును మీఱ సైకత
శ్రోణి వివర్తి తాబ్జముఖ శోభిత యై కడుసంభ్రమించినన్.

138 శ్లో॥ వేణీ చచాల బిసవద్భుజ కంకణానాం
శ్రేణీ ననర్త విబభు శ్శఫరీ కటాక్షాః
నాణీయసీ పరిరరాణ చ హంస కాళీ
శ్రోణీ లస త్పులిన సాచిత మబ్జ వక్త్రమ్.

పద్యము వలె శ్లోక మందము గానున్నది. 'బిసవత్' అనుచోట 'వత్' అనునది లేకున్న బాగుండును బిసములనే భుజములని నదీ పరార్థము, బిసముల వంటి భుజములని స్త్రీ పరార్థము. స్త్రీ పరమగు అర్థమున 'వత్' అను తద్ధిత ప్రత్యయము సరిపోవుసు, కాని నదీ పరమగు అర్థమున అది సమన్వయింపదు. కావున 'వద్భుజ' అనుచోట 'సత్కర' అని మార్చుట భవ్యము. సైకతశ్రోణి, యను నది శుక్తిమతీ బోధకమగు కర్తృ పదము, అనువాదకఁడే కపదముగా భ్రమించి 'శ్రోణీలసత్పులిన సా చితమ్' శ్రోణివంటి పులినము వైపు త్రిప్పబడినదని అనువదించినాడు. అబ్జ వక్త్రము వివర్తితము చేయగా మొదట వేణి చలించినది. పిదప మృణాళ భుజాగ్రములతో వలదని నిరోధింపగా కంకణములు నటించినవి. మొగము త్రిప్పు కొనుటచే శఫరీ కటాక్షముల తళుకు-బెళుకులు విన్నాణము జూపినవి. సంభ్రమించియవ్వలిః అడుగులిడ బెనగుటచే హంసకములు మ్రోగినవి. ఇట్లు కొంచెము పెద మరలుటచే సైకత శ్రోణి యొరపు

చూపట్టినదని నదీ సుద తీ చేష్టా క్రమోపన్యాసము మూలమున నొనరింపబడినది. మొదట మొగము త్రిప్పుకొనుట చేతులతో నడ్డగించుట బెదరు చూపులతో వలదని వేడుట అందుకు పీడనిచో నవ్వలికి బోవ నడగులు బెట్టుట పెనుగులాడి మరలుట యనునవి ప్రతికూల నాయిక యొక్క స్వాభావిక ములగు చేష్టలు. వీనినే శుక్తిమతి యందు కవి సమారోపించి రసోచిత చమత్క్రియా కల్పనా కల్ప భవ్యముగా నిర్మించినాడు. పలుచోట్ల ఇదే కల్పన ప్రస్ఫుటించును శుక్తిమతీ కోలాహలుల సన్నివేశ మొక మధురోపహారమే కాదు, మనోవిజ్ఞాన సర్వస్వము. పర్వతము నది నడ్డగించునపుడు నదిలో నేర్పడు ధర్మమును కూడ స్వాభావికములే. అనువాదమున కడు సంభ్రమించిన, అనునది లేదు. 'శ్రోణీల సత్ప్పులిన సాచిత మబ్జ వక్త్రమ్, అనుచోట తస్యానితం బపులినేవలి తం ముఖాబ్జమ్ అనుట యుక్తము.

138 వ॥ నిలు వెల్లన్ నిరపాయ శంబరమయో న్మేషంబునం బొంగు తా
గల గూలంకషగాఢ గర్వ నిధులం గాంతాను కూల్యంబు చే
దల మే సిల్పగ బ్రాతి కూల్య పరుషోద్య త్ప్రౌఢిగా కంచన
య్యల ఘుం డాస్యము జేవు జింప నిజరూపాటోప సంరంభియై

139 శ్లో అక్షోభ్య శంబర మయాతి శయాబ్ధి పూర్ణాః
కూలంక షానుపమ గర్వ కృతాధి వాసాః
కాం తాను కూల్య కలితాః ప్రతి కూల తాఢ్యాః
కింవేతి కోప భరితః కితవో బభూవ.

మూలమెంత రమణీయముగా నున్నదో అనువాదమంత పేలవముగానున్నది. నిరపాయమగు శాంబరీ మాయను ప్రదర్శించుచు పరిపూర్ణ గర్వముచే అలక్ష్యభావమును వెల్లడించుచు మిడసి పడెడి గయాళులను మర్యాదకు భంగముగలుగకుండ పురుషులు ఎంత అనుకూలముగా ప్రవర్తించినను వారలు అదుపులో నిలుతురా? వారికి తగినట్లు కఠినముగా ప్రవర్తించిన పుడే వారదుపు నందుందురు. కాని బుజ్జగింపులచే వారు వినరు కావున నేనానుకూల్యము జూపినకొలది, ఈమె ప్రాతి కూల్యమునే వహించుచున్నది. ఇక అనునయాదులు పకరింపవు నేనును అట్లులే ప్రాతి కూల్యము వహింపక తప్పదని మోము జేవురింప

తన ఆకారమునకు తగిన సంరంభము గలవాడయ్యెనని భావము ఇందు ప్రతి పదమున రమణీయమగు ధ్వనియున్నది. నిరపాయ శంబర, పొంగు, కూలంకష, అనుకూల్య ప్రాతికూల్య రూపములగు నదీ ధర్మములలో ప్రతికూల నాయికా వ్యాపారములను పొందుపరచినాడు ఆస్యము జేవురింప=కోపముచే ముఖము ఎర్రబారుచుండ, జేగురను గైరిక ధాతువుచే గుహ ఎర్రబడియుండుటయని అర్థద్వయము పర్వత ధర్మమును నాయిక ధర్మముగా రూపించినాడు. కాంతాను కూల్యమున ఒప్పువారు కూలంకషలై అనుపమ గర్వమునకు తావులై క్షోభింప నలవికాని శంబరం మాయాతిశయముచే నిండి యుందురు. ఇక ప్రాతి కూల్యము చాలునని కోపము నిండుకొన్న వాడై కోలాహలుడు కితవుడయ్యెనని అనువాదము చేయబడినది. అనువాదమున భావము మాట దేవుడెరుగు కనీసమర్థమైన స్ఫురించుట లేదు మార్చుట ఉచితము.

వైయాత్య శంబర కలో న్మిషిత ప్రచారాః కూలింకషా విరచిత ప్రతికూల భావాః కాంతాః ప్రియోప చరణైః పున రీశ తేకే రోద్ధుం, తదేవ పరమం మమచేతి రాగాత్ః

వైయాత్య శంబత కళ (మాయ) పెచ్చు పెరిగిన నడవడులు గల వారై కూలంకషలై ప్రాతి కూల్యమును నిరంతరము ప్రదర్శించుచున్న కాంతలను బుజ్జగింపు మున్నగు ప్రియోప చారములచే ఎవరైన అరికట్ట జాలుదురా? ఎవరికి శక్తి జాలదు. కావున అట్టి వారిపట్ల అట్టి వైయాత్యమే ఆ శంబర మాయా ప్రవృత్తియే ఆ ప్రాతి కూల్యమే కనబరచినపుడు వారి నదుపు బెట్టుట సాధ్య పడును. కావున నేను కూడ పద్ధతినే అవలంబించును. పైన పేర్కొనబడిన ప్రథమా బహువచనాంత పదములను ఏక వచనాంతములుగా జేసినచో "అహమపి తథైవ కుర్వే, అనుమాట స్ఫుటపడును.

144 సీ॥ ఇష్ట కృత్యము నిర్వహించు గానిది నంబు, శుచి మలీమసగతుల్
సూప వెఱచు। దాక్షిణ్యము వహించి తనరు గాని సదాగ, తిరజో
భర భ్రాంతి దిరుగ వెఱచు। జగతికి దే జంబు సమకూర్చు
గాని మిత్రుడు చండ కర శక్తి దొడర వెఱచు। గొలుచు
నాయమె చూపి నిలుచుగాని ధరిత్రి, జీవన దంబు గర్జింప వెఱచు.

145 శ్లో॥ ఇష్టం నిర్వహతే మలీమసగతిం నోపైతి భీత్యా శుచిః
దాక్షిణ్యం భజతే సదాగతి రలం గుంభద్ర జానాటతి
తేజో యోజ యిత్రైవ చండ కిరణై శ్శక్తిం న మిత్రోఽయతే
లోకే జీవ నదో న గర్జతి ఘనో ధాన్యాతి మాన్యాగతిః

అగ్న్యాదిదేవతలు తమతమ దోషములను విడిచి స్వస్వ శుచ్యాది నామోచితముగా గుణోచిత కర్మలందు ప్రవర్తించిరని వర్ణింపబడినది. అనువాదము చక్కగా నున్నది. 'కిరణైః, అనుచోట శ్లేష కు భంగమేర్పడి నది కర పదమునకున్న ఉభయార్థద్యోతన వ్యాపారము కిరణ పదమునకు లేదు. కొలచు నాయమె చూపి యనుచోట కొలువు గొలిచెడి మర్యాదనే చూపి యని, ధాన్యపురాబడిని చూపియని అర్థద్వయము "ధాన్యాతి మాన్యా గతిః" అని మార్చినచో కొంత ప్రతీతి కలుగును ధాన్య=ధన్య సంబంధమైన అయ= శుభావహ విధితో మాన్య=సమ్మానింప దగిన. అగతిః=అగమనము కలదని ధాన్య+ఆయ=ధాన్యపు రాబడికి, మాన నీయమగు ఆ గతి కలదని అర్థద్వయ మేర్పడును. అట్లులే తృతీయ చరణమున-తేజో యోజయతి ప్రచండ కర విస్ఫూర్తిం న మిత్రో యతే అని మార్చినచో శ్లేషకు భంగము వాటిల్లదు.

146 తే॥ దేవ త్వావక్ష కరుణా సుధా విశేష, పోషితా శేష సద్విష్ణ భూతలమున। నేటి తుద కీ ఋణంబున నాటుకొనినఁ, పాటు మది శిక్ష గింపవే పార్థివేంద్ర.

145 బుధాధృత త్వత్కరుణా సుధా సుఖిత భూతలే
దధా వత్య నదీ కాంతా వ్యధా మాకు విచారయ.

మహనీయులు దేవతలు నైన అగ్ని ప్రభృతులు సైతము నీయాజ్ఞకు వెరచి అనుకూలముగా ప్రవర్తించుచుండ నేడొక్కడు వెరవక చేసిన యవి నీతిన్ని వినుమని మూలము తెల్పుచున్నది. అనువాదయున 'నదీకాంతా' యను నది తత్ప్రతీతికి భంగము కలిగించుచున్నది. నాటుకొనిన పాటని మాత్రమే మూలమున చేర్కొనబడినది. ఆ పాటు ఎవరి వలన కలిగినదో తరువాతి

పద్యమున చెప్పబడినది కాని నదీకృతమని (పాటు) చెప్పబడలేదు ఒకనది. అందులో కాంత, ప్రశాంతముగా జీవించెడి లోకమునకు బాధ కలిగించిన దన్నచో నీవే ఆలోచించు కొనుమని 'విచారయ' అను పదమునకు ప్రయోజనము కాబోలు.

145 ఉ॥ అక్కట మిక్కుటం బగు రయంబున నెక్కడ నుండి వచ్చెనో
యొక్క నగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహముల్
పిక్కటిలంగ బెల్లున గుభిల్లున శుక్తిమతీ స్రవంతి పే
రక్కన వ్రాలి యాగె భువనావళి నుద్భట వింధ్య వైఖరిన్.

146 శ్లో॥ హా హంత కశ్చి దవనీభృ దతీవవేగ, మత్యుద్ధతిధ్వని కరోను
సమాగతస్సన్। వ్యాలంబతేస్మ వితితార్చటి శుక్తి మత్యాం,
వింధ్యాద్రి వజ్జగతి విస్తృత తుంగ శృంగః॥

"ఎక్కడ నుండి వచ్చెనో దిక్కటాహములు. బిక్కటిలంగ పెల్లున గుభిల్లున పేరక్కన వ్రాలి భువనాళి యాగె యనుటకు సంగ్రహానువాదము చేయబడినది. కాని మూలమున లేని తుంగ శృంగములను వాదమున నేర్పడినవి. కనీసము శ్లిష్టమగు భువనావళి పదమును గ్రహింపవలసి యుండెను "జగతి విస్తృత తుంగ శృంగః అనుచోట భువనరోధన మాదధాన అని ధ్వనికరోను సమాగతస్సన్, అనుచోట "ధ్వనికర స్సము పాగతస్సన్ అని మార్చుట యుక్తమని తోచును.

146 క॥ గోత్రాజన విత్రాసద, గోత్రార్చటి కోర్వలేక ఘూర్ణిలి నదియున్
మాత్రాతీత భయభ్రమ, పాతాళ్రయ యగుచు ధాత్రి
బడపడి యలమెన్.

147 శ్లో॥ స్థిరాజన దరాధార ధరాగతి భరాసహా
ధరా ధర ధరాయాత త్వరా భ్రమపరా (హి) సా

అనువాదమున పదార్థ బోధ క్లేశావహముగానున్నది. దానికి తోడు పదములకు ఎడము లేకుండ ముద్రణ చేయబడినది భూజనులకు దిగులు పుట్టించు కోలాహల పర్వతము యొక్క పతన వేగము సహింపలేక శుక్తిమతి తిరుగుడు పడి, మితి మీరిన భీతి గొల్పు సుడిగుండముల వెల్లువ పెట్టి భూమినంత ముం చెత్తినదని భావము. ఒక యువతి ఉద్ధతుడైన కాముకుడు బలాత్కార రూపమున ఆక్రమింపగా వానికి భీతిల్లి తల్లిని కౌగిలించుకొను నట్లు శుక్తిమతి ధాత్రిని కౌగిలించుకొనిన దని ధాత్ర్యాది పదములు ప్రయోగింపబడినవి. అనువాదమున అర్థాంతర స్ఫూర్తిలేదు. భూజనుల భయమున కాధారమైన పర్వతము (ధరము) యొక్క ఆగతి భరమును సహింపనిదై నది భయాయాత (భయము వలన కలిగిన) త్వరగలదై భ్రమ తిరుగుడు-సుడి పరమైన దని శ్లోకార్థము. అనువాదకునకు ప్రాస దృష్టి తప్ప భావదృష్టి తక్కువ, ధరాధరయను నది రాజ సంబోధన సంబోధన చిహ్నముకాని ఎడము కాని లేనపుడు సమన్వయము కుదుర్చుట క్లిష్టముగా నుండును.

147 ఉ॥ ఏమని చెప్పవచ్చు ధరణీశ్వర యాబలు సేగి తన్మహా
భూమిధరో పరోధమునన బొంగునభంగ సరిబ్జ రంబుపై
పై మహియెల్ల నల్లుకొని బల్విడి నం దను బింబితాభ్రరే
ఖామ హిమంబు గాన నగు గ్రక్కున మిన్నులు వడ్డకై వడిన్

148 శ్లో॥ వాచ్యాను కిం వసువిభో బహు భీతి రద్రి-
వర్యోప రోధ బహువర్ధిత సింధు పూరైః
ఆ పూరి తావ నితలే స్ఫుర దభ్ర రూప
మాకాశ పాత వదదృశ్యత హంత భీత్యా।

'ఏమని చెప్పవచ్చు' నను మాటకు 'వాచ్యానుకిమ్' అని అచ్చము పదానువాదము, సేగనగా కీడు బహు భీతియని అనువాదము చేయబడినది, 'మిన్నులు వడ్డకైవడిన్' అను మాటకు 'ఆకాశ పాతవత్' అని అనువాదము. భీత్యాపదము ఆకాశము పదముతో సమన్వయింపదు. 'భూమి ధరో పరోధమున బొంగు' అను మాటకు 'అద్రి వర్యో పరోధ బహు వర్ధిత' యని, అనువాదము, ఇది పదాను వాదము తప్ప భావాను వాదముకాదు. 'ఆ పూరితావనితలే' అనుచోట

'ఆ పూరితేఽవనితలే' యని ఆ పూరిత పదమును వ్యస్తము జేసిన బాగుండును. మిగిలిన చోట కూడ కొంత మార్పు జేసినచో అనువాదము సుందరమగును. "కిం ప్రోచ్యతే వసుపతే సముపద్రవోఽయం, గ్రావోప రోధ పరి జృంభిత సింధు పూరైః, ఆ పూరితేఽవనితలే ప్రతి బింబి తన్వమ్, వ్యో మైవ నిష్పతి తమిత్య కరో న్మ నీషామ్.

148 సీ॥ సర్వ సర్వం సహా చక్రంబు జడమయ్యె, గ్రామముల్ భంగ సంగతములయ్యె। నాలయ వ్రాతంబు లవన శూన్యములయ్యె, సాలముల్ కాండ శేషంబులయ్యె। వివిధ జంతు వితాన విహృతి వారిత మయ్యె, వస్తుజాతములెల్ల వంకలయ్యె! నరలోకమెల్లగంఠ గత జీవన మయ్యె, గలమంబు లప్రాప్త ఫలములయ్యె.

149 శ్లో॥ భూచక్రం నిఖిలం జడం భృశ మభూత్ గ్రామావలీ భంగభాక్
అత్వం తావన శూన్య మాలయకులం కాండైక శేషా ద్రుమాః
సత్త్వా నా మపి వారితా విహృతయ స్సర్వంచ వస్తూజ్జ రం
జీవాః కంఠగ జీవనా హి కలమాల్య ప్రాప్త తాదృక్ఫలా.

అనువాదము సముచితముగా నున్నది, మూలాను గుణముగా శ్లేష పోషింపబడినది, అవన శూన్యమ్=రక్షణ శూన్యమని, జల పూర్ణమని అర్థద్వయము. వారితాః=నిరోధింపబడినవని, వార్+ఇతాః=వారిని పొందినవి అని అర్థద్వయము, అప్రాప్త=పొందబడనివని, నీటి పాలైన వని అర్థద్వయము. (అనచి చ సూత్రాను సారము అప్ ప్రాప్త అనుచోట ద్విత్వము భయత్ర యుక్తమే),

148 తే॥ దోట చేను కొటారంబు దొడ్డియనెడు, నాస లన్నియు నిసుమంత లయ్యె స్వామి। పాద పద్మంబు లీక్షించు భాగ్యమునికి, దప్పి వచ్చితి మేము గోత్రాతలేంద్ర.

149 శ్లో॥ నిష్కుటా రామ గోష్ఠాది నిస్పృహా వయ మాగతాః
భవ త్పాదాబ్జ జాలోక భాగ్యాత్ స్వామిన్ కథంచన.

ఇది పై సీస గీతమున కనువాదము. ఇసుమంత లయ్యే=కించిన్మాత్రము లైనవని, ఇసుక నిండిన వనియు అర్థద్వయము. ఇట్లు రెండర్థములనిచ్చు పదము సంస్కృతమున లభింపదు, ఆ నిస్పృహతో నన్నట్లు 'నిస్పృహః, యనివాడినాడు. చేనును అనువదింపలేదు. నిష్కుటా రామ పదములకు గృహో ద్యాన, బాహ్యోద్యాన ములని అర్థమును గ్రహింప వలయును, అనువాదము చితముగా నున్నది. 'నిష్కుట క్షేత్ర, యని మార్చిన మార్చవచ్చును.

149 మ॥ అనుచున్ వారలు విన్న వించుటయు లోకానీక=రక్షాకళా
కనదుత్సాహ రసచ్ఛ విస్ఫురణ యై కన్దోయి గట్టెఱ్ఱ దా
ర్కొన సుర్వీజన సైన్య భంజన ఘన భ్రూభంగ భంగీ వినూ
తన శక్ర ధ్వజ ముధ్భవిల్ల ఖలగోత్ర ధ్వంస నోదగ్రుడై.

150 శ్లో॥ విజ్ఞాపిత స్తైరితి విశ్వరక్షా
రాజన్మ హోత్సాహ రసారు ణాక్షః
సలోక పీడాహృతి సాధక భ్రూ
భంగేంద్ర కేతు ర్గిరి భంజ నోత్సుకః

పద్య భావము చక్కగా నను వదింపబడినది. మూలమున నున్న అధిక పదోక్తులు లేవు.

150 క॥ నరవరు డభయం బొసగుచు, హరిరథ నిరసన మనోరయంబున
నరిగెం గరిభరణ పరిణత, కరుణా పరిణాహియగు జగత్పతి లీలన్

151 శ్లో॥ కరాభయ భరాధాయీ ధరాపతి రరాతి హా
పురాకరి వరం త్రాతుం మురారి వదరాద గాత్.

చక్కని అనువాదము, శబ్దార్థములు పరుగులు పెట్టినట్లున్నవి.

151 సీ॥ దళన శంబముల దుర్ధర మహీ ధరకూట, కోటి నుగ్గులు సేయు
కుంజరములు। ఖుర ధూత గురు ధూళి శరధిలీన నగాళి, మట్టు
దట్టించు నారట్టజములు। పటుచక్ర చంక్ర మార్భటి గొండ
లవియించు, సమిద భంగశతాంగ శతశతంబు। లెత్తువడ్డ మహా
కుభృత్తుల నతులిత, ధృతి జీరికి గొనని ధీరభటులు.

152 శ్లో॥ దంతా శ్చన్యతి దారి తాద్రి శిఖరా దంతావలా స్సైంధవాః
పారావార గిరీంద్రి మర్మ భర భిత్పాదోత్థ పాంసు (వ్ర)జాః
చక్రా ఘాత విఘూర్ణితా చలచయా శ్చామీక (రోద్య) ద్రథాః
సత్త్వో ద్ఘాటిత పర్వతా శ్చ సుభటా స్సాకం యయుః క్ష్మాభృతా,

అనువాదమ్ము సరసముగా నున్నది. నద్యా గుట్టు దట్టించు అను పాఠాను పాఠమ్ము 'మర్మ భరభిత్' అని అనువదింపబడినది. ఎత్తువడ్డ అనునది తెలుగు జాతీయము. ఇది అనువాదమున రాకున్నను, సత్త్వముచే పర్వత ములను సరకుజేయని భటులనుట వలన తాము సత్వము గలవారని, పర్వతములోని స్వత్త్వములని వెల్లడించి నట్టులైనది.

151 తే॥ తడయ కప్పుడు పతివెంట దవిలి నడువ, నమరుబృంహిత,
ఘోషిత ఘుమఘుమిత ఘు। జాస మాస్ఫాలితంబుల జడికి, వడికి
కులకు ధర మండలము గలగుండు వడియె.

152 శ్లో॥ బృంహితై ర్ఘోషితై స్తేషాం బృహన్నేమి రవై రపి
కోలాహలై స్త్వి చారాధ్యం కులా చల కులం తథా

ఇది సీస గీతానువాదము. 'కలగుండువడియె, కలతపడెనని అర్థము దీనికి 'విచారాఢ్యమ్' అని అనువాద మచితము కాదు, తెలుగు విచారము వేరు, సంస్కృత విచారము వేరు 'వ్యాకులితమ్' అనుట యుక్తము.

152 చ॥ అంత ననంత వేగ భుజ గాంతకు డమ్మహి కాంతు డా శ్రిత
స్వాంతము సంతసిల్ల సుర చారణ సన్నుతి పర్వ నవ్వనా
భ్యంతర రోధకం బగు మహాద్రి. నఖంబున మీటె న్రభ వి
ఖ్రాంతము గాగ దుందు భిక బంధము మీటిన రాము కైవడిన్

153 శ్లో॥ శ్రీ తాదృ త స్సిద్ధ సు రాది వందిత
స్తతో ముదా తద్వ నరో ధకం పదః
నఖేన చిక్షేప నగం సరామ వ
ద్ధ రాసదం దుందు భి కాయ మున్నతమ్.

52 పూర్వము రాముడు అరణ్యమున డ్డగించి యున్న దుందుభి కళేబ రమును కాలి బొటనవ్రేల, మింటికెగయునట్లు చిమ్మిన రీతి వసురాజు శుక్తిమతి నడ్డగించియున్న ఆ కోలాహల గిరిని తన గోటనెగ జిమ్మెనని భావము.

అనువాదము బాగున్నది. 'అనంతవేగ భుజగాంతకుడు, అభ్ర విభ్రాం తము గాగ, అనునవి అనువాదమున లేకున్నను భావ ప్రతీతికి భంగము కలుగదు.

153 క॥ వసు రాజయ్యెడ బలవ, ద్విస్స్మర పాద ప్రసార దీర్ఘాచలుడై యెసగగ వసుధాపరికీ, ర్ణ సరి న్నిర్ఝరము తక్షణంబున దిగిచెన్.

154 శ్లో॥ పరం వసు పతౌ ఖాద్య్ క్పాద దీర్ఘా చలే సతి
ప్రశు శోష క్షణా దుర్వ్యాం పరికీర్ణా సరిజ్ఝ రీ.

53 సూర్యుని యొక్క తీవ్ర కిరణ ప్రభావమున నదీ జలములన్ని తీసి పోయినవసి భూమి అంత నెరియలు పడినవని అర్థాంతరము వసురాజు తన చరణమును చాచి కోలాహలుని ఎగ జిమ్మగా అంతకుముందు ఆ పరిసరాలలో వెల్లువ గట్టియున్న శుక్తిమతీ జల ప్రవాహము తోడనే మరలి తీసిపోయెనని ప్రకృతార్థము.

శ్లేష చక్కగా పోషింపబడినది. కాని సరిజ్ఝరీ అను పదములే కార్థకములు నదీ ప్రవాహమని సరిపెట్టుకోవాలి.

154 శా॥ మొక్కల్ వోయిన తెక్కు మొక్కగ మితో మూర్చాల
సత్వంబుతో। జిక్కుల్ వడ్డ లతాద్రుమావలులతో శీర్ణోపల
శ్రేణితో। నకోల్లాహల ముర్వి వ్రాలియును నెయ్యం బొప్ప
నయ్యేటికే। గ్రుక్కిక్కళ్ మ్రింగుచు నుండె నండనె వసుక్షోణీ ధ
[illegible]

155 శ్లో॥ విదలిత ఘన పక్షో వేదనా మూర్ఛి తస్సన్
విశ కలిత లతాద్రు ర్వేగ శీ ర్ణోపల స్సన్
అహ హ భువి పతన్న ప్యద్రి రారాత్ స్రవంత్యా
వసు పతి ఘనభీతో వర్తతే స్మాధి లోలః

కోలాహలగిరి తనరెక్కలన్ని ముక్కలు పోయినట్టి మోడులై మిగులగా మూర్ఛపల్ల సత్తువ దూలగా, తనయందలి మ్రాకులు తీగలు తారుమారై ఒండొంటితో గజిబిజిగా పెనచికోగా తనయందలి రాళ్లదొర్లి పోగా నేలపై నొరగియు వలపు విడువక ఆ శుక్తిమతి కోసం ఆర్తితో గుటకలు మ్రింగుచు వసురాజు దిగులు పెట్టుటచే బలవంతముగా బయికొన జాలక సమీపముననే ఊరక పడియుండెనని భావము.

మూలాను గుణముగా భావ మను వదింపబడినది, కాని గ్రుక్కిళ్ళ్ర మ్రింగుచు అనునది జాతీయ మగుట వలన విడువబడినది. 'ఆధిలోలః' అను నది ఆ అర్థము. నొసగ జాలదు. 'లతాద్రుర్' చోట 'లతాగో' అని చేర్చిన పారుష్యము తొలగును.

156 క॥ నా విని పరమాద్భుత కల, నా విని పేశమున మించి నవముని యవధా। నా వలిత నేత్రుడై చెలి, నావలి కథ దెలుపు మని యెనధి క ప్రీతిన్.

157 శ్లో॥ హృదంత రుల్లా (స) నిధాన భూ భృ
దు దంత జా తాద్భుత సింధు మగ్నః
అనంత రాశ్చర్య కధా మపృ చ్ఛ
దనంత రాయా మధతాం స భీం సః

అనువాద ముచితముగా నున్నది.

